# జీవన్ టోన్

రిజిస్టర్డు నెం. 218726



పత్రికలలో ప్రకటనచేసిన ఔషధాలను సేవించి, ఫలితాలను పొందని వారు అనేకు లున్నారు. కాని జీవన్‌టోన్‌నుకొనుక్కొని దానిని ఉపయోగించి ప్రయోజనం పొందండి. జీవన్‌టోన్ కేవలం వనస్పతి కొవ్వు నుంచి తయారు చేయబడినది. జంతువుల కొవ్వు చేరుటవల్లనే ఈ అనుకోనటువంటి బలిష్ఠతకు కారణమని కొందరనుకొందురు. కాని అది యిందు చేర లేదు.

## జీవన్‌టోన్ గుణములు:

ఎంత మంచి ఆహారము తిన్నా ఎముకల పోగువలె, బలహీనంగా ఉండే వారు కొంతమంది ఉన్నారు. అట్టి వారికి జీవన్‌టోన్ మంచి బలాన్ని, లావును, బరువును ఇస్తుంది. ఆకలి లేనివారికి మంచి జీర్ణశక్తి నిస్తుంది. ఇది బలహీనత, కాళ్లు చేతులు తేలిపోవుట, తల తిరుగుడు, రక్తహీనతలను పోగొట్టి, పరిపూర్ణమైన దేహారోగ్యాన్ని, పుష్టిని ఇస్తుంది. శరీరం ఎరుపు ఛాయ పొందటానికి జీవన్‌టోన్‌తో టొమాటోలు తీసుకోండి. ఆరోగ్యవంతులకుకూడ జీవన్‌టోన్ మంచిది.

జీవన్‌టోన్ తీసుకొన్నప్పుడు మీరు కొంత శరీరవ్యాయామం చెయ్యటం మంచిది. లేకపోతే మీ శరీరం అనవసరంగా లావెక్కుతుంది. కావలసిన బరువు, బలిష్ఠత చేరిన వెంటనే జీవన్‌టోన్ సేవించడం నిలపడం మంచిది. స్థూలకాయులు జీవన్‌టోన్ తినుకొనుట మంచిదికాదు. స్త్రీలు బహిష్టుకాలంలో తీసుకోవకూడదు.

వెల: 450 గ్రాములు. రూ. 10/- *వి. పి. పి. కి వ్రాయండి*

# JOTHI HOSPITAL

POST BOX No. 1413, 32, VENKATANARAYANA ROAD, MADRAS-17.

*Resident Doctor:* **Dr. DAMODARAM,** M.A. I.A.D.S.

# "అమ్మ నాకోసం సింథాల్ పౌడర్ కొన్నది...అయితే

దీనిని చాలా మట్టుకు ఆవిడే వాడుతోంది."

హాయిని గొలిపే ఆ సువాసన అంటే,
ఆమెకు ఎంతో ఇష్టము. నాన్న కూడా
దానిని వాడతాడు...అద్భుతమైన జి-11
(హెక్సాక్లోరాఫీన్) శరీరము యొక్క దుర్గంధము
తనకు లేకుండా చేస్తుందని నాన్న అన్నారు.
అహా! నా ఒళ్లు ప్రేలకుండా కాపాడడానికి
వాళ్లు దానిని కొన్నారు...అది నాకు
ఎంతో అవశ్యకము!




## సింథాల్ టాయిలెట్ పౌడర్

మీకు హాయిగా నుండు నట్లు రుద్దిచేసుకోండి-జి-11
(హెక్సాక్లోరాఫీన్) గల సింథాల్ సబ్బు వాడిన
తరువాత, సింథాల్ టాయిలెట్ పౌడర్ రాసుకోండి

సింథాల్ టాయిలెట్
పౌడర్ ఇప్పుడు
ఆకర్షణీయమైన
3 డబ్బాలలో
దొరుకుతుంది.




జి-11®
ఆర్ గైగీ ఏజీ ఏ.
ఎస్. ఏ. వారి ట్రేడ్ మార్కు.

# ఉత్తరాలు

## సీరియల్

ఈవారం పత్రిక, పత్రికలోని విషయాలు యెంతో బావున్నాయి. కథలు ఒకదాన్ని మించి ఒకటి బావున్నాయి. సీరియల్స్ చాల బావున్నాయి "జాహ్నవి హైమవతులు" యీవారం చదివిన పిమ్మట తరువాత యేమవుతుందన్న ఆందోళనతో పత్రిక కోసం యెదురు చూస్తున్నాను. "మిగిలిం దేమిటి?" కథ రచయిత అసహజంగ వ్రాసారని నా అభిప్రాయము. సుచిత్ర తనకు తెలిసి తనంతట తానే సారథిని వివాహమాడి మరి బావ విశ్వంతో పోవుట యెంతో అసహజంగ వుంది. నిజంగ ఆ కథ చదువుతుంటే చాల దుఃఖమేసింది. "అందని అపోహ" కథా రచయితను యెంతో అభినందిస్తున్నాను. వారికి నా కృతజ్ఞతలు. ఇప్పటి పరిస్థితులలో వరకట్నాలు నిలువ లేకుండ ఆకాశాన్నంటుకుంటున్నవి. ఆడపిల్లల తల్లి దండ్రులు తమబిడ్డలకు కట్న మివ్వలేక వివాహము చెయ్యలేక పోతున్నారు. ఇలాంటి కథలు ప్రచురిస్తే పురుష లోకానికి కొంచెము కనువిప్పు కావచ్చేమో! అన్నిటి కన్న యీవారం ముఖచిత్రం యెంతో ఆకర్షణీయంగా వున్నది.

కుమారి జె. వి. హేమ (అనంతపురం)

## కథలు

ఈ వారము 17—3—67 సంచికలో డి. కామేశ్వరిగారు వ్రాసిన సీరెండలు చాల బావుంది. అది చదివి మీకు వ్రాయకుండ ఉండలేక పోతున్నాను. జాహ్నవి హైమవతులు కూడ చాల బాగుంటున్నది. వారందరికీ నా హృదయపూర్వక అభినందనలు.

వి. సుశీల (మద్రాసు)

* * *

ఈ వారం పత్రికలోని (17—3—67) అత్తిలి వెంకటరత్నం గారి "మిగిలిందేమిటి?" కథ చదివి, నా మనసు పిచ్చి పోయిన, అరగంట తర్వాత ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. ఈ మధ్య పత్రికలో ఎక్కువ కథలు, అన్నీ కొత్తతరహావే ప్రచురింప బడుతున్నవి. కానీ "మిగిలిం దేమిటి" కథవలె హృదయాలను కదిలించేది చాలా అరుదు. అందులోని "బావా నాకు ఆయనను చూడాలని ఉన్నది" అన్న మాట మర్చిపోలేము.

పి. యస్. హెచ్. షహజాది (ఉడిపి)

* * *

అత్తిలి వెంకటరత్నంగారి "మిగిలిం దేమిటి? కథానిక వాస్తవానికి చాలా దగ్గరగా నున్నది. చాలా బాగా వ్రాసేరు. మగవారి తొందరపాటు వలన సునీత జీవితం ఏమయిందో బాగా చిత్రించేరు. విశ్వం తొందర పడ్డాడు, సారథి తొందర పడ్డాడు. అయినా కథ ముగింపు కూడా చాల బాగున్నది. రచించిన వెంకటరత్నం గారికి ప్రచురించిన మీకు ధన్యవాదా లర్పిస్తున్నాను. యింకా ముందు ముందు మంచి కథలు పాఠకలోకానికి అందిస్తారని ఆశిస్తున్నాను.

మంగు సుబ్రమణ్య హిందిలికట్ (ఒరిస్సా)

17—3—67 వ సంచికలో మిగిలిందేమిటి?" అన్న కథ చదివాక ఇది కథేనా? లేక నిజంగా జరిగిన విషయమా అన్న సందేహం కలిగిందంటే నమ్మండి! వాస్తవికంగా రూపొందించిన 'రచయిత' శ్రీ అత్తిలి వెంకటరత్నంగారికి, ప్రచురించిన మీకు నా హృదయపూర్వక అభినందనలు.

కుమారి మాధవి. యస్. (కంకం)

* * *

యర్రంశెట్టి శాయిగారి 'చావు' అనే కథ నన్నెంతో కదిలించింది. "చావుని గురించి మాకు ధైర్యం చెప్పి తను వెళ్ళిపోయాడ్నార్" అన్న వాక్యము చదివి నా మనసు తెలియని బాధతో నిండి పోయింది. ఇలాంటి కథ చదివే అవకాశము కల్గించి నందుకు మీకు మా ధన్యవాదములు.

వి. ప్రభాకర్ కుంటాల (విజయనగర్ కాలని)

* * *

10—3—67 సంచికలో ప్రచురించిన "రజ యిత్రి" కథ చాలా బావుంది. రచయిత్రి శ్రీమతి పరిమళా సోమేశ్వర్‌గారు కథను నడపడంలో కొత్త దనాన్ని చూపించారు. రచయిత్రికి నా అభినందనలు.

వెంపటి వెంకటేశ్వరరావు (పూనా)

* * *

విధి వక్రించాంటేది. కొందరి కనుకూలంగా కొందరికి ప్రతికూలంగా ప్రవర్తిస్తుంది. హృద యాన్ని ఆకట్టుకునే విధంగా ఆ విధి తెచ్చిన మార్పును ఆకర్షణీయంగా శ్రీ బాబు నరహరిగారు 'విధి తెచ్చిన మార్పు' ద్వారా పాఠకుల కందించారు. వారికి నా హృదయపూర్వక శుభాభినందనలు. ఈ పత్రిక లోని కథలన్నీ నన్నాకర్షించాయి. ప్రేమయే రచ నేతివృత్తంగా భావించక పేదర రచయితలు, సామా జిక సమస్యలను, వాటిని సులువుగా పరిష్కరించే మార్గాలు తమ రచనల ద్వారా వెలికి తెచ్చి మానవ శ్రేయస్సుకై సర్వవిధాలా కృషి చేస్తారని ఆశి స్తున్నాను.

పద్మనాభంగారి 'ఎందుకు' ప్రతివారిని ఆకర్షి స్తున్నది.

ఆర్. పురుషోత్తమరావు (రాజాం)

* * *

పత్రిక వెల 40 పైసలకి పెంచారన్న చింత ఈ వారం పత్రిక చూసిన తర్వాత తీరిపోయింది. నాలుగు కథలూ, నాలుగు సమీక్షలు. ముఖ్యంగా '(ప్రేమ, చివరికి మిగిలేవి జ్ఞాపకాలు'— ఈరెండూను రచయితలు రాజేశ్వరరావు, పుల్లారావు గార్లకు అభినందనలు.

సీరియల్స్ రూపంలో ప్రచురిత మవుతోన్న మూడు నవలలూ ఉత్కృష్ట శ్రేణికి చెందినవి. హైమవతి, ఉమాపతుల పాత్రలు పాఠకుల హృద యంలో చిరకాలం మసులుగలవు. మంచి గెటప్‌తో, చక్కని శీర్షికలతో ఆకర్షణీయంగా మా చేతుల నలంకరించిన పత్రిక స్థాయిని సదా ఇల్లాగే నిల బెట్టగలరని నమ్ముతూ—

తెన్నేటి రామారావు. రాజేంద్ర ప్రసాద్‌దాస్, ఝార్సుగూడా, (ఒరిస్సా)

* * *

**ఢిల్లీ లేఖ**

శ్రీ కృష్ణగారు ఈసారి ఢిల్లీ లేఖలో యీనా త్వాన్ని యదార్థముగా చెప్పక గుట్టు దాచి వేయారు. ఢిల్లీ లోక్‌సభ సీట్లు 6 లోనూ, మెట్రోపాలిటన్ కౌన్సిల్లోనూ, కార్పొరేషన్‌లోనూ మంచి మెజారిటీ జనసంఘం వశమైంది. దీనికి కారణము ఒక్క కాంగ్రెసు వర్గాల కీచులాటనే చూపారు. కానీ జనసంఘం యొక్క ఉద్దేశాలు వలన, ఆదర్శాల వలన కాదంటారు. ఇది విలోమ దృష్టి తప్ప మరేమికాదు. ఢిల్లీ ఒక రాజధాని కాకుండా అదొక అంతర్జాతీయ కూడలి స్థలి. అన్ని జాతులు సమ్మిశ్రితమై, వివిధదేశాల ప్రతినిధులు, విద్యావివేకులు, సామాన్యులు వున్న చోటు. మొత్తము 163 స్థానాలుకు— కాంగ్రెసువారు 152 మందిని జనసంఘం వారు 152 మందిని నిలబెట్టడము జరిగింది. ముఖ్యముగా లోక్‌సభకు, జనసంఘం 6 అభ్యర్థులను నిలబెట్టడము అవి పూర్తిగా వారి వశము కావడము ఒకటే మాత్రము, అనగా 7 వది కాంగ్రెసు వశము కావడము జరిగింది. ఇదంతా ఒక్క కాంగ్రెసు పైయున్న అసహ్యము తప్ప జనసంఘంపై యున్న ఏ ప్రత్యేకాభిమానము వలన కాదు అనుట ఔచిత్యానికి విరుద్ధభావన తప్ప వేరొండు కాదు. జనసంఘం ఒట్టి మత సంస్థ, సంకుచితత్వపు పార్టీ అంటూ నిన్నటి మొదలు అందరూ బాగా వూదిన వారే! యిది తమ దృష్టి లోపమని వారికి తెలియకపోవడమే. గొప్ప విషయమేమంటే మనకంటే ఒక విదేశీయుడు "శ్రీ హెవా సిలర్" (న్యూయార్క్) బాగా విశాలదృష్టితో, చెప్పడము గుర్తుంచుకోవలసిన విషయము. జనసంఘంలో కొన్ని మార్లు మంది ముస్లింలు, క్రైస్తవులున్నారు. అలాంటప్పుడు అది కరుడు గట్టిన మతసంస్థ, తిరోగమించే పార్టీ అని ఎలా అనగలరు? యీసారి ఎన్నికల్లో సుమారు 20 మంది ముస్లింలు, 10 మంది క్రైస్తవులు అభ్యర్థులుగా (జనసంఘం) పోటీ చేసి యుండిరి.

ప్రతి జాతికి ఒక చరిత్ర వుంది. ఒక ... వుంది. మనుగడను, ఆదర్శాలను ... పురోగమింపచేయుటకు అది ... తలను ప్రసరింపచేస్తుంది. భవిష్యత్తు ... సందేశాన్ని పొందుతామన్న ప్రయోజనాన్నిచ్చే గతాన్ని తిరిగ్రంచుకొంటూ మననము చేసుకుంటాము. వర్తమానంలో మనకుమనం అసమర్థులుగా కన్పించినప్పటికీ గతంలో మనసామర్థ్యాన్ని దర్శించుతూ పునఃవుత్తేజులై నిగుడుతూ వుంటాము. అలాంటి భావాలు సమ్మిశ్రితమై యున్న పార్టీ ఒక్క జనసంఘం మాత్రమే. గతాన్ని ఘనంగా సంభావన చేసేదాంట్లో విదేశీయులనుండి ఎంతైనా కోరవలసి యున్నది.

అటువంటి జనసంఘం పార్టీ యీసారి ఎన్నికల్లో కాంగ్రెసు తర్వాత వివిధ శాసనసభ స్థానాల్లో సుమారు 300 స్థానాలలో రెండవ పెద్దపార్టీ కావడము, లోక్‌సభలో ముందున్న 12 స్థానాలునుండి యీసారి 35 స్థానాలు వరకూ పెరగడము—సుమారు మూడురెట్లు కావడము— దాన్ని చులకన చేయలేము. ముఖ్యముగా శ్రీ కృష్ణగారు తమ లేఖలో జనసంఘాన్ని మరీ ఘాటుగా విమర్శించడము తమ ప్రాస్య దృష్టిని ప్రదర్శించడము తప్ప మరేమీ లేదు. మంచి

ప్రజాస్వామ్యం, సంకీర్ణ రాజకీయ వ్యవస్థ, విదేశ శాంతి పరిగ్రహణం, జాతీయతత్వము వంటి జన సంఘం అందరిచే మన్నించబడడమే కాకుండా కొన్ని విశేషాలకు పరిధి ప్రయోజనాన్ని గుర్తించడమూ, దాని పటుత్వానికి నిదర్శనము. అలాంటప్పుడు శ్రీ కృష్ణగారు అనుకుంటున్నట్లు తను మేధా సంపత్తితో ఏకోమ హాత్మ్యమూ విమర్శించడము సమంజసము కాదు.

టి. హరనాథగుప్త (పుంగనూరు)

* * *

ఈవారం (17—3—67) పత్రికలో ప్రచురించిన వ్యాసాలు చాలా బాగున్నాయి. మంత్రివర్గ నిర్వహణాన్ని నిశిత విమర్శలతో కూడిన సత్యాధికృత రేఖ మిక్కిలి కుతూహలంగా వుంది. నేటి కాంగ్రెసు నిష్క్రమణకి కారణం ఈ ఉన్నత పదవీ వ్యామోహమేనని స్పష్టం చేస్తున్నవి.

అభినవాంధ్ర సాహితీలోకంలో దిట్టలైన శ్రీ రాజకొండ విశ్వనాథశాస్త్రిగారు, శ్రీమలకా గణపతి శాస్త్రిగార్లతోపాటు సన్నిధి గారిలో ఆంధ్ర పురాణం వ్రాస్తున్న శ్రీ మధునా పంతుల సత్య నారాయణశాస్త్రిగార్ల మీద వ్యాసం చాలా బాగుంది. ఇటువంటి మేటి రచయితలను గౌరవించి సాహిత్య ఎకాడమీ తన స్థాయిని నిలబెట్టుకొన్నదనడంలో సందేహం లేదు. ఇకపోతే, అంతర్జాతీయ విఖ్యాతి గన్న ఉత్తర బొంబాయి స్థానాన్ని కృష్ణమీనన్ ...

## ట్రాన్సిస్టర్లు

వాయిదాల చెల్లింపుపై ట్రాన్సిస్టర్లు.
రూ. 255 విలువ గల 'ఎస్‌కార్ట్'
3 బ్యాండ్ ఆల్ వరల్డ్ పోర్టబుల్
ట్రాన్సిస్టర్ను రూ. 25 ల నెలసరి
వాయిదాలపై పొందండి.

JAPAN AGENCIES (WAPM-77)
Post Box 1194, Delhi-6.

# ఉత్తరాలు

గెలుపొందిన భార్గవగారు కాంగ్రెసు పదవులు దక్కిస్తే, మొట్టమొదటిసారిగా అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షునిగా గెలుపొందిన శ్రీ శ్రీనివాసన్ మద్రాసులో మాతన శకారంభం గావించారు.

తోగలాబ జబర మమహర్తి (భద్రాచలం)

* * *

శ్రీ కృష్ణగారు కొన్ని వారాలుగా తమ సవ్యాధికృత రేఖలో ముస్లింలను టయ్యాబట్టడమే పనిగా పెట్టుకున్నట్లున్నారు. ఏవో కొన్ని లోటుపాట్లు చూపిస్తున్నారని సర్దుకున్నా, ఎంతో పవిత్ర గౌరవ భావాలతో చూచే ఇస్లాం మత ప్రవక్తని ఆయన విమర్శించడం ఏమి బాగలేదు. ఏదో సామాన్య విషయాలకి మత ప్రవక్తల వుదాహరణ ఇవ్వడం హర్షించ దగ్గ విషయం కాదు. ఈ రేఖలవల్ల ఆయన కెంత మతపక్షపాతం వుందో స్పష్టమవుతోంది.

ఇక ముందైనా ఇలాంటి అసంబద్ధమైన విషయాలు రాయరని ఆశిస్తాను.

మిసెస్ సలీమా (మ్యాడ్‌ఫీల్డ్)

### ముఖచిత్రం

ఈవారం (17—3—67) ముఖచిత్ర రచన చాల చక్కగా చిత్రించారు. అందులో హావభావాలు చాల కొద్ది కాపీచే వచ్చాయి. ముఖచిత్రం చూడగానే ఇది ఏ పత్రిక (మేగజైన్) అని అడిగిన నా మిత్రులకు సమాధానం చెప్పుటకు చాలా కాలం పట్టి నదంటే ఆశ్చర్యపడవచ్చు. హిందువులకు పుణ్యక్షేత్రమైన ఈ వారణాసిలో శక్తిని నంది వాహనముగా ఈ చిత్రము కాన్పించే టప్పటికి చాల మెచ్చుటగా యున్నది.

ముందు ముందు కూడ ఇటువంటి దైవ సంబంధమైన చిత్రములు చిత్రించాలని, చిత్ర కారునకు నా అభినందనలు తెల్పవలసినదిగా కోరుతున్నాను.

శ్రీమతి కె. రజని తమణమూర్తి (హైదరాబాదు)

### శ్రీ కల్యాణహోమి

మీ వారపత్రికలో ఏది శీర్షిక చూచిన ఒకటి రాసి ఈ ఉత్తరం రాయకుండా ఉండలేక పోతున్నాను. క్రొత్త నటీమణుల పరిచయాలతో పత్రికలో పేజీలు నింపి వేస్తున్నారు. పినికొరకు వేసే ఫోటోలు అసభ్యకరంగా తోచుచున్నాయి. 17—3—67 పత్రికలో వేసిన నటి శ్రీదేవి ఫోటో అసహ్యంగా ఉన్నది. ఇటువంటి జనాదరణ పొందిన పత్రికలో ఈ ఫోటోలు ప్రచురించి మీ పత్రిక విలువ తగ్గించుకుంటున్నారు. ఇకముందైనా వీటిని ఆపివేయమని ప్రార్థన. బహుశా మీరు దీనిని ఉత్తరాల శీర్షికలో ప్రచురించరనుకుంటాను.

ఒకరు (మధిర)

### వ్యాసాలు

"నా విదేశయాత్ర" చాలా చక్కగా కన్నులకు కట్టినట్లు రచయిత్రి రాశారు. ఒకవేళ మేము రష్యావెళ్ళినా ఇంత చక్కగా అర్థంచేసుకోలేక పోయే వాళ్ళం. రష్యాని, జమునగారి మొదడుతో చూశాము యిప్పుడు. శ్రీమతి రమణారావుగారికి నేరే ధన్యవాదాలు వ్రాయాలంటారా?

మత్రినామారావు (మ్యాడ్‌ఫీల్డ్)

### కార్టూన్లు

స్త్రీలను విమర్శిస్తూ వచ్చే వ్యంగ్య కార్టూన్లను హాసిగ్గా సహిస్తున్న మేము 29 వ పేజీలోని జయదేవ్‌గారి కార్టూన్ని చూసి చాలా బాధపడ్డాము. హాస్యం పండించాలికాని, భావాలను గాయపరచ రాదు. స్త్రీలు మిన్నకుంటారనే ధైర్యం కాబోలు క్రమ క్రమంగా పత్రికలో కథలేంటి, వ్యాసాలేంటి, అన్నీ స్త్రీలను హీనులుగా చిత్రిస్తున్నాయి. ఈ విజాన్ని మీరు పాఠకులు కాదనలేరు. స్త్రీ విలువని గుర్తించే రచయితలు ఎప్పుడొస్తారో నని ఎదురు చూస్తున్నాము. నా ఈ ఉత్తరానికి ప్రభావం ఉంటుందంటారా లేక చెత్తబుట్టపాలు చేస్తారా?

వి. పద్మ, (హైదరాబాదు.)

# ఇది మీకు తెలియదా? ఎవరూ చెప్పలేదా?

చదివే అలవాటువల్ల అనేక క్రొత్త విషయాలు తెలుస్తాయి. అనుభవం, విజ్ఞానం ఎక్కువవుతాయి. జీవితం ప్రతిక్షణం పలు రకాలతో అనేకవిధాల అభివృద్ధి అవుతుంది. అయితే నిత్యజీవిత వ్యాపారాలతో సతమతమౌతూ అన్ని పత్రికలు, ప్రతిదీ కొనిచదివే తీరికఉండదు. దానితో తెలుసుకోవలసిన అనేక మంచి విషయాలు తెలియకుండా పోతాయి. మీకు శ్రమలేకుండా యీలోటును భర్తీ చేయటానికి ప్రతిసంవత్సరం అన్నిమంచి పత్రికలు, పుస్తకాలు, సంవత్సరమంతా అత్యుత్తమంగా చదివి, వాటిలో అనుభవాన్ని ఆనందాన్ని, విజ్ఞానాన్ని, ఆశ్చర్యాన్ని ఎక్కువచేసే అనేక గొప్పవిషయాలు ఏరికూర్చి, "తెలుసుకో దగ్గవి" అనే పుస్తకరూపంలో సంవత్సరానికోభాగంగా తెలుగులో ప్రచురించబడుచున్నది. చివరకు మిగిలేది, మనతో నిల్చేది, మనందరికి తెలుసుకొనే విజ్ఞానం మాత్రమే. మొదటి భాగం తయారుగా ఉన్నది. ఇందులో మీరు వెంటనే తెలుసుకోదగ్గ అనేక రకాల అద్భుత విషయాలున్నాయి. పది సామాన్య జన్మలలో రాని అనుభవ ఆనందాలను, ఒక్కసారి కాల క్షేపంగా, చదివినంతలో పొందగలరు. కుటుంబంలో అందరికి ఉపయోగిస్తుంది. మీ యింట్లో విద్యార్థులకు కూడా ఎంతో లోకజ్ఞానం ఇస్తుంది. చదవటం మొదలిడితే పూర్తి అయ్యేవరకూ వదలరు. చదువులో యిదివరకు మీరు చవిచూడని ఎన్నో గొప్పరుచులు చూపిస్తుంది. దానెత్తు బంగారం అయినా పోలే యింకా కొని చదవదగ్గ విషయాలందున్నాయి. ఒకసంవత్సర శ్రమఫలితం. రచన ఎ. ఎస్. మూర్తి, యం.ఏ. 320 పేజీలు. ధర పోస్టు ఖర్చులతోసహా రూ. 5. ఇది మీరు చదివేక, మీమనసిష్టంగా మీకనుకొన్నట్లు లేదనుకొంటే, మీకు పుస్తకం అందిన మూడు రోజుల్లో తిరిగిపంపిస్తే, ధరలో పోస్టుఖర్చు రూ. 1 పోను, మిగతా రూ.4 మనియార్డరుగా మీకువెంటనే తిరిగి పంపబడును. ప్రతిపేజీలోను రత్నాలలాంటి అనేక అమూల్య విషయాలున్నాయి. ఇవే మీరు స్వంతంగా తెలుసుకోవాలంటే అనేకవందలరెట్లు ఖర్చు శ్రమ అగును. అలాంటి శ్రమలేకుండా యిది మీకు అమర్చి పెట్టినట్లు అందుబాటులో ఉంది. ముందుగా డబ్బు పంపే పనిలేదు. పోస్టు ప్రతులు ఏలూరు, ఆంధ్రకు ఉత్తరం వ్రాస్తే పోస్టుఖర్చులతో సహా రూ. 5 లకు వి. పి. పోస్టులో పంపబడును. ఇదిమీరు త్వరపడవలసిన చక్కటి అవకాశం.

Swastik

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు.

శుక్రవారం : 31—3—'67
పరాభవనామ సం॥ ఫాల్గునమాసం బహుళ షష్ఠి
సంపుటము : 59 సంచిక : 29

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

చందా వివరాలు : 10-2-1967 మొదలు
భారతదేశం

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |
| విడిప్రతి | 0.40 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన: 'గౌనిసెట్టి'











# శ్రీమతి ఇందిరాగాంధి "దర్బారు" — శ్రీయుత మొరార్జీదేశాయ్ కర్తవ్యం

అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామరాజ మరొకసారి తమ కృషిని సార్థకం చేసుకున్నారు. కొందరు ఆయన్ని అయోగ్యుడిగాను, ఓడిపోయిన వాడుగాను జమకట్టినా, కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ నాయకత్వం ఎన్నికలో స్పర్థ లేకుండా చేయడానికి, ఏకగ్రీవమైన ఎన్నిక జరగడానికి, ఎన్నో వ్యయప్రయాసల కోర్చి ఎట్టకేలకు కృతకృత్యులయ్యారు. శ్రీమతి ఇందిరా గాంధి, శ్రీయుత మొరార్జీ దేశాయ్‌గారలు ఒక ఒప్పందానికి వచ్చి పరస్పర వైరుధ్యాలు రూపుమాపుకున్నారు. ఇదో శుభప్రదమైన విషయం. శ్రీయుత మొరార్జీ దేశాయ్‌గారు తను దేశీయాంగ శాఖ గుర్రాన్ని దిగడానికి సమ్మతించారు. శ్రీమతి ఇందిరాగాంధి సహాయ ప్రధాన మంత్రి పదవికి తామిదివరలో చూపిన విముఖతనూ సడలించుకున్నారు. ఇప్పుడు ఏగొడవా వుండదు. మొరార్జీ దేశాయ్‌గారు శ్రీమతి ఇందిరా గాంధికి అన్ని విధాలా చేయూతనిస్తానని ఆంక్షలు లేకుండా వాగ్దానం చేసేశారు. యాభయిద్దరి మెజారిటీ మాత్రమే ఉన్నప్పుడు నాయకత్వం ఎన్నికలో స్పర్థ అపాయకరమైనదని అందరూ భయపడ్డారు. కాంగ్రెసు పార్టీకి అదొక గండంగా ఎంచుకుని శ్రీ కామరాజు శ్రమపడ్డారు. ఎన్నికలు జరిగే కొద్దీ పార్లమెంటులో ప్రభుత్వ పక్షానికి చెందిన బెంచీల మీద మనుష్యులు తరిగి పోతున్నారు. బెంచీలకూ బలం తగ్గి పోతూ వుంది. ఇది ఇలా ఉండగా ప్రతి పక్షంలో సుమారుగా ఇరవై మంది హేమా హేమీ లున్నారు. ప్రతిపక్షం బలం ఇంత ఉధృతంగా ఉండికదా కాంగ్రెసువారు ఆఘాటికి కట్టుకోగలరా అనేది సంశయాత్మకమైన విషయం. 1966 జనవరిలో శ్రీమతి ఇందిరాగాంధి మొరార్జీ దేశాయ్ గార్ని గెలిచారు. ఆసంవత్సరం కాంగ్రెసు సభ్యులు తమ తమ ముఖ్యమంత్రులు తమకు కాంగ్రెసు టిక్కెట్టు ఎక్కడ ఇవ్వకుండా పోతారో అని భయపడి గంగిరెద్దుల్లా తలూపి స్వామి భక్తిని ప్రకటించుకున్నారు. అందుకు వారు ప్రతిఫలం పొందకపోలేదు! మరో అయిదు సంవత్సరాలు వారివారి స్థానాల్లో స్థిరంగా తిష్ఠ వేసుకొని కూర్చున్నారు. శ్రీమతి ఇందిరాగాంధి పరిపాలనకు శ్రీ కామరాజు సవరణలు ప్రతిపాదించారనీ, తద్వారా ఒండొరులూ ఎడముఖం పెడముఖంగా ఉంటున్నారనే విషయం మనందరకూ తెలిసిందే. శ్రీమతి ఇందిరాగాంధి వైఖరి ఆయనకు సుతరామూ నచ్చని కారణంచేత, ఎవరి వైనా అనుకూలమైన వాడిని, పరిపాలనా దక్షుణ్ణి కేంద్ర మంత్రి వర్గంలో నింపబడితే బాగుంటుందని ఆయన అభిప్రాయ పడ్డారు. ఇప్పుడు ఆయన తటస్థంగా వూరుకునేవారే! వాతావరణం కొంచెం అలజడిగా మారడంతో, ఈ చినుకు గాలివానకు దారి తీసి కాంగ్రెసును ఊడిచి పెట్టుకుపోతుందేమోనని భయపడ్డారు. ఏకగ్రీవమైన ఆమోదంతో నాయకత్వం ఎన్నిక జరిగేలా చూడడం ఆయన కర్తవ్యమయిపోయింది. కాంగ్రెసు ఇక సక్రమంగా పని చేస్తుంది అనే ఒక ధైర్యాన్ని కల్పించారు. మొరార్జీ దేశాయ్‌గారు మంత్రివర్గంలోకి వచ్చారు గనుక ఇప్పుడు పరిపాలనలో సంతృప్తికరమైన మార్పులు రావాలి!

ఆర్థిక మంత్రిత్వాన్ని అధీనంలో ఉంచుకున్న శ్రీ మొరార్జీ దేశాయ్ చాల గడ్డు సమస్యల్ని ఎదుర్కోవలసి వస్తుంది. దుస్తరమైన, భారమైన కార్యక్రమాన్ని రూపొందించుకొని ప్రవాహానికి ఎదురీదాలి. భారతదేశం ముఖం మీద ఇప్పుడు స్థిరమైన ఆర్థిక మాంద్యం తొంగి చూస్తున్నది. ఇదొక ఎత్తు. మరో ప్రక్కన కనీసం ఆరు రాష్ట్రాల్లో నయినా కాంగ్రెసేతర పక్షం వారి ప్రభుత్వాలున్నాయి. పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రిగారు అప్పుడే లోటు బడ్జెటును ప్రకటించారు. బీహార్ ముఖ్యమంత్రి తన బొక్కసం తెరచి చూసి, కేంద్ర ప్రభుత్వానికి రోసేలా నోరు తెరచి ఆశ్చర్యం ప్రకటించారు. మద్రాసు ప్రభుత్వం ఆహార ధాన్యాల రవాణాను అరికడుతూ దారుల్ని కట్టేసింది!

కేంద్ర ప్రభుత్వానికి నరాల బలహీనత అయినా వుండాలి, లేక రాష్ట్రాల్లో స్వపక్ష పరిపాలకులపై పక్షపాతమైనా వుండాలి. కాకపోతే రిజర్వు బ్యాంకు నుండి ఈ 'ఓవర్ డ్రాఫ్టు'ల పేరుతో జరుగుతున్న దోపిడీకి అడ్డు చెప్పకుండా వుంటుందా? ఈ 'ఓవర్ డ్రాఫ్టు'లు నిరంతరమూ కేంద్ర ప్రభుత్వామోదాన్ని పొందుతూనే ఉన్నాయి. ఈ పద్ధతిని ఇప్పుడు అకస్మాత్తుగా నిరోధించినట్లయితే, కొన్ని రాష్ట్రాల్లో కాంగ్రెసేతర పక్షాలు రాజ్యం చేస్తున్నాయి గనుక [illegible] ప్రభుత్వం తన విధానం మార్చుకుంది. అని నిందించడానికి ఎంతయినా అవకాశం ఉంది. కాని ఈ విధానం ఇలాగే కొనసాగితే 'ఆర్థిక క్రమశిక్షణ' అని చెప్పబడుతున్న నేటి మాటలకు విలువా వుండదు, వచ్చే కష్టనష్టాలకు కొదవా ఉండదు!

ఎన్నికలకు పూర్వం, వోట్లను కూడబెట్టుకునేందుకు ఉద్యోగస్థుల కరువు భత్యం పెంచి భూమి శిస్తును తీసివేసి, కొరివి పెట్టి నెత్తి గోక్కున్నది ప్రభుత్వం. రాష్ట్రాల్లో ఆదాయం పడిపోయింది. కరువు భత్యం పెంపుదల జీతాల క్రింద మరో పంచకోట్ల రూపాయలు రాష్ట్ర ప్రభుత్వానికి ఖర్చు తగులుతుంది. ఇక, అభివృద్ధి కోసం చేసుకునే పథకాల్ని తగ్గించుకోవలసి వస్తుంది!

## ఆర్థిక దుస్థితి

1966—67 బడ్జెట్‌లో మొత్తం 32 కోట్ల లోటు కనిపించింది. క్రిందటి సంవత్సరం నుంచి ఈ లోటు మరీ విపరీతమయింది. ఆకాశాన్నంటే ధరలు క్షీణించిన ఉత్పత్తి, కరెన్సీలో విస్తృతి — వీటిని యోగ్యతలుగా చేసుకుని పన్నులు పెంచడం ద్వారా ఆదాయాన్ని పెంచుకోవచ్చునని అనుకుంటే, అంతకంటె దురభిప్రాయం మరొకటి వుండదు.

ఇప్పుడున్న భారతదేశ ఆర్థిక పరిస్థితి దృష్ట్యా విదేశీ మారక విధానంతో దీర్ఘకాలిక పద్ధతుల ఒప్పందాలు అంతగా పనికిరావు. కొన్ని విషయాల్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు ఇటువంటి రాబడిని పెంచుకోవడం అంత ఉత్తమమైన పద్ధతిగా కన్పించదు. రూపాయి విలువ పడిపోయినప్పటి నుంచి, దేశం నెలనెలా ఎంతెంత ఎగుమతి చేస్తున్నదీ అనే లెక్క లేకుండా ఉంది. దానికొక తీరు తెన్ను అంటూ ఏమీ కన్పించదు. క్రిందటి సంవత్సరం రూపాయి విలువ తగ్గించే దానికి పూర్వం కంటే ఆతర్వాత రెండు నెలల్లోనూ ఎగుమతులు పడిపోయినవని చెప్పడానికి నిదర్శనాలున్నాయి. ముఖ్యంగా రూపాయి నాణెంతో వ్యాపారం జరిగే విదేశాలకు మన ఎగుమతులు ఎంతగా తగ్గిపోయినవో తెలుసుకోడానికి లెక్కా జమా అంటూ ఏమీ లేవు. ఆదిలో ఇలావున్నా తర్వాత్తర్వాత పుంజుకుని మన ఎగుమతులు ఒక స్థిరత్వానికి వచ్చాయనే చెప్పాలి.

అప్పులు చెల్లించడం ద్వారా వికరమైన విదేశీ మారకంలో తరుగు ఏర్పడుతూ వుంది. భారత దేశం ఆర్థిక పరిస్థితిని గమనించిన కొన్ని విదేశాలు దేశాన్ని ఋణబాధనుండి తొలగించడానికి గాను సదుపాయాలను చేస్తూ వస్తున్నాయి. ఈ సంవత్సరం కెనడా దాదాపు పదికోట్ల రూపాయల అప్పును ఉపసంహరించుకున్నది.

రూపాయి విలువ తగ్గించినప్పటి నుంచి మన ఖజానా ఖాళీ అయిపోతూ వస్తోంది. అసలు అక్టోబరు డిసెంబరు నెలల మధ్య రాబడి పెరిగి ఉండాలి. కాని అట్లా జరగలేదు. తరుగే ఎక్కువ కనిపించింది. ఆర్థికవేత్తలనే దేమిటంటే జనవరి నుంచి మార్చి వరకు పరిస్థితి బాగా దిగజారి పోతుందని. ఏప్రిల్ నుంచి సెప్టెంబరు వరకు ఎలా వుంటుందో మాత్రం ఎవరూ చెప్పలేదు. స్వానుభవంతో పరిశీలించి చూద్దామన్నా మనకా అవకాశం తక్కువ. ఈ అంచనాలే సరి అయినవయితే 1967—68 సంవత్సరంలో మన కోశా

గారంత ఖాళీ అవడం ఖాయం. అప్పుడు యీ కఠినమైన పరిస్థితి ఎటూరో క్రమంగా వస్తుంది. సరదాపడి రూపాయి విలువ తగ్గించేశాం, కాని తత్పరిణామాలకు భయపడకుండా విశ్రాంతిగా ఉండడమనేది ఇంకో మాట!

రూపాయి విలువ తగ్గించక ముందు భారతదేశపు 'దిగుమతుల బిల్లు'లో పి. యల్. 480 మినహాయించి దిగుమతి రు 1200 కోట్లదాకా ఉంది. ఋణం సంవత్సరానికి రు 200 కోట్లుంది. ఎగుమతుల వల్ల రు 800 కోట్ల ఆదాయం వుండేది. ఆహారానికి సంబంధించిన దిగుమతులకుపోను ఎలా లేదన్నా రు 600 కోట్లు లెక్క తేలేది. వచ్చేరెండేళ్ల వరకు ఇది ఇలాగే వుంటుంది. నాల్గవ ప్రణాళికలో కొత్త ప్రాజెక్టుల క్రింద అయ్యే ఖర్చు లను కొంత తగ్గించినా ఈపరిస్థితి ఇంతకన్నా బాగుపడే విధానం లేదు.

సన్నిహితంగా వుంటే దేశాల సహకారంవల్ల, విదేశీ పెట్టుబడులవల్ల, మన విదేశీ మారకద్రవ్యం నిల్వలకు వంతెన వేసుకొని నెమ్మదిగా గట్టెక్కేందుకు ప్రయత్నించ వచ్చును, అనే ధైర్యం ఒకటుంది. కప్పల తక్కెడ వంటి రాజకీయ స్థిరత్వం, పై రెండు విధాలకూ అనుకూల వాతావరణాన్ని సృష్టించడం లేదు.

నాల్గవ ప్రణాళికలో ప్రాజెక్టులగురించి ఆలోచిస్తున్నప్పుడు అసలవి అగపడ్డం లేదు. మబ్బుల్లో దోబూచు లాడుతున్నాయి. ఈ ప్రణాళికలో వేసిన ప్రాజెక్టులకోసం కనీసం రు 2450 కోట్లనన్నా కేటాయించాలి. లెక్క తేలేది రు. 500 కోట్లు మాత్రమే. అదీ చాలా దూరంగా కనిపిస్తోంది. వెంటనే విదేశీ మారక ద్రవ్యాన్ని కేర్పరచిన ఖాళీ భర్తీ చేద్దామనీ, నిత్యావసరాలకు సరిపడా నింపుకుందామనీ, విదేశాలకు వంతెనలు నిర్మించి వెనువెంటనే ప్రయాణం సాగిద్దామని తొందర పడినా అకస్మాత్ పరిణామాలకు ఏమాత్రమూ అవకాశం లేదు. మొట్టమొదట భారత దేశం దిగుమతుల్ని తగ్గించుకోవాలి. అందుకోసమయ్యే ఖర్చును ఆదా చెయ్యాలి. ఆతర్వాత పరిశ్రమల్ని అభివృద్ధి పరచాలి. వ్యావసాయికోత్పత్తిని అధికం చెయ్యాలి. ఋణవిముక్తి కోసం తంటాలు పడకుండా ఏదో విధంగా రాజీ కుదుర్చుకొని కొన్నాళ్లపాటు ఓపిక పట్టుకుని విదేశాల అనునయించాలి ఇదీ, ఇప్పుడు చేయవలసిన పని.

నాల్గవ ప్రణాళికలో నెలకొల్పా లనుకున్న శక్తిమించిన ప్రాజెక్టుల్ని భద్రంగా దాచిపెట్టి, అభివృద్ధి పరచాలనుకున్న ప్రాజెక్టుల్లో 30 శాతాన్ని మన ఆర్థిక పరిస్థితి బాగు పడేవరకు అట్టే పెట్టి వుంచాలనే అభిప్రాయం వుంది. ఈ 30 శాతం అభివృద్ధి అంటే, ప్రాజెక్టు ఆఫీసర్లకు, ఇంజనీర్లకు ఒక అరడజను ఇళ్లను నిర్మించడాన్ని వాయిదా వేయడ మన్నమాట. !

ఇప్పుడు శ్రీ మొరార్జీ దేశాయ్ భుజాలమీద భగీరథ ప్రయత్నం ఉంది! ఆయనపరిస్థితి చక్కబరచటానికి ఎటువంటి నిర్దుష్టమయిన చర్యలు తీసుకున్నా ప్రజల్లో దుష్ప్రచారం అయిపోవడం మాత్రం ఖాయం.! పరిపాలన సరిదిద్దే సంఘానికి ఆయన చెయిర్మన్‌గా ఉండేవారు. విషయాలను కష్టంగా అర్థం చేసుకుని సంయుక్తంగా ముందడుగు వేసి లోటుపాట్లను సరిదిద్దడంలో ఎలాంటి చాకచక్యం చూపిస్తారో మనం వేచి చూడాలి!

# శ్రీమతి ఇందిరాగాంధీ 'దర్బారు'

శ్రీమతి ఇందిరాగాంధి తమ 'దర్బారు'ను పునర్వ్యవస్థీకరించు కున్నారు. ఆమెతో కలసి పందొమ్మిది మందికి కీలక స్థానల్లో అమర్చు కున్నారు. మరో పద్నాలుగురు రాష్ట్రమంత్రు లున్నారు. ఇది వారి ప్రస్తుత మంత్రి వర్గం. మరి కొందరు కలుస్తారు. సిండికేట్ నాయకుడు శ్రీ సంజీవరెడ్డిని ఇందులో నుంచి వెల వేశారు. శ్రీయుతులు అతుల్యఘోష్, యస్కె పాటిల్‌గార్లను ప్రజలే నొక్కి పారేశారు. శ్రీమతి గాంధికి, శ్రీయుత కామరాజుకు సయోధ్య చెడింది. ఆమెకు శ్రీ కామరాజు అంటే అసలు పడ్డంలేదు. ఇప్పుడు మరీ అయిష్టత చూపుతున్నారు. మంత్రివర్గ నిర్మాణంలో శ్రీమతి గాంధి మొరార్జీ దేశాయ్ గారి సలహా తీసుకున్నారు. అన్ని నియామకాలు పూర్తయిన తర్వాతనే ఆఖరి లిస్టును శ్రీ కామరాజుకు చూపించారు.

మంత్రివర్గమంతా శ్రీమతి ఇందిరా గాంధి బంధుకోటి! ఫక్రుద్దీన్ అహ్మద్‌గారు ఆమెకు కుటుంబ స్నేహితుడు. ఆయనను ఇదివరలో శ్రీమతి ఇందిరా గాంధి ఆర్థిక శాఖకు పట్టాభిషిక్తుడ్ని చేశారు. ఇప్పుడు పరిశ్రమల మంత్రి. మరో ఛోటారాజా దినేష్‌సింగ్ గారున్నారు. ఈ ఘనత వహించిన రాజాగారు శ్రీమతి గాంధి గారికి వ్యక్తిగతమైన మిత్రులు వారు వాణిజ్య శాఖను ఏలుతారు! మరో కాశ్మీర్ రాజకుమారుడు రాజా కరణసింగ్ గారున్నారు. ఆయన వైమానిక శాఖలో సంచారం చేయడానికి చక్కని రాజముద్రికను సంపాదించు కున్నారు!

శ్రీ కామరాజు ఎంతో శ్రమపడి శ్రీమతి ఇందిరా గాంధిని మళ్లీ ప్రధానిగా చేసినందుకు మనం ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకోవాలి! ఇక్కడ ఒకవిషయం మనం మరచి పోకూడదు. రాయబారాలు జరుగుతున్నప్పుడు, సంధిప్రయత్నాలు కొనసాగుతున్నప్పుడు శ్రీమతి గాంధి పదవీ వ్యామోహంతో దురహంకారంగా వ్యవహరించారని చెప్పడానికి చింతిస్తున్నాను. శ్రీ మొరార్జీ దేశాయ్ మాత్రం అసలు సిసలైన కాంగ్రెసు వ్యక్తిగా వ్యవహరించారు. దేశానికి ముఖ్యమైంది పార్టీ, స్వార్థానికంటే పార్టీ ప్రాముఖ్యం వహిస్తుందనే ఆదర్శంతో ఆయన ప్రవర్తించారు.

రాజకీయ పరిశీలకుల ఊహాగానాలు చాలాఉన్నాయి. ఈ అయిదేళ్ళ కాలం మధ్యలో మళ్లీ లోక్‌సభనాయకత్వం ఎన్నికలు జరుగుతాయని జోస్యం చెబుతున్నారు. ఇదే నిజమయితే, భారతదేశ చరిత్రలో శ్రీమతి ఇందిరాగాంధికి 'పాఠాంతరం' మాత్రమే మిగులుతుంది! కాంగ్రెసుకు ఆమె చేసిన 'సేవ'తో ఇంతకంటే ఎక్కువ ప్రతిఫలం దొరకదని భావిస్తున్నారు. ఒక ప్రముఖ కాంగ్రెసు నాయకుడు "భారత దేశానికి శ్రీమతి ఇందిరాగాంధి చిట్ట చివరి కాంగ్రెసు ప్రధానమంత్రి" అన్నారు!

---

—తనని బలవంతంగా నెడుతున్న ఉద్యోగంకన్నా తాము ప్రస్తుతం చేస్తున్న ఉద్యోగమే ముఖ్యమయినదని అంగీకరించే విశాల దృక్పథం శ్రీ (త్రిగుణ) సేన్‌కి ఉంది.

—పేట్రియాట్ (14—3—67)

* * *

—భారతదేశం అర్హత ఉన్న యాచకుడితో సమానం అని అమెరికా భావిస్తోంది.

—న్యూస్టేట్స్‌మన్‌లో కె. ఆర్. సుందర్ రాజన్.

* * *

న్యూఢిల్లీలోని కాంగ్రెసు ప్రభుత్వానికి ఎవరు నాయకత్వం వహిస్తారనేది అంత ముఖ్యంకాదు. కాంగ్రెసు అంతం ఖాయం. కుళ్లిపోయిన ఈ సంస్థ నాశనానికి ఈ వనితామణి అధ్యక్షత వహించడమే మంచిదేమో.

—'సన్' వారపత్రిక (17—3—67)

* * *

—'న్యూచైనా న్యూస్ ఏజన్సీ' అమెరికన్ సామ్రాజ్యవాదులు కొత్త భారత ప్రభుత్వానికి ఇంకా ధనం, ధాన్యం ఇస్తున్నారని, 'సోవియట్ రివిజనిస్టులు' ఈ ప్రభుత్వానికి ఎంతో ప్రచారం ఇచ్చి 'అతిగా పొగడుతున్నా'రని అన్నది.

—'ఏ. ఎఫ్. పి. వార్త (19—3—67)

* * *

—శ్రీ పాటిల్ (శ్రీమతి గాంధికోసం) ధారపోస్తున్న రక్తం అంతా దక్షిణ బొంబాయి డ్రెయినేజి కాలువలోకి పారిపోతోంది.

—'కరెంట్' పత్రిక (18—3—67)










గోల్డ్‌ఫింగర్ చూసే చూపుల్లో అనుగ్రహ మనేది ఎక్కడా బాండ్‌కి కనిపించలేదు.

ఈ గొడవంతా ఏమిటి గోల్డ్‌ఫింగర్ ? నీ కోతి, మనల్ని చంపేంతగా ప్రవర్తించాడు'

ఒకసారి తటస్థిస్తుంది, రెండోసారి యాదృచ్ఛికం, మూడోసారి శత్రుత్వం అని చికాగోలో ఒక సామెత వుంది బాండ్. మియామి, శాండ్‌విచ్, మళ్ళీ ఇప్పుడు జెనీవా.......

నీ నుంచి నిజం రాబట్టాలని చూస్తున్నాను. ఆడ్‌జాబ్! ప్రెషర్ రూమ్....










ప్రెషర్ రూమ్ అంటే ఏమిటో బాండ్‌కి తెలుసు, కాని తననక్కడకు తీసుకు వెళ్తాడని అనుకో లేదు.

ఆడ్‌జాబ్, ఇప్పుడు కానీ.......

అతని ప్రతిచర్య యాంత్రికంగా, నిర్హేతుకంగా.....

ఇల్లంతా అతనిమీద పడినట్టయింది.










బాధతో మగతగా ఈదాడు బాండ్. నీళ్ళు అతని ముఖానికి గట్టిగా తగలగానే దూరం నుంచి గోల్డ్‌ఫింగర్ కంఠం వినిపించింది.

ఇప్పుడు మేము ప్రారంభిస్తాము...

నా వ్యవహారాల్లో కలగజేసుకున్నందుకు నీకు ప్రతిఫలం ముట్టాలి బాండ్, ఇక్కడికి వచ్చిన అమ్మాయి నన్ను చంపటానికే వచ్చింది. నువ్వూ అందుకే వచ్చావో..............

నిజం చెప్పు. నిన్నెవరు పంపించారు? నేను తెలుసుకోవాలి. ఆడ్‌జాబ్ నిన్ను ఒప్పించ గలడు.....










బాండ్ పళ్ళు కొరికాడు. తను కిమన్నాస్తిగా వుండాలి. తన గురించి చివరి క్లూ లాగేశాడంటే గోల్డ్‌ఫింగర్ తుర్రు మంటాడు.......

బాండ్ ఇక చాలు. నీ కథ పాడవోయ్....... నా చికాగో మిత్రుడు ఏమన్నాడంటే.......

పాడు....... నువ్వు బాధ లేకుండా త్వరగా చావొద్దూ మరి....... పాడు. లేకపోతే నీ చావు ఒకే ఒక అరుపుతో పూర్తవుతుంది. నీ గర్ల్ ఫ్రెండ్ కూడా..........

నీ కోరిక విన్నవించు......బహుశా నేను ప్రోత్సాహం ఇస్తాలే. ఆడ్‌జాబ్ చిన్న మాసేజ్ చేస్తాడు. మొదట్లో ఒకటో రకం చిట్కా........










క్రింద తనిలివున్న క్లిప్పుల బారకు ఒట్టుకోలేక పోతున్నాడు బాండ్. ఆడ్‌జాబ్ శరీరం నుంచి జంతు సంబంధమైన దుర్గంధం అతన్ని వశం చేసుకుంటున్నది.........

ఆడ్‌జాబ్ ఒకటోరకం మాసేజ్ వుంది చూశావ్.. అది యిట్టే లొంగదీసుకుంటుంది.......

ఆ తర్వాత రెండు మూడు చిట్కాలు మరీ బాగా పనిచేస్తాయి.

గట్టిగా వున్న చేతులెప్పుడూ శస్త్రయుక్తంగా పనిచేస్తాయి. వాళ్ళు విడిచి పెట్టేవరకు పళ్ళు నొక్కిపెట్టి వుంచాలనుకున్నాడు.










ఆడ్‌జాబ్ హింస అకస్మాత్తుగా ఆగిపోయింది. గోల్డ్‌ఫింగర్‌ని కనుక్కుందామని బాండ్ అతి కష్టంగా ప్రయత్నించాడు.........

బాండ్, ఇది నిజంగా అత్యవసర మంటావా ?

నా కొక నిజం చెప్పు. నిన్నెవరు పంపారు? నువ్వెవరు?

విశేషమయిందేమీ లేదు గనక నేను చెప్పేందుకు ఏమీలేదు. విను, నేనూ నాతోవున్న అమ్మాయి మీతో కలిసి పనిచేస్తాం. మాకా సామర్థ్యత వుంది.

వెన్నుమీద రెండు కత్తులు దింపెట్టాకో మంటావ్.....? కృతజ్ఞుడ్ని బాండ్. ఆడ్‌జాబ్, రెండో చిట్కా..........

(ఇంకా వుంది)




"హలో! ఎవరండీ మాట్లాడేది?...... నువ్వేనా వాసూ! నేను విజయని....... 'ఆ ఆ' ఇంటి దగ్గర నుండే...... ఏంటేమ్ వాసూ! నీతో కొంచెం మాట్లాడాలి. యీవెనింగ్ ఫైవ్‌థర్టీకి పబ్లిక్ గార్డెన్స్‌కి వస్తావా?........ యింటికి కారు తీసుకు వస్తానంటావా? నో. పబ్లిక్ గార్డెన్స్‌కి నేరుగా వచ్చెయ్........ మీ బావగారా? అప్పుడే ఎక్కడ? ఆ పాలిటెక్నిక్ అమ్మాయిలతో యుద్ధం చేసి చేసి అలసిపోయి జడు, పదున్నరకి వస్తారు........ అమ్మలేం చేస్తుంది? బాబిగాడి పుస్తకం తీసుకుని 'అ, ఆ' అంటూ కోరస్‌గా చదివెయ్యడం, టైం దొరికితేవాడు వాళ్ళ పిక్కరతో కోసి వయొలిన్ వేసుకోవడం, అద్దం ముందు నిలబడి తెగ చూసుకోవడం........ ఏమిటి? దాన్ని పెళ్ళాడేస్తానంటావా? బాబ్బాబు. త్వరగా రావొచ్చెయ్ అదేదో.....మరుంటాను వాసూ! తప్పక వస్తావుగా!''

* * *

ముడుకుల మీద తలానించుకుని మెట్టు తామర పూలవైపు చూస్తోంది విజయ. దూరాన ఎవరో మ్యూట్ ఆర్గన్ మీద "స్వై చోరంకా రాజా, తూ రూపేకీ రానీ'' హమ్ చేస్తున్నారు.

"సారీ కొంచెం లేటయింది విజయా'' తలెత్తి చూసింది విజయ. వాసు. పొడుగ్గా, తెల్లగా, ఫుల్ షైన్ క్రీమ్‌తో వున్న వాసు కుడిచేత్తో డార్క్ గ్రీన్ కలర్ ట్రెప్ట్ విప్పుతూ, భుజం మీది డార్క్ బ్లూ కలర్ కోట్ వేసుకు తన ఎదుట నిల్చున్న వాసుని చూసి మరోసారి 'గ్రీక్ శిల్పంలా వున్నాడను కుంది విజయ. అసలు గ్రీక్ శిల్పం ఎలావుంటుందో, ఇతనిలానా? — నవ్వుకుంది విజయ.

"ఏమిటి నవ్వుకుంటున్నారు అమ్మాయిగారు?''—రుమాలు కిందపరచి దాని మీద కూర్చుంటూ అడిగాడు వాసు.

"ఆహా ఏంలేదు. చిన్నప్పుడు 'గుండాలిలా వాళ్ళు వచ్చి గునగున నడిచే' అన్నట్లుండే ఓ అబ్బాయిగారు ఇంత అందంగా ఎలా అయారా అని ఆలోచిస్తున్నా''— నవ్వింది విజయ.

"గుర్తుందా, చిన్నప్పుడిలాగే అంటే నీచెయ్యి కరిచి పారిపోయాను ఆ తరువాత మన క్లాస్ టీచర్ క్రీస్తు దాసి ఆరోగ్యమ్మగారు 'బెంచీ మీద నిల్చో'' ని దబాయిస్తున్న దల్లా తెలి నా ఒళ్ళు హూనం చేసేసింది.

"ఓ గుర్తులేకేం. ఆ తరువాత అయ్యగారు నా మీద అలిగి నా ప్రక్కన కూర్చోవడం మానేసి ఆ భీముడు ముకుంద్ కాంతం ప్రక్కన కూర్చోవడం, పాలకోవా లంచం పెట్టి అయ్యగారి అలక తీర్చడం''— చిలిపిగా చూసింది విజయ.

"నిజంగా ఎంత తియ్యటి రోజులవి. ఎప్పటికీ అలాగే వుండిపోతే ఎంత బావుండేదా అనిపిస్తుంది.'' పక్కకి వాలి కూర్చుంటూ అన్నాడు వాసు.

"ఏమో బావా, మా ఆయన, బాబు, అమ్మలు — వీళ్ళతో నాకీ జీవితం బావున్నట్లు నిపిస్తుంది...... అంతా స్వచ్ఛత ప్రవహిస్తున్నట్టు అనిపిస్తే 'గృహమే కదా స్వర్గసీమా!' అంటూ గొంతెత్తి పాడాలనిపిస్తుంది.''— నవ్వాడు వాసు.

"అది సరేగాని ఇంత అర్జంట్‌గా నాతో మాటలాడవలసిన రహస్యమేమిటబ్బా!'' విజయ వంక కుతూహలంగా చూసాడు వాసు.

"రావాల్సిందే మరి. ఈ మధ్య బిజినెస్‌లో లాభాలొచ్చి కాస్త గొప్పవాడి వయావుకదా! ఆ హోదాకు తగ్గట్టు మరేవో ఘన కార్యాలు చేస్తున్నావని విన్నాను. వాటిని నీ నోటిమీదుగా విన్నిమరో సారి విని ఆనందించుదామని''— విజయ మాటల్లోని వ్యంగ్యం గుర్తించనట్టు నటించాడు వాసు.

"నా సహాయం పొందిన వాళ్ళెవరో నా గురించి పొగిడివుంటారు నీ దగ్గర. అంతే విజయా!'' వాసు. కళ్ళల్లో చిలిపితనం చూసి విజయకు కోపం వచ్చింది.

"ఇదిగో వాసూ! క్రొత్త హీరోలు కావాలంటూ చాలమంది సినిమా వాళ్ళు ఎడ్వర్టయిజ్ చేస్తున్నారు. కావాలంటే అప్లై చేసి నీ నటనా చాతుర్యాన్ని చూపుదువుగాని, ప్రస్తుతానికి నేను అడిగే దానికి కాస్త తిన్నగా జవాబు చెప్తావా?''

"అవశ్యం.'' బుద్ధిమంతుడిలా కూర్చున్నాడు వాసు.

"బీరకయలు ఖాళీ చేస్తున్నావటగా?''

"బీరకయలా?'' ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసి చూసాడు వాసు.

"కాకపోతే గుర్రమెక్కడ మనుకో.'' టక్కుమని అనేసింది విజయ.

"వహ్వా! సంస్కృతం ఎప్పుడ్నుంచి నేర్చుకుంటున్నావు విజయా!'' నవ్వాడు వాసు. అన్నం

కోపిలా చూసింది విజయ.

"అదికాదు విజయా! నీకీ ఐర్యాయ పదాలన్నీ ఎలా తెలిసాయి? బావగారేమన్నా ద్రావిడాల రుచి చూపిస్తున్నారా?" నవ్వాడు వాసు.

"నీ తెలివికి సంతోషించను."

"ధన్యుడివి."

"అబ్బబ్బ! కొంచెంసేపు సీరియస్‌గా వుండలేవూ? అసలెందుకు తాగుతున్నావో ముందు చెప్పు."

"అదేమిటి విజయా! ఫార్మకాలేజీలో చదువుకోలేదూ నువ్వు?! ఆల్కహాలు గుణము లేనేవి యువగా......." చటుక్కున లేచి మండింది విజయ.

"ఒరేరే! లేచావేమిటి? యింక సీరియస్‌గా జవాబు చెప్తాను మా అమ్మవు కదూ! కూర్చో!" బతిమాలుతున్న వాసు ముఖం చూసి నవ్వేసి, కూర్చుంది విజయ.

"అది కాదు వాసూ! ఎందుకీ అలవాటు చేసుకుంటున్నావు చెప్పు?" ఆవేదనగా వాసు వంక చూసింది విజయ.

మౌనంగా వుండిపోయాడు వాసు.

"మాట్లాడవేం?"

"నీ కది యిష్టం వుండదని తెలుసు విజయా! కాని పరిస్థితుల కనుగుణంగా నడుచుకోక తప్పదు."

"వ్యసనాన్ని పెంచుకోవడానికి పరిస్థితుల కంట కట్టడ మెందుకు వాసూ?"

"నీకు తెలీదు విజయా! కొన్ని కొన్ని పనులు కొంతమందితో కావాలంటే వాళ్ళకు ఫుల్‌గా పోయించక తప్పదు, వాళ్ళతోపాటు సభ్యతకోసం ఓ డోస్ వేసుకోకా తప్పదు." విజయకు చిర్రెత్తుకొచ్చింది.

"నీ సభ్యతను తీసుకెళ్ళి గంగిలో కలుపు. తాగడము సభ్యతా?"— మండి పడింది విజయ. చిన్నగా నవ్వాడు వాసు.

"పిచ్చి విజయమ్మా! తాగడమంటే రోడ్ల మీద నోటికి వచ్చినట్లు పేలుతూ, తూలుతూ నడవడం కాదని తెలుసుకోవాలి నువ్వు. తాగినవాడు కూడ మామూలు మనిషిలా వుండగలడని, మామూలు మర్యాదతో వ్యవహరించగలడని అర్థం చేసుకోవాలి నువ్వు. నా దృష్టిలో లిమిట్స్‌లో తాగితే అపరాధమేం కాదు. విజయా!" ముందుకు వంగి విజయ హేండ్‌బాగ్ అందుకున్నాడు వాసు.

"అలా చెప్పు మరి పరిస్థితుల కోసం అంటావెందుకు? జేబులో డబ్బులున్నాయనీ, ఫేషన్ కోసమనీ, సివిలైజ్డు మాన్‌లా వుండాలని తాగుతున్నానని చెప్పరాదూ!" కోపంతో కందిగడ్డలా అయింది విజయ ముఖం

"అది సరేగాని ఆ కోపం కొంచెం తగ్గించుకో. కోపంతో నీ ముఖం చూడబుల్‌గా లేదు." నవ్వాడు వాసు.

"అలా నవ్వుతో ఎగర గొట్టాలని చూడకు. నీకు తెలీదు వాసూ! ఏవరేజుగా వుండే ఏ అమ్మాయియినా తన భర్త 'తాగుబోతు' అనే వూహను కూడ భరించలేదు. వీటన్నిటికీ అతీతులయిన అమ్మాయి లుంటారేమో నాకు తెలీదు. కాబోయే అమ్మాయికోసమైనా నువ్వీ హేబిట్స్ మానేయాలి." అనునయంగా వాసు వంక చూసింది విజయ!

"అబ్సర్డ్. భార్యకోసం మానెయ్యడమా. భార్య అనే వ్యక్తిమీద నా అమూల్య అభిప్రాయాలు నీకు తెలీవు. నేను నీకు ఓ కోణం మంచే తెలును. నా భార్యంటే ఎలా వుండాలో తెలుసా? పెద్ద కట్నంతో వచ్చి, నా మాటకు ఎదురాడకూడని అందమైన భార్యయి వుండాలి." ఆ మాటలు వినగానే తెల్లగా పాలిపోయింది విజయ ముఖం. తమాషాకు చెప్తున్నాడేమోనని అతని ముఖంవైపు పరిశీలనగా చూచింది.

"అలాగే అంటారంతా! ఓ బంగారు బొమ్మ వచ్చి కొంగుకు కట్టుకోగానే యీ మాట లేవీ గుర్తుండవు." ప్రయత్న పూర్వకంగా నవ్వింది విజయ.

"ఇంపాజిబుల్. భార్య అనేదానికి చనువిస్తే నెత్తి మీద కెక్కి కూర్చుని స్వారి చేస్తుంది. వట్టి చవటను చేసి ఆడిస్తుంది. మా ఫ్రెండ్ ఒకడు అలానే అయాడు. వాళ్ళ నాన్న లక్షరూపాయల కట్నం తెచ్చి పెళ్ళి చేస్తానంటే, కట్నాన్నీ, నాన్న ఆస్తినీ వద్దని ఓ అందాల అమ్మాయిని పెళ్ళాడి ఆవిడ చేతిలో కీలుబొమ్మయి పోయాడు వాడిలా చేసి తరువాత పశ్చాత్తాప పడడమనేది చెయ్యను చచ్చినా. నేనేం భావకవిని కాదు. ప్రేయసి, వెన్నెల, మల్లెపూలు అంటూ మత్తుగా కన్నీళ్ళు కార్చడానికి. నేను పచ్చి రియలిస్ట్‌ని." — వాసులో ఇంత ఆవేశం ఎప్పుడూ చూడని విజయ విస్తుపోయిం దతన్ని చూచి. యితనిలా ఎందుకయ్యాడు? తన వ్యక్తిత్వాన్ని కోల్పోయిన స్నేహితుణ్ణి చూసా?!

"ఏ ఇష్టమైనా అవ్వకాని ఇలాటి అభిప్రాయాల్ని అమ్మాయిల ముందన్నావంటే నీకు జన్మలో పెళ్ళవదు." నవ్వింది విజయ.

"డామిట్. హాయిగా వుంటాను.' నిర్లక్ష్యంగా తల వూపాడు వాసు.

"నేను చెప్పాలనుకున్న దసలు చెప్ప నివ్వవు నువ్వు. విసుక్కుంది విజయ.

"లేదు. చెప్పు. ఏమిటి? విటారుగా కూర్చున్నాడు వాసు.

"మనిషి తాగ్గానే దుర్మార్గుడని అనన్నేను. పదిమందికి అపకారం చేసే నిష్ఠాపరుడికన్నా పది మందికి మంచిని చేసే వ్యసనపరుడే ఉన్నతుడంటాన్నేను. కాని......... ఆ ఔన్నత్యంతో పాటు నైతికమైన విలువలు కూడవుంటే ఆ వ్యక్తిని మిగతవాళ్ళు పూజించరూ! మాట్లాడవేం వాసూ?'

"పూజ లందుకోవడానికి నేనేమన్నా దేముడినా విజయా! నేనూ మామూలు మనిషిని. అందరిలానే నాలో కొన్ని బలహీనత లుండవచ్చు.'

"ఆ బలహీనతల కెందుకు లొంగిపోవాలని నేననేది. యీ పొజిషన్‌కి చేరుకోవడానికి నువ్వెన్ని సమస్యల్ని ఎదుర్కుని నిలబడ్డావో, జీవితంతో ఎంతగా పోట్లాడేవో, ఎంత పట్టుదలతో శ్రమించావో నే నెరుగంది కదు. ఆ పట్టుదలే మయింది ఇప్పుడు? నువ్వు కావాలనుకుంటే మంచిగా ఎండుకుండలేవు?!" విజయ ముఖాన్ని వాత్సల్యంగా చూస్తూ కూర్చున్నాడు వాసు.

"తాగటమనే స్వల్ప విషయాన్ని తీసుకుని పెద్ద రాద్ధాంతం చేస్తున్నాననుకుంటున్నావు కదూ! ఇంత ఎడ్యుకేటెడ్ అయుండీ సిల్లీగా మాట్లాడుతున్నాననుకుంటున్నావు కదూ!' లైట్ వెలుగులో అతని వంక పరిశీలనగా చూసింది విజయ.

"ఫూ హా. కాదు విజయా! నేనంటే నీకెందుకింత అభిమానమా అని ఆలోచిస్తున్నాను. ఏనాటి బాంధవ్యం మనది?' ఆర్ద్రంగా విజయ వంక చూసాడు.

"ఇందాకేదో సెంటిమెంట్స్ లేనివాడిలా ఫోజు వేసావ్! డైలాగ్‌లు వేస్తున్నా వేమిటి?"— చిన్నగా నవ్వింది విజయ.

"నువ్వలా అంటే నేనేం చెప్పలను విజయా! కాని స్నేహంలో వున్న మాధుర్యం ఇంక దేనిలోనూ లేదని పిస్తుంది."

"నువ్వేదో కవిత్వ ధోరణిలో పడ్డావు. మా ఆయన వచ్చి విరహగీతాలు పాడుతూ వుండగలరు. పద పోదాం." అతని చేతిలోని హేండ్ బాగ్ తీసుకుని లేచింది విజయ.

ఆలోచిస్తూ నడుస్తోంది విజయ. ఇంత సేపూ మాట్లాడిందానికి ఫలిత మేమిటి? అతనేమీ తనతో యింక తాగనని మాటివ్వలేదు. మాటలతో పల్టీలు కొట్టించి అసలు విషయాన్నుండి దూరంగా పోయాడు. ఎలా ఇతని చేత ఒప్పించడం?! మాటిగా తాగనని మాటివ్వమని అడగడమూ! అలా అనడం అతనికి ఇష్టం లేకపోయినా కేవలం తన మీద అభిమానంతో మాటిస్తే మాత్రం..... ఏమిటో తనకంత తృప్తిగా అనిపించడంలా! ఒకవేళ నిర్మొహమాటంగా కాదనేస్తేనో!! ఎంత ఇన్సల్ట్! ఆఫ్టరాల్! తనేమౌతుందతనికి? ఒకటో క్లాస్ నుండి కాలేజీ చదువు వరకు కలసి చదువుకున్నారు. అంతేగా తామిద్దరి మధ్య వున్న బాహ్య బాంధవ్యం! ఒకళ్ళంటే ఒకళ్ళు ప్రాణం పెట్టొచ్చుగాక, అది వేరే సంగతి.

ఆలోచనలతోనే యాంత్రికంగా కారెక్కి కూర్చుంది. స్టీరింగ్‌వీల్ తిప్పుతూ విజయవైపు చూసాడు వాసు.

"ఏమిటి విజయా, దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" సిగరెట్ పొగ రింగులు రింగులుగా వదులు తున్నాడు.

"ఇందాక నువ్వన్న మాటల గురించే. ఆలోచిస్తే ఒక్కటనిపిస్తోంది వాసూ! మనదేశంలో మగవాళ్ళు రెండేరకాలు. ఓ రకం భార్యను బానిసగా చేసుకుంటే మరోరకం భార్యకు బానిసలవుతారు. మనసా, వచా, కర్మణా భార్యను తనతో సమానంగా చూచి ఇద్దరి మధ్య సన్నిహితమైన బాంధవ్యాలను సృష్టించుకునే మగవాళ్ళు అరుదు. చిత్ర మేమిటంటే అమ్మాయిలు మొదటి రెండురకాల భర్తల్నీ ఇష్టపడరు. ఏవరేజు అమ్మాయి కోరుకునే దేమిటో తెలుసా? తనను ప్రేమతో శాసించగలవాడు తనకు భర్త కావాలను కుంటుంది."

"నీ జనరలైజేషన్స్ బాగా వున్నాయి గాని ఒక్క సవరణ. మీ అమ్మాయిలు ఎంత మంచి భర్త దొరికినా సుఖపడలేరు. ఇంక ఏదో అతనిలో వుండాలని కోరుకుంటారు."

"నీకు బొత్తిగా అమ్మాయిల మీద సదభిప్రాయం లేదు. అమ్మాయిల గురించి మీ తాతకో ముత్తాతకో వుండాల్సిన అభిప్రాయాలు ఉన్నాయి నీకు." నవ్వి వూరుకున్నాడు వాసు.

కారాపి పళ్ళు, పువ్వులు తీసుకొచ్చి విజయ చేతిలో పెట్టాడు.

"ఇవన్నీ యెందుకు మహానుభావా?"

"చెల్లెల్ని వట్టి చేతులతో యింటికి పంపకూడదట."

"పరవాలేదు. పిల్లక్కాడ కాస్త తెలివి తేట

అవుతున్నాయి."

ప్రక్కగా కదిలాడు వాసు.

"నా గురించి ఆలోచించి మనసు పాడు చేసుకోకు విజయా? బావగారితో చెప్పు, తరువాత కలుస్తానని."

"అదేమిటి? ఇంట్లోకి రావూ!"— కారు దిగుతూ అడిగింది విజయ.

"ఓ ఫ్రెండ్ని కలుస్తానని మాటిచ్చాను. తప్పకుండా వెళ్ళాలిప్పుడు."

దూమకు వెళ్ళిపోతున్న కారును చూస్తూ ఇతన్ని ఒప్పించవలసిన విధం యిదికాదు అనుకుంది విజయ.

ఆలోచిస్తూ పడుకుంటే ఓ బ్రెయిన్‌వేవ్ వచ్చింది విజయకి. వెంటనే లేచి ఓ లెటర్ వ్రాసి నిశ్చింతగా నిద్రపోయింది.

* * *

"ఆఁ ఆఁ! వాసూ!...... విజయనే. నీమీదో పెద్ద పని పెడుతున్నాను వాసూ! మా ఫ్రెండ్ ఇందుప్రియ అని చెప్తానే, తను వాల్తేర్ నుండి వస్తూంది రేపు. నువ్వు కొంచం స్టేషన్‌కు వెళ్ళి తనను తీసుకు రావాలి...... నా ఆల్బమ్‌లో తన ఫోటో చూసావు కదా, గుర్తు పట్టలేవూ?...... పోనీ, యింటికి వచ్చి ఆ ఫోటో జేబులో వేసుకు వెళ్ళు...... అబ్బాయ్! తప్పించుకోవాలని చూడకు ఓ గంట నువ్వు లేకపోతే నీకు లక్షల నష్టమేం రాదు...... ఓ. కె. వస్తున్నావు కదా!" ఫోన్ పెట్టేసి శ్రీవారి వంక చూసింది విజయ.

"అతన్నెందుకు విజయా యిబ్బంది పెట్టడం. మనం తిరిగ్గా వున్నాం కదా!" అమాయకంగా అడిగాడు అతను.

"ఘనత వహించిన శ్రీవారూ! మనం స్టేషన్‌కు వెళ్ళితే ఇందు విన్నుడు అర్జంట్‌గా రమ్మని వ్రాయడము ఎందుకు?" నవ్వింది విజయ. అర్థం కానట్లు చూసాడతను.

ఫోటోలో అమ్మాయికోసం వెదుకుతూ ప్లాట్‌ఫామ్ మీద నడుస్తున్నాడు వాసు. ముక్కూ మొహం తెలియని తను పలకరిస్తే ఆ అమ్మాయి తిట్టదూ? అరే! ఆ అమ్మాయి కాదూ! ఎంత

# ఒట్టు నేను త్రాగను

స్మార్ట్‌గా ఉంది! ఫోటోలో చూసి ఫరవా లేదను కున్నాడు కాని ఆమె యింత చక్కటిదని తను అనుకోలా! యీమెది బొత్తిగా ఫోటో జెనిక్ ఫేస్ కాదన్న మాట.

"హలో!" అప్రయత్నంగా అనేశాడు ఆమె తన ప్రక్కగా రాగానే. చురుగ్గా చూసిందామె.

"నేను విజయ కజిన్ బ్రదర్ని."

"నమస్తే." అందంగా చేతులు జోడించిందామె. ప్రతి నమస్కారం చేస్తూ 'నమ్రత మూర్తీభవించి నట్లుందీమె.' అనుకున్నాడు వాసు.

భాగ్య నగరం విశాల వీధుల్లో గుండా కారు దయ్యిన పోతూంది.

"మీరు పైనలియరా అండి ఇప్పుడు?" ఆమె వంక చూసాడతను.

"ఇవుతుండి' కళ్ళెత్తి అతని వైపు చూసిందామె. 'ఈ అందమైన కళ్ళల్లో ఇంత కాంతి, ఆకర్షణ ఎక్కడ నుండి వచ్చాయి?'— అనుకుంటున్నాడు అతను. 'విజయ తన ఫ్రెండ్ ఇలా వుంటాడని, అదీ తన వూహల్లోని రాకుమారుడులా వుంటాడని ఎప్పుడూ చెప్పలేదే? ఎంత మేన్లీగా వున్నాడితను' అనుకుంటూంది ఇందుప్రియ.

ఎవరి ఆలోచనలలో వాళ్ళు వుండగానే కారు ఇంటి ముందాగింది. గులాబీలను, చామంతుల్నీ, కనకాంబరాల్ని చూచి 'థాంక్ గాడ్. మొక్కల విషయం ఒక్కదానిలో విజయకు ఐద్ధకం లేదు. అనుకుంది ఇందుప్రియ.

"స్వాగతం, సుస్వాగతం" అంటూ నవ్వుతూ ఎదురొచ్చింది విజయ.

"చాల్లె సంతోషం. స్టేషన్‌లో నువ్వు కను పడక పోయేసరికి ఎంత కోపమొచ్చిందో తెలుసా?" ఇందుప్రియ ముఖంలో కోపచ్ఛాయలు చూచి ఫక్కున నవ్వింది విజయ.

"ఆ తరువాత 'విజయ ఆకస్మాత్తుగా యింత మంచిదయి పోయిందేమిటబ్బా!' అని అనుకోలా? నిజం చెప్పు." లోపలి కొస్తున్న వాసును చూపిస్తూ

కన్ను గీటింది విజయ. విజయను ఏదో అనబోయి వాసును చూచి ఆగిపోయింది ఇందుప్రియ.

"చూడమ్మా! వినేవాళ్ళుంటే అలా విజయ గంటల తరబడి లెక్చర్ దంచగలదు. మువ్వలా మొహమాటపడితే లాభంలేదు."— విజయ భర్త, మూర్తి.

"విజయ సంగతి నాకు తెలీకపోవడ మేమిటి అన్నయ్యా! మీరు మంచివారు కాబట్టి సరి పోయింది కాని........"

"లేకపోతే నాలుగో రోజునే సన్యాసం పుచ్చుకుని హిమాలయాల్లో మకాం పెట్టేవారు, అవునా అమ్మాయ్, మీ అన్నయ్య చాల మంచివారు, తాలి నేనోచిన నోముల ఫలితంగా నాకు దక్కారు. ఇవే కదూ నువ్వనేది, నేనూ అలా అనుకునే కదే తల వంచి తాళి కట్టించుకుంది..." మాటల కందని ఏదో భావంతో భర్త వంక చూసింది విజయ.

"బావగారూ, మీరు తక్షణం ఆత్మ సంరక్షణోపాయం చూచుకోవాలి. విజయ బాగా తైరు కొడుతూంది మీకు."— వాసు.

"నువ్వు కూడ వాళ్ళ ప్రక్క జేరి నన్ను ఒంటరి దాన్ని చేస్తావా? నీకు బొత్తిగా బుద్ధి లేటిది లేదు."— నవ్వింది విజయ.

"యీ మర్యాద తిట్లెప్పటి నుండి?"— వాసు.

"అది సరేగాని వాసూ, ఇందు వెళ్ళేవరకు నువ్వు నీ కాలంతోపాటు మా అధీనంలో వుండాలి."— అంది, విజయ.

"బాబోయ్! యేమిటి శిక్ష?" భయంగా చూచాడు వాసు.

"శిక్షా? మహాభాగ్యము. మేము కూర్చుంటే నీ కాలం పవిత్రమయి పోదూ!"

"సరయం. నేను తరించి పోతాననలేదు."

"ఫులోషాప్. మీ యిద్దరి మాటలూ అయి పోయే సరికి ఇందు ఆకలితో శోష్ఠొ పడిపోతుంది."— మూర్తి.

"నిజంగా చెప్తున్నా వాసూ!" ఇందుకు భాగ్య నగర విశేషాలన్నీ చూపించాలి. నాతో పెట్టుకుంటే అన్నీ చూసేసరికి కనీసం పది రోజులన్నా పడుతుంది. పది రోజులు ఇందు ఇక్కడ వుండంటే అక్కడ సర్జరీ, మెడిసిన్ విషయ గీతాలు పాడేస్తాయి వెళ్ళాక. అంతేత నువ్వు నీ సమస్తం మా ఫ్రెండ్, పార్ట్నర్, అర్థాంగి ఎట్సెట్రా రంభానుకి అప్పగించి నాలుగు రోజులు ఇందుప్రియా విధేయుడవై వుండాలి."— ఇందుప్రియ వంక చూచి నవ్వింది విజయ.

"సరే సరసయ్యా మహాముఖావా! కాదంటే యిప్పుడు తారాజువ్వలా లేస్తుంది."— విజయ వంక చిలిపిగా చూసాడు మూర్తి.

"ఆయన్ని శ్రమ పెట్టడమెందుకు విజయా? మరోసారి చూడొచ్చు. ఇప్పుడేం మునిగిపోయింది?' ఇబ్బందిగా ముఖం పెట్టింది ఇందు ప్రియ.

"అబ్బే! శ్రమేముంటుంది.' వాసు మెహమాటు పడడం చూచి నవ్వుకుంది విజయ.

"ఓ కె యీవెనింగ్ కలుస్తాను." వెళ్ళి పోయాడు వాసు.



# ఒట్టు నేను త్రాగను

రాత్రి పిక్చర్ నుంచి వచ్చాక పడుకుని కబుర్లు మొదలు పెట్టారు విజయ, ఇందుప్రియ.

"మా అబ్బాయి ఎలా వున్నాడే?" గొంతు తగ్గించి అడిగింది విజయ.

"ఎవరు?"

"బొత్తిగా అమాయకురాల్లా నటించకూ! ఇప్పటి వరకు తమ ప్రక్కన కూర్చుని సినిమా చూడకుండా నిన్నే చూస్తున్న అయ్యగారు." కోపంగా చూసింది విజయ.

"ఎలా వుంటారు? మనిషిలా వున్నారు." కొంటెగా చూసింది ఇందుప్రియ.

"అదే జాలిపడిన మనిషిలా వున్నాడా అని" చిత్రంగా కళ్ళార్పింది, విజయ.

"పోవే" విజయ వో దెబ్బవేసి, అందంగా కళ్ళు త్రిప్పింది ఇందుప్రియ. ఆమె కళ్ళల్లో ప్రతిఫలించిన 'ఇష్టాన్ని' గుర్తించింది విజయ.

ఉదయమే కాఫీ తీసుకు వచ్చాడు వాసు. తెల్ల గులాబిని హెయిర్‌పిన్‌తో కుడివైపుకు కనపడేలా పెట్టుకుంటుంది ఇందుప్రియ.

"లేట్ అయిందా?" గులాబిని, గులాబీలా వున్న వేళ్ళని చూస్తూ, అడిగాడు వాసు.

"లేదు. విజయిప్పుడే లేచింది. హాస్పిటల్‌కు టైమయి పోయిందని స్నానానికి పరుగెత్తింది."

"మామయ్యా!" బాబు, పాప పరుగెత్తుకొచ్చి అతని ఒళ్ళో ఎక్కి కూర్చున్నారు.

ఇందుప్రియ లోపలికి వెళ్ళింది. హడావిడిగా తల దువ్వుకుంటూంది విజయ.

"అదికాదే నేను కూడ నీతో హాస్పిటల్‌కు వచ్చేస్తాను లేదా? నేను ఒక్కదాన్ని వుంటే బోర్ కొడుతుంది."

"అదేమిటేవ్, ఒక్కదాన్నంటున్నావు, మా వాసుని రావద్దన్నావేమిటి?" అద్దంలో ఇందుప్రియ ప్రతిబింబాన్ని చూసి నవ్వింది విజయ.

"యీ నాలుగు రోజులన్నా హాస్పిటల్ని, రోగుల్ని తలుచుకోకుండా కామ్మని తిరగవే. వాసు నీకు బోర్ కొట్టడని, అయామ్‌సారీ, బోర్ కొట్టనివ్వడని నేను హామీ యిస్తా!" నల్ల పూసల్ని వెనక్కు వేసి మెడకింద పౌడర్ రాసుకుంటూ ఇందుప్రియ వంక చూచింది విజయ.

"విజయా!" — వాసు.

"ఆ! వస్తున్నా వాసూ! నువ్వు ఆలోపల ఆమెతో మాట్లాడుతూ వుండు." చెక్కిలికి అంటిన కుంకుమను తుడుచుకుంటూ, అంది విజయ.

"విజయ సింగారం యింకా అవలేదాండి? అమ్మాయిలు!!" నవ్వాడు వాసు.

"అవును. అమ్మాయిలు బొత్తిగా అబ్బాయిల్లా ఐదు నిమిషాల్లో రెడీ అయి పోతున్నారు, అబ్బాయిలు గంటల తరబడి అద్దం ముందు కూర్చుంటున్నారు."— విజయ స్టైల్ హేండ్‌బాగ్‌లో పెట్టుకుంటూ బయటకు వచ్చింది.

"యింత కబుర్లపోతువి, నీకూ, మితభాషిణి యీవిడకూ స్నేహం ఎలా కుదిరింది విజయా?" — పరిశీలనగా చూశాడు వాసు.

"మితభాషిణి లేదు, మధుభాషిణి లేదు. రెండు రోజులాగు. అప్పుడు 'యీవిడకన్నా విజయే నయం' అనుకుని నువ్వుకూడ ఆ భాషిణి, యీ భాషిణి అంటూ పొగడుతావు." అంది విజయ, వాచ్‌కి 'కీ' యిచ్చి చేతికి పెట్టుకుంటూ.

"నీతో మాట్లాడుతూ కూర్చుంటే సాయంత్రం అవుతుంది మరి మేం పోయిరామా?"— వాసు లేచాడు.

"టైమయి పోయింది కదా, కాస్త హాస్పిటల్‌లో దింపుదాము, అనే ఆలోచ నేమన్నా వుందా? అబ్బే! ఎందుకుంటుంది?"

"మహాతల్లీ! నీ సాధింపులు ఆపింక. పదపోదాం."

"ఎక్కడికి వెళ్ళినా భోజనానికి మాత్రం ఇంటికి వచ్చేయండి. అమ్మ మీకోసం చూస్తూ వుంటుంది. రాకపోతే బాధ పడుతుంది." అంది విజయ హాస్పిటల్ దగ్గర దిగిపోతూ.

"ఓ. కె." అంటూ కారు స్టార్ట్ చేసాడు వాసు.

నాంపల్లి స్టేషన్‌లో ఇందుప్రియను చూచి, 'యీమె చాల చక్కనిది.' అనుకున్న వాసు సాలార్ జంగ్ మ్యూజియంలో జాపనీస్ ఎంబ్రాయిడరీ చూస్తూ నిలబడిపోయిన ఇందుప్రియను చూచి 'యీ అమ్మాయిలో కళ అనే పిచ్చి కూడ వుంది'అనుకున్నాడు. జూలాజికల్ పార్కులో రకరకాల జంతువుల్ని రంగు రంగుల పక్షుల్నీ చూచి బాహ్య ప్రపంచాన్ని మరచి చిన్నపిల్లలా ఆనందించిన ఇందుప్రియ అమాంతంగా వాసు హృదయంలో వో సున్నిత స్థానాన్ని ఆక్రమించేసింది. గండిపేట వరి పొలాల్లోను, టాంక్‌బండ్ సుందర దృశ్యాల మధ్య తన ప్రక్కన నడుస్తున్న నాజూకైన అమ్మాయిని తలచుకుంటూ అప్రయత్నంగా 'యీమెనుపొందిన వ్యక్తి అదృష్టవంతుడు' అనుకున్నాడు. వెన్నెల జల్లుల్లో నౌబత్ పహాడ్ మీద నుండి భాగ్య నగర సౌందర్యాన్ని చూస్తుంటే ఇంతకు ముందు ఎన్నోసార్లు చూచినా ఆ రోజే వో క్రొత్త అందాలు కనిపించినట్లయాయతనికి. ఇద్వాయ్ గార్డెన్స్‌లో పూ కన్నెల మధ్య మైమరచి నిలబడిన ఇందుప్రియను చూచి 'కవులు వర్ణించినట్లుగా ప్రకృతికి, స్త్రీకి చాల సామ్యం వుంది' అనుకున్నాడు. అమాయకంగా వున్న ముఖం, సున్నితమైన కదలికలు, మృదువైన మాటలు, శబ్దం వినిపించని నవ్వు— వీటిని చూచి 'యీ అమ్మాయి పుస్తకాలల్లో వర్ణించినట్లు 'ముగ్ధ'లా వుంది' అనుకున్నాడు వాసు.

గోల్కొండ కోటమీద సూర్యాస్తమయ సౌందర్యాన్ని చూస్తూ నిల్చుంది ఇందుప్రియ. ప్రక్కన నిలబడి వోరగా ఆమెను గమనిస్తున్నాడు వాసు. గాలితెర వచ్చినప్పుడల్లా ఆమె పయ్యెట కొంగు అతన్ని స్పృశించి చిత్రమైన ఆలోచనలు రేపుతుంది.

"మిమ్మల్నీ, ఆ సీనరీని మార్చి మార్చి చూస్తూ వుంటే చాల గొప్పగా వుంది."— వాసు. వాసు వంక చూచి అందంగా సిగ్గుపడి తల వంచుకుంది ఇందుప్రియ.

"నాకైతే ఇలా వుండిపోవాలనుంది కాని పిక్చర్ ప్రోగ్రామ్ కాన్సిలయితే విజయ అక్షింతలేస్తుంది. మరి మీ ఇష్టం." అన్నాడు వాసు.

"పదండి. వెళ్దాం." అంటూ క్రిందకు దారి తీసింది ఇందుప్రియ.

"మనం వచ్చిన దారికాకుండా మరో అడ్డదారి వుంది. అటు వెళ్దామంటారా!"— వాసు.

"ఓ యస్! అటు కూడా చూడొచ్చుకదా!" — ఉత్సాహంగా ఒప్పుకుంది ఇందుప్రియ.

"మామూలు రోడ్డు మీదే మీ అమ్మాయిలు హైహీల్స్‌తో ఒకోసారి భరతనాట్యం చేస్తారు కదా, మీరీ దారిలో జారకుండా నడవగలరా అని."— తమాషాగా చూచాడు వాసు.

"ఫరవాలేదు. నేను బాలన్స్ కీప్ చెయ్యగలను." అని అతనికంటె ముందు దిగడం మొదలు పెట్టింది ఇందుప్రియ.

"ఆగండాగండి. ఎందుకైనా మంచిది. నేను ముందు దిగుతాను. మీరు నా అడుగు జాడల్లో దిగండి." అన్నాడు వాసు.

"మీరు మరీనూ" తనను దాటుకు పోతున్న వాసు వంక స్నిగ్ధంగా చూచింది ఇందుప్రియ.

"యీ శిధిలాలను చూస్తుంటే మీకేమనిపిస్తుంది?" — వాసు.

"ఒకనాటి వైభవాన్ని వూహించడానికి ప్రయత్నిస్తున్నా. అప్పుడు మన మేమై పుట్టివుంటామా అని ఆలోచిస్తున్నా!" సన్నగా నవ్వింది ఇందుప్రియ.

"ఏమనిపిస్తుంది?"

"ఓ పున్నాగ చెట్టునై పుట్టి వుంటా!"

"మీకు పున్నాగ పుష్పాలంటే అంత యిష్టమా! మరి నేను?"

"మీరా? మీరూ...... వో మహావీరుడై పుట్టి వుంటారు." నవ్వేసింది ఇందుప్రియ.

"డేమ్ ఇన్సల్ట్! నేనే అప్పుడు మహారాజుని. మీ రప్పుడు పున్నాగచెట్టు కదూ. అందుచేత మీకు సమంగా గుర్తు లేదు."— నవ్వుతూ ఇందుప్రియ వైపు చూచాడు వాసు.

"భలేవారే? ఆ మహారాజు మహావీరుడు కాక చచ్చు దద్దమ్మ అంటారా?"

"మళ్ళీ నాకే త్రిప్పి కొట్టారూ?" అంటూనే వున్నాడు, కాలు జారిన ఇందుప్రియ కెవ్వున కేకేసింది. తన ప్రక్కగా పడిపోతున్న ఇందుప్రియను చటుక్కున పట్టుకున్నాడు వాసు. క్షణంలో సగం సేపు పసిపిల్లలా అతన్ని అల్లుకుని వుండిపోయింది ఇందుప్రియ. తన బాహువుల మధ్య ఇమిడిన ఆమె శరీరంలోని అనుకంపనాన్ని గమనించి వివశుడయాడు వాసు. సున్నితంగా ఆమె తన బాహువుల్ని విడిపించుకుంటూంటే ప్రకృతి స్థితిలోకి వచ్చి 'సారీ!' అన్నాడు అస్పష్టంగా. అప్పుడే 'థేంక్ యూ!' అంది ఇందుప్రియ, తను పడిపోకుండా కాపాడినందుకు. ఒకరి వంక ఒకరు చూడడానికి సిగ్గుపడి మౌనంగా దిగారు.

ఓ పదినిమిషాలకుగాని వాసులోని వేడి తగ్గలా! కారు నడుపుతూ ఆలోచిస్తున్నాడు వాసు. ప్రక్కన కూర్చున్న ఆమెను తలచుకున్న కొద్దీ ఎలాగైనా ఆమెను సన్నిహితురాల్ని చేసుకోవాలనే కాంక్ష అధికమవుతూంది. ఇంతవరకు ఏ స్త్రీలోనూ కనిపించనిదేదో యీ అమ్మాయిలో వుంది. ఇందుప్రియ!! ఇందు... ప్రియ. అందరికీ 'ఇందు' తనకు ?! ప్రియ! ప్రియ!!

"ఏమిటి? మంత్రాలు చదువుతున్నారు?" అతని పెదవుల కదలికల్ని చిత్రంగా చూస్తూ

# ఒట్టు నేను త్రాగను

అడిగింది ఇందుప్రియ. ఆ పరధ్యానానికి నవ్వు కున్నాడు వాసు.

"అబ్బే! ఏంలేదు. ఈ దివిట వామాన్ని చూస్తున్నా!" అతివే అర్థంతో అన్నాడో గ్రహించి పోనంగా వుండిపోయింది ఇందుప్రియ.

ఇంటికి రాగానే ఇన్విటేషన్ పరిశీలనగా చూచింది విజయ.

"చెక్కిళ్ళు రోజారంగులో వున్నాయి. మా అన్నాయేమన్నా..." స్నానానికి వెళ్తున్న ఇందుప్రియ వంక కొంటెగా చూచింది విజయ.

"ఛీ పో" తన వంక చిరుకోపంతో చూచి వెళ్ళిన ఇందుప్రియలో ఇంటపక్కు లేంతవరకు వచ్చిందీ కొంతవరకు చలువగలిగింది విజయ.

పిక్చర్‌కు బయల్దేరేముందు అందరూ కూర్చుని కాఫీ తాగుతున్నారు. కాఫీ త్రాగుతూ వాసును గమనిస్తోంది విజయ.

"అన్నట్టు, ఇందూ! నాన్నగారి మధ్య నీకు మాచ్ చూస్తున్నారని వ్రాసావు. అదేమయింది? అతను లాయరని కదూ వ్రాసావు?" అంది విజయ, వాసు, మూర్తి చూడకుండా ఇందుప్రియ చేతిని నొక్కి. విజయేదో కోస్తోందని గ్రహించింది ఇందుప్రియ.

"కాదు గవర్నరు." అంది వళ్ళుమండి.

"నీ మొహం. ఇది వేరే సంబంధం, గవర్నరు, అదేదో దేశపు ప్రధానమంత్రి, మరేదో దేశపు యువ రాజు. వీళ్ళ అప్లికేషన్స్ ఎలాగూ చూస్తాంగా!" నవ్వేస్తూ వాసు వంక చూచింది విజయ.

"యింతకంటే ఘనంగా కూడ విజయ కలలు కంటుంది లేమ్మా! నువ్వేం అనుకోవద్దు." మూర్తి.

"యింక పోదామా?" ఆ సంభాషణ అంతగా రుచించని వాసు కాఫీ కప్పు టీపాయ్ మీద పెట్టి లేచాడు.

విజయ నాటిన బీజం యింతింతై వటుడింతై కూర్చుంది వాసు మనసులో. ఇందుప్రియ ఆ లాయరో, గవర్నరో, ఎవడో వాళ్ళ నాన్న కుదిరిస్తే చేసేసు కుంటుందా? ఏం? ఎందుకు చేసుకోదూ!! మహా చక్కగా చేసుకుంటుంది. అసలే అమ్మాయి. అందులో అమాయకురాలు. నాన్న తెచ్చిన వాడిని చేసుకోక తనను వరించి 'ప్రియతమ్! నువ్వు లేకపోతే నా జీవితం కటిక చీకటి' అని ప్రేమమాటలు మాట్లాడు తుందా తన పిచ్చిగాని...నో. తనిమెను పోగొట్టుకో కూడదు. విజయతో చెప్పాలి. అనుకుంటూ నిద్ర పోయాడు వాసు.

*　　*　　*

ఫోన్ మ్రోతతో మెలకువ వచ్చింది వాసుకు. బద్ధకంగా పడుకుని చెయ్యి చాచి ఫోన్ అందుకున్నాడు.

"హలో" అన్నాడు మత్తుగా.

"గుడ్‌మార్నింగ్ వాసూ! ఇందు ఈ రోజు సాయంత్రం వెళ్తానంటూంది."

"ఏమిటీ?" మత్తు దాదాపు వదిలిపోయి లేచి కూర్చున్నాడు.

"అవును. కాలేజీ వర్కింగ్ డేస్ కదా! వెళ్ళి పోతానంటూంది."

"అవునుగాని విజయా, నిన్న అన్నావు కదా, నిజంగా వాళ్ళ నాన్నగారు మాచ్ చూస్తున్నారా ఆవిడకి?"

"పిచ్చితండ్రీ! నిజంగాక అబద్ధం చెప్పి లాభ మేం?"

"అదికాదు, ఇంతా అసలు చదువవలేదు కదా!" నసిగాడు వాసు.

"ఈ రోజుల్లో ఆడపిల్లంటే 'గుండెల మీద కుంపటి' అని కదా జనవాక్యం. చదువుకున్నందు వల్ల ఆకుంపటి చల్లారదు సరికదా యింకా భగభగ మండు తుంది. మరీ కుంపటిని వీలయినంత త్వరగా దించే ప్రయత్నం చేస్తాడు కదా ప్రతి ఆడపిల్ల తండ్రి."

"నాన్సెన్స్"

"అంత చిరాకెందుకు మహానుభావా? ఇది తరతరాలుగా వస్తున్న మనసదాచారం. ఐనా యింత ఆసక్తి ఎందుకు పుట్టింది నీకు ఆకస్మాత్తుగా?"

"మంచికే, ఆమెను పెళ్ళాడాలనుకుంటున్నాను."

"వ్వాట్!" ఆశ్చర్యాన్ని అభినయించింది విజయ.

"నిజం."

"ఎల్. ఒ. వి. ఇ. నా?"

"అలాంటిదే?"

"మన కబుర్లన్నీ ఏమైపోయాయి యిండీ వచ్చి రియ లిస్టు గారూ!"

"ఇందుప్రియ పయిటి చెరగులకి మూట కట్టే శాను."

"అది సరే! ఇప్పుడేమిటి కర్తవ్యం?"

"నువ్వు హంసవో, మేఘానివో అవాలి."

"ఇరవై శతాబ్దం ఉత్తరార్థంలో వున్న అమ్మాయి హంసని, మేఘాన్ని అడ్డుపెట్టుకుని ప్రేమ కబుర్లాడే మగవాణ్ణి పిరికి వాడంటుంది. ధైర్యం లేని మగవాడి నీడను కూడ అసహ్యించు కుంటుంది."

"చాల్చాలు. ఐతే ఏం చెయ్యమని నీ సలహా?"

"బావుంది. చాలా అందంగ వుంది బాబూ! ఏదో బుద్ధిమంతుడవని నా ఫ్రెండ్‌కు పూరు చూపించు మని అప్పగిస్తే ఆ అమ్మాయిని ఎప్పటికీ నీ దగ్గరే వుంచేసుకుంటాననడంకాకుండా నన్నే సలహా అడుగు తున్నావా పైగా?"

"చంపక, ఏదో దారి చూపిద్దూ!"

"పిచ్చి! నేను చెప్పడమేమిటి వాసూ! అమ్మాయి తెలీదూ! తనతో ఒంటరిగా మాట్లాడడాని కవకాశం కల్పించుకుని నీ అభిప్రాయం చెప్పు."

"ఓ. కె. మా యింటికి రమ్మంటానయితే."

"నీ యిష్టం. యింక వుంటాన్నేను."

కోసిన కనకాంబరాలు దోసిట్లో పోసుకుని లోపలకు వచ్చింది ఇందుప్రియ. విజయ ప్రక్కన సోఫాలో కూర్చుని మాల కడుతూంది.

"ఇంకేమిటే కబుర్లు? తిరగడం తప్ప మనిద్దరం మాట్లాడుకున్నట్లే లేదు." అంది ఇందుప్రియ.

"కనీసం తిరగడమున్నా బావుందా లేదా?"

"బాగోకేం? సో జాలీ!"

"మొత్తంమీద వాసు కోటలో పాగా వేశావన్న మాట" నవ్వింది విజయ.

"ఏమిటీ?" అర్థంకానట్లు చూచింది ఇందు ప్రియ.

"ఏంలేదు. వాసు పేరెత్తగనే నువ్వు ఈస్ట్‌మన్ కలర్ కలలు కంటున్నావు కదా నిజం చెప్పు."

"ఈస్ట్‌మన్ కలరూ లేదు, గేవా కలరూ లేదు"

"ఏదో కలర్‌గాని, అబ్బాయిలు త్రాగడం పైద నీ అభిప్రాయమేమిటి?"

"వాళ్ళు త్రాగడం మీద నా అభిప్రాయ

కెందుకు మధ్య?"

"ఏం తెలుసుకో, వాసేమన్నా షాంపేన్ రుచి చూపించాడా నీకు?"

"ఏమిటి? ఆయన డ్రింక్ చేస్తారా?" ఆశ్చర్యంగా చూసింది ఇందుప్రియ.

"ఏం? చెయ్యకూడదా?"

"ఛ! ఐ హేట్ ఇట్."

"వాసు డ్రింక్ చెయ్యడం మీద నీ అభిప్రాయం సెందుకు మధ్య" నవ్వింది విజయ.

"ఎందుకు." విజయ వెన్ను మీద ఒకటేసి చిలిపిగా నవ్వింది ఇందుప్రియ.

"వాసు ఇక్కడ వుంటే నీ సుకోమల హస్తం కందిపోయుంటుందని వాపోయేవాడు."

"పాపం!"

"మీ రిద్దరూ ఇష్టపడి పెళ్ళాడితే బావుండునని నాకు చాలకాలంగా వుంది. కాక ఇప్పుడే నిన్నెందుకు రమ్మని వ్రాశానో తెలుసా? వాసు అలవాటు వ్యసనం కాకముందే అతన్నా దారి నుండి మరల్చాలని. ఆ భారం నీదే."

"బావుంది. నాకేం తెలుసు ఏం చెయ్యాలో?"

"ఏం తెలుసు మరి? చెప్పి పెట్టకుండా ప్రేమించడం తెలుసా?"

"ఓ యస్ తెలుసు" వెంకెగా చూసింది ఇందుప్రియ.

"సంతోషించాలే. నేను చెప్పేది విని కాస్త జాగత్తగా ప్లాన్ చెయ్యి. ఎంత దౌర్భాగ్యుడయినా, ప్రేమించిన అమ్మాయి ముందు అబద్ధమాడడు. ఆ అమ్మాయి అనురాగం కోసం కొన్ని విలువైన వాటిని వదులుకోవడానికి కూడా సిద్ధపడతాడు. అలాటిది వాసు లాంటి వాడు నువ్వు నేర్పుగా అడిగితే త్రాగడమనే అల్ప విషయాన్ని వదిలేయకుండా వుంటాడని అనుకోను." ఆగి, ఇందుప్రియ ముఖం లోకి చూసింది విజయ. ఆలోచిస్తున్నట్లు నిలబడిందామె.

"ఆలోచించు. కొంచెంసేపట్లో వాసు వస్తాడు. నిన్ను తీసుకు వెళ్ళడానికి."

ఇందుప్రియ ఆలోచనలో వుండగానే వాసు వచ్చాడు. విజయతో కాసేపు హాస్యమాడుతూ, పిల్లలతో ఆడుతూ కొంచెంసేపు గడిపాడు.

"మా యింటికి వెళ్దాం రండి. మిమ్మల్ని తీసుకు వెళ్ళకపోయానంటే బొత్తిగా నాకు మర్యాద తెలీదంటుంది విజయ." ఇందుప్రియ వంక చూస్తూ చిన్నగా నవ్వాడు వాసు. విజయ వంక పాలిపోయిన ముఖంతో చూసింది ఇందుప్రియ.

"వెళ్ళిపోయే ముందు ఇప్పుడు పిలుస్తున్నాడు పెద్దమనిషి, పైగా మర్యాదట. పోనీ, వెళ్ళు ఇందూ! పాపం! వెళ్ళకపోతే చిన్నబుచ్చుకుంటాడు."

"మరి నువ్వు రావూ?" ఇందుప్రియ.

"ఎలాగూ యీ రోజు హాస్పిటల్లో నిగనామమేగ అమ్మకి కొంచెం వంట సహాయం చేసి వస్తాను. మీరు ముందుండండి. అయినా నేనెందుకు లెండి మధ్య?" చిలిపిగా ఇద్దరి వంక చూసింది విజయ.

మరో పదిహేను నిమిషాల తరువాత వాసు ఇంట్లో వున్నారు వాసు, ఇందుప్రియ.

"ఈవినింగ్ వెళ్ళన్నాటు కదా!" సి.కెవ్ వెలిగిం సంభాషణ కుప్రక్రమించాడు వాసు.

"నేవ్వూ!"

"విజయ మీకు చూచాయగా చెప్పే వుంటుంది."

"అబ్బే! విజయేం చెప్పలేదే!" అమాయకంగా చూసింది ఇందుప్రియ.

"ఏమీ చెప్పకుండానే బుద్ధిమంతురాల్లా అడగ్గానే నా వెంట వచ్చారా?"

"ఏదో మీరు బుద్ధిమంతులని అపోహపడి వచ్చాను."

"అపోహ ఎందుకండోయ్? నేను అక్షరాలా బుద్ధిమంతుణ్ణే"

"నాకు విశ్వసనీయ వర్గాల నుండి అందిన వార్తలు వేరుగా ఉన్నాయి."

"ఏమని?" సంశయంగా చూశాడు వాసు. కొంపతీసి విజయగాని తను డ్రింక్ చేస్తాడని యీ అమ్మాయితో చెప్పలేదు కదా! ఆరోజు పబ్లిక్ గార్డెన్స్లో విజయ అన్నమాటలు గుర్తుకు వచ్చాయి. "ఏ రోజగా వుండే ఏ అమ్మాయయినా తన భర్త 'త్రాగుబోతు' అనే వూహను కూడ భరించలేదు వాసూ"

"మీకు తెలీదా?" తనను ప్రశ్నిస్తున్న ఇందుప్రియ చూపులకు తట్టుకోలేని దోషిలా తలవంచాడు వాసు.

"మీకు తెలీదు." వాసు తనను సమర్థించుకో చూశాడు.

"ఉహూ నాకు తెలిసినంతగా మీకు తెలీదు వాసు గారూ. నా కళ్ళముందు మా కుటుంబం ఒక వ్యక్తి ఆ అలవాటుకు ఆహుతయిపోయాడు. ఫారిన్లో పెద్ద చదువు చదువుకొచ్చి ఎన్నో ఆదర్శాలతో జీవితాన్ని ప్రారంభించిన బాబాయి సరదాకని మొదలు పెట్టిన అలవాట్లు వ్యసనాలయి ఇంటినీ వంటినీ గుల్ల చేసుకున్నాడు. తన భర్తతో, పిల్లలతో కలకళ లాడుతూ వుండవలసిన పిన్ని పతికోళ్ళకే పిచ్చిదయి కూర్చుంది. ఆవిడను చూస్తే "భగవాన్! ఇలాంటి దౌర్భాగ్యం ఏ స్త్రీకీ వద్దు" అనిపిస్తుంది." బాధతో, అణుకుతున్న ఆమె మాటలు విని విలవిలలాడాడు వాసు.

"అంతగా పతనమయి పోవడానికి నిగ్రహంలేని వాడన్నా అనుకున్నా మీరు. ప్రతివ్యక్తీ తనను గురించి తను గొప్పగానే అంచనా వేసుకుంటాడు. అలా అనుకుంటూనే తన మనసు పగ్గాలు సడలిస్తాడు. అప్పుడు మనసు పంచకళ్యాణిలా పరుగెత్తితే దాన్ని అదుపులో పెట్టుకోలేక సర్వనాశనమవుతాడు." లేచి కిటికీ కర్టెన్ ప్రక్కకు తొలగించి పూలమొక్కలవైపు చూస్తూ కూర్చుంది ఇందుప్రియ. సాహసంగా లేచి వచ్చి ఇందుప్రియ ప్రక్కన నుంచున్నాడు వాసు.

"నన్ను నమ్మలేరా మీరు?" ప్రాధేయపూర్వకంగా ఇందుప్రియ కళ్ళల్లోకి చూశాడు వాసు.

"ఏ ఆధారం మీద నమ్మమంటారు? మిమ్మల్ని చూడగానే మీ మీద ఏర్పరచుకున్న అభిప్రాయాలు ఈ నాలుగురోజుల సన్నిహితత్వంతో బలపడ్డాయి. ఉదయం మీరు, విజయ ఫోన్లో మాట్లాడుకున్నది విన్న నేను అదృష్టవంతురాల్నని మురిసిపోయాను. కాని.. వూహూ... ఎంత ప్రయత్నించినా మనసును సరిపెట్టుకోలేకపోతున్నాను. నేనూ పిన్నిలా అయితే?" ఇందుప్రియ కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

"ప్రియా! ఒట్టు! నేను త్రాగను." అంటూ ఇందుప్రియ చేతులు పట్టుకున్నాడు, ఆమె కన్నీటిని చూసి చలించిపోయిన వాసు. కర్టెన్ తొలగించి లోపలకు రాబోతున్న విజయ ఆ మాటలు విని నవ్వుకుని నిశ్శబ్దంగా బయటకు వెళ్ళిపోయింది. ●



సీరియల్



# జాహ్నవి హైమవతులు

సి. ఆనందారామం

## జరిగిన కథ

ఉమాపతికి ఇద్దరు భార్యలు. హైమవతి జాహ్నవి లిద్దరూ అక్కచెల్లెళ్లే. సహనం, సానుభూతి హైమవతికి ఆభరణాలయితే, ద్వేషం, అసూయ జాహ్నవి సొత్తు. జాహ్నవికి అవకరంగా జన్మించింది నీరజ. శ్రీరామచంద్రమూర్తి, మనోరమా ఇద్దరూ హైమవతి సంతానం. ఆడపిల్లలిద్దరూ కాలేజీలో చదువుతున్నారు. రాజా మనోరమను ప్రేమించాడు. నీరజ రాజాను ప్రేమించింది రాజాను నీరజకు చేసుకోవాలని జాహ్నవి దృఢంగా సంకల్పించుకుంది. జాహ్నవి సంకల్పాన్ని నెరవేర్చాలని హైమవతి నిస్వార్థంగా కృషి చేసింది.

## 7

ఒక్కసారి ఎలాగైనా రాజాను కలుసుకొని ఆ ఉత్తరం తను ఏ పరిస్థితుల్లో రాసిందీ చెప్పేయాలని కొట్టుకుపోతూంది మనోరమ.

మనోరమ ఈ ఉద్దేశాన్ని గమనించిందో అన్నట్టు గుమ్మం దిగితే, మనోరమను నీడలా వెన్నాడుతోంది జాహ్నవి. ఆమె జబ్బంతా ఏమయిపోయిందో మరి! నళిని ఉంటే మనోరమకు తన పని కొంత తేలికయ్యేది. కానీ, నళిని అత్తవారింట్లో ఉంది. ఆమధ్య పండగల కొచ్చింది. మళ్ళీ ఎప్పుడొస్తుందో తెలియదు. వ్యర్థంగా ఆ వంకనా, ఈ వంకనా బయటికి ప్రయాణమవుతుంది.. జాహ్నవి నీడలా అనుసరిస్తూనే ఉంటుంది. అయినా ఒళ్ళంతా కళ్ళు చేసుకుని రోడ్లన్నీ వ్యర్థంగా పరిశీలిస్తూ ఉంటుంది.

రాజాతో నీరజకు సంబంధం నిశ్చయమయిపోయింది. చిన్నగాలి తాకిడికి సహితం నీరజ పులకించి పోతూంది. తాను వ్రాసిన ఉత్తరం తల్చుకొని రాజాను చూడలేక, బయటకొస్తే రాజా ఎక్కడ కనిపిస్తాడోనని గడప దాటడంలేదు. తన కోసం యావదాస్తి ధారపోస్తున్న పెద్దమ్మ ఋణం ఏ విధంగా తీర్చుకోవాలో అర్థం కాలేదు నీరజకు.

"నీరజా! బజారెళ్ళి బట్టలు కొనుక్కొద్దాంరా!" అంది జాహ్నవి. ఇటీవల ఆవిడ ఒకటే హడావుడిగా తిరుగుతోంది. ఈ తిరగటం వల్ల ఒంటినొప్పి ఎక్కువవుతున్నా పట్టించుకోటం లేదు. హైమను కానీ, మనోరమను కనీ తల్లి పిలవకపోవటం నీరజకు కష్టం తోచింది. పైగా నీరజకు బయటకు వెళ్ళాలని లేదు.

"మనోను తీసికెళ్ళమ్మా! నాకే చీరలు బాగుంటాయో, నాకంటె మనోకు బాగా తెలుసు."

"నాకా? నాకేం తెలుసు?" గాభరాగా అంది మనో.

"ఏం తెలియాలి? నీకు బాగున్నవి తీసుకురా! నీకు బాగున్నవి నాకూ బాగుంటాయి."

మనోరమ బేలగా తల్లి వంక చూసింది.

నీరజకు రాజాతో పెళ్ళి.

ఆ పెళ్ళికి చీరలు కొనటానికి మనోరమ వెళ్ళాలి. ఆ తురి ముఖం చూడలేక హైమ అక్కడి నుంచి లేచిపోయింది.

"పోనీ, నువ్వే వెళ్ళరాదూ నీరజక్కా!" ప్రతిమాలింది.

"అబ్బ! వెళ్ళమంటూంటే!" మృదువుగా కసిరింది నీరజ.

భారంగా అడుగులువేస్తూ పినతల్లి వెంట కదిలింది మనోరమ. మనోరమ తనతో రావటం ఇష్టం లేకపోయినా తప్ప లేదు జాహ్నవికి.

తన కారులో వెడుతూ యధాలాపంగా తల తిప్పిన రాజాకు బట్టల షాపులో మనోరమ కనిపించింది. అతనికి తెలియకుండానే చేతులు బ్రేక్ వేసేసాయి. 'సహారా ఎడారిలో సంవత్సరాల తరబడి ప్రయాణం చేస్తున్న వాడికి అకస్మాత్తుగా ఒయాసిస్సు కనబడినట్లనిపించింది రాజాకు మనోరమ దర్శనం. కారును షాపు పక్కగా ఆపి, స్టీరింగ్ మీద తల ఆన్చి మనోరమను చూస్తూ కూర్చున్నాడు. ఆ చూపులకు ప్రభావితురాలయి మనోరమ కూడా తల త్రిప్పింది.

రాజాను చూసిన మొదట క్షణంలో ఆమె ముఖం రేరాజును చూసిన కలువ చెలువాన్ని పొందింది. అంతలో వెలవెల పోయింది.

చిరునవ్వుతో విచ్చుకోబోయిన పెదవులు దుఃఖాన్ని అణచుకోడానికి పలువరుస క్రిందికి ఒదిగిపోయాయి. కళ్లలో సహితం దుఃఖాన్ని ఓపలేని ఆ ముగ్ధ చూపులు దుఃఖపు పరమావధిని మోసాయి. రాజా కదిలిపోయాడు కరిగిపోయాడు. ఆమెను అక్కున చేర్చుకుని కౌగిలిలో లాలించాలనుకున్నాడు. తన పెదవులతో ఆ కళ్ళలో గూడు కట్టుకొన్న విషాదాన్ని తుడిచి వెయ్యాలనుకున్నాడు. ఏదో చెప్పబోతున్నట్లు మనోరమ పెదవులు కదిలాయి.

"నేను సిద్ధాన్ని!" అన్నట్లనిపించింది రాజాకు. మనోరమ పాదాలు కదిలాయి. అడుగు ముందు పడింది.

ఒక్క ఉదుటున తన గుండెల మీద వాలిపోవాలని మనోరమ ప్రయత్నించి నట్లనిపించింది రాజాకు. ఎందుకో తెలియకుండా చేతులు జాపాడు. మనోరమ అడుగులు ముందుకు కదిలాయి. అంతలో జాహ్నవి చెయ్యి బలంగా మనోరమను పట్టుకొంది.

చీరలు చూస్తూ మనోరమను ఏదో అడిగింది జాహ్నవి. సమాధానం రాకపోయేసరికి తల తిప్పి చూసింది. సంగతి గ్రహించింది. జాహ్నవి ఒంటి నిండా తేళ్ళూ జెర్రులూ పాకాయి. ఎక్కడివక్కడి వదిలేసి షాపువాడు విస్తుపోయి చూస్తున్నా, మనోరమ చెయ్యి పట్టుకొని బరబర లాక్కుపోయింది. ఉసూరుమంటూ కారు స్టార్ట్ చేసాడు రాజా.

ఉత్త చేతులతో వచ్చిన తల్లినీ మనోరమనూ చూసి ఆశ్చర్యపోయింది నీరజ. సెగలు కక్కుతున్న తల్లి ముఖాన్ని ముడుచుకుపోయిన మనోరమ ముఖాన్నీ కలిపి చూసుకునే సరికి, ఆ ఆశ్చర్యాన్ని అనుమానం పెన వేసుకుంది.

"ఏమయిందమ్మా!" అంది గాభరాగా

"మనోరమకు తలనొప్పొచ్చింది. అందుకు వచ్చేసాము" అంది జాహ్నవి ముటముట లాడుతూనే. నీరజకు నమ్మకం కలగలేదు. మనోరమను లోపలకు తీసికెళ్ళి గది తలుపు వేసేసి బయట నుంచి తల్లి పిలుస్తున్నా వినిపించుకోకుండా "ఏం జరిగింది మనో?" అంది.

అక్కను కౌగిలించుకుని బావురుమంది మనోరమ. మనోరమ వెన్ను నిమురుతూ ఆ శోకావేశం తగ్గేవరకూ బుజ్జగిస్తూ ఉండిపోయింది నీరజ.

"ఇప్పుడు చెప్పు. ఏం జరిగింది? నీకేం కష్టం కలిగింది? నేనుండగా నీ కళ్ళలో కన్నీళ్లెందుకు రావాలి? నాకు చెప్పు మనో! అమ్మ ఏమైనా అన్నుకుందా? అమ్మ సంగతి తెలుసుగా! పట్టించుకోకూడదు."

"కాదు! కాదు!"

"మరేమిటి?"

"ఏం లేదు."

"నాకు తెలుసు. అమ్మకు బాగున్న చీరేదో నువ్వు బాగులేదు అని ఉంటావు. అమ్మ విసుక్కొని ఉంటుంది. అంతే కదూ! అమ్మ మాటలు పట్టించుకో కూడదు. అంతేకాని, ఇలా గుండె చెరువయ్యేలా ఏడుస్తారా? నీ ఒక్క కన్నీటి బొట్టు నన్నెంత హింసిస్తుందో నీకేం తెలుసు? అమ్మకు బుద్ధి లేదు. లేకపోతే, నీ కన్నీళ్ళ మధ్య నా పెళ్ళికి చీరలు కొంటుందా?"

మళ్ళీ దుఃఖం ఉప్పెనలా వచ్చింది మనోరమకు.

"ఎందుకు? ఎందుకు? ఉండు. అమ్మ పని గొస్తాను." ఉగ్రురాలై బయలుదేరింది నీరజ. నీరజ చెయ్యి గట్టిగా పట్టుకొంది మనోరమ.

"అది కాదక్కా. నీకు పెళ్ళైపోతుంది. నువ్వు వెళ్ళిపోతావు. అది తలుచుకుంటే ఏడుపొస్తోంది.."

"పిచ్చిపిల్లా." వాత్సల్యంగా మనోరమ తలను నిమిరింది. నీరజ కళ్ళలోనూ నీళ్ళు నిండుకున్నాయి.

"పోనీ మన అమ్మలలా మనమూ ఒకళ్ళనే చేసుకుందా మేమిటి?"

అదిరిపడింది మనోరమ.

"ఛా. అపోరి కొద్దు."

"అవునులే! అపోరికొద్దు. తమాషాగ అన్నాను. ఇంక కళ్ళు తుడిచేసుకోమరి. ఏదీ, వన్ టూ త్రీ."

కిత కితలు పెట్టి మనోరమను నవ్వించింది నీరజ. మనోరమ నవ్వు కూడా ఏడుపులాగే ఉంది.

*　　　*　　　*

నళిని వ్రాసిన ఉత్తరం చదువుకొంటున్నాడు రాజా.

"అన్నయ్యా!

నువ్విలా ప్రవర్తిస్తావని కలలో కూడా అనుకోలేదు. మనోరమకు నీ మీద ఎంత ప్రేమో నాకు బాగా తెలుసు. నువ్వు మనోరమనే ప్రేమించావు. అలాంటప్పుడు నీరజ నెందుకు చేసుకుంటున్నావో తెలియటంలేదు. నీరజ కయితే ఎక్కువ కట్నమిస్తారని కదూ! కట్నం కోసం నీ జీవితాన్ని నువ్వు పండించుకొంటున్నావా? అంతగా డబ్బు కోసం కొట్టుకుపోటానికి మనం లేనివాళ్ళమా? ఆలోచించన్నయ్యా! ఇప్పటికయినా మించిపోలేదు. నీరజను కాదు. మనోరమనే చేసుకుంటావని చెప్పెయ్యి. లేకపోతే, నేను నీ పెళ్ళికి రాను. చేతులారా నీ మెడకు నువ్వు ఉరి త్రాడు బిగించుకోవటం చూసి నేను సహించలేను.

నీ చెల్లెలు,
నళిని."

చేతులారా ఉరిత్రాడు.

బాధగా నుదురు రాసుకున్నాడు రాజా.

అవును ఇది ఉరిత్రాడే! ఎందుకు తగిలించుకుంటున్నట్లు? మనోరమ అడిగిందనా? డబ్బు కోసమా? డబ్బు తన కక్కర్లేదు. మనోరమ కోరిక చెల్లించటానికే తనెంత మగాడు! ఇట్లాంటి కోరిక కోరే అధికారం మనోరమ కెక్కడిది? కోరితే తనె దుకు ఒప్పేసుకోవాలి?

ఏమైనా ఎక్కడికయినా పారిపోవాలి. పారిపోతే, పెళ్ళి దానంతట అదే ఆగిపోతుంది. ఛ! అన్యాయంగా ఒక ఆడపిల్ల బ్రతుకు నాశనమవుతుంది. ధైర్యంగా చెప్పెయ్యాలి. నాకీ పెళ్ళివద్దని చెప్పెయ్యాలి.

విసురుగా లోపలికి వెళ్ళాడు రాజా.

"అమ్మగారు ఉమాపతిబాబు గారింటికి వెళ్ళారు. హైమవతమ్మ గారితో ఏదో మాట్లాడాలన్నారు." దాసీది చెప్పింది.

కోపంగా బయటికి రాబోతూ తత్తరపడి ఆగిపోయాడు రాజా.

ఎదురుగా మనోరమ!

చేతులు జాపాడు.

వినవటానికి ఓపిక లేనట్లు మనోరమ ఆదాపిన చేతుల్లో ఇమిడిపోయింది. రెండు హృదయాలూ ఆర్తితో పరస్పరం క్షోభను పంచుకున్నాయి. మనోరమను తనలో ఒక భాగంగా లీనం చేసేసుకోవాలన్నంత తపనతో అదుముకొన్నాడు రాజా. నేను మీలో ఒక భాగాన్ని అన్నట్టు హత్తుకుపోయింది మనోరమ.




ఇద్దరికీ బాహ్యప్రపంచ జ్ఞానంలేదు. ఏం చేస్తున్నారోనన్న స్మృతి లేదు.

మనోరమ కళ్ళకు రాజా మాత్రమే కనిపిస్తున్నాడు. రాజా కళ్ళకు మనోరమ మాత్రమే కనిపిస్తోంది.

"మనో! నిన్ను వెళ్ళనివ్వను. విన్నువదలను. వదిలి క్షణం ఉండలేను—" మరింత అదుముకున్నాడు రాజా.

మనోరమకు స్పృహవచ్చింది. రాజా చేతులు వదిలించుకుని దూరంగా కూచుంది.

ఎన్నెన్నో మాట్లాడాలని ఎంతో తెగింపుతో వచ్చింది.

రాధాయమ్మ జాహ్నవితో మాట్లాడటం చూసి నది. తయారయితే జాహ్నవి అనుమానపడుతుందని ఉన్నదున్నట్టుగా వచ్చేసింది. ఎవరికీ చెప్పనుకూడా లేదు.

రెండుమూడుసార్లు పెదవులు కదిలాయి కానీ దుఃఖం గొంతును పూడ్చేసింది.

"రా మనో!" మళ్ళీ చేతులు జాపాడు రాజా!"

"మీతో మాట్లాడాలి" కష్టంమీద అంది.

"మాట్లాడు. ఏం మాట్లాడినా వింటాను. కానీ అలా కూర్చునికాదు. ఇలా నా గుండెలమీద తలపెట్టి చెప్పు— నా చెవుల్లో చెప్పు— నా పెదవుల మధ్య చెప్పు. రా మనో! నాకు దూరంగా ఉండకు."

మనోరమ దుఃఖాన్ని ఆపుకోలేక పోతూంది. కష్టం మీద రాజాను వారిస్తూ "ఒక్కమాట! ఆ ఉత్తరం వ్రాసింది నేనుకాదు." అంది.

"ఏమిటి?" నిస్తపోతూ అన్నాడు రాజా.

"అవును! నేనే. కానీ, మీకుకాదు. అంటే, సిగ్గి మీకిస్తుందని తెలియదు. మీకయితే అలా రాసే దాన్నికాదు.

"ఏమంటుందా!" కూలబడ్డాడు రాజా!

"అది నేను మీకు ఎలా వ్రాసాననుకున్నారు? నాటితో మీకేమీ చెప్పలేదు నిజమే! కానీ, నిజంగా నాసర్వస్వమూ మీ రేనని మీకు తెలియదా? అనాడు మీచేతుల్లో ఒదిగిపోయిన నాశరీరంచెప్పలేదూ, మీ కానంగిని? మిమ్మల్ని చూడగానే మెరిసిపోయే నా కళ్ళల్లో చదవలేదా ఆసంగతి? నేను —భావనతో ప్రతిక్షణమూ మీసాన్నిధ్యంలోనే ఉండేనేను— మీ మీద ప్రేమలేదని వ్రాయగలనని ఎలా అనుకున్నారు? అది నమ్మకుని నీరజక్కయ్యను చేసుకోడానికి ఎలా ఒప్పుకున్నారు?

"మనో! ఏమిటి మాట్లాడుతున్నావ్ నువ్వు! నాతల తిరుగుతోంది. నువ్వునాకు రాయకపోతే, అది నాకెలా చేరింది? ఇంకొకరికి అలా రాయ వలసిన అవసరమేముంటుంది?"

"ఇదంతా పిన్ని పన్నాగం—"

"ఓ గాడ్! జాహ్నవమ్మ!!!"

మనోరమ తలవంచుకుని కూర్చుంది. రాజా

# జాహ్నవి హైమవతులు

ఆలు పెక్కున్నాడు రాజా.

"అయ్యయ్యో! ఎంత దారుణం జరిగిపోయింది మనో! ఎంత పొరపడ్డాను? నామీద ప్రేమలేదని వ్రాసిన వాక్యాలు నమ్మలేక పోయాను. కానీ,మీ అక్కయ్య కోసం నువ్వు త్యాగం చేస్తున్నావను కున్నాను."

"త్యాగమా? మిమ్మల్ని త్యాగం చేస్తానా? అక్కను దుఃఖ పెట్టిన పాపానికి నరకానికి పోవలసి వస్తే హాయిగా పోయేదాన్ని— కానీ, మిమ్మల్ని వదులుకునేదాన్నా? లోభిలా మిమ్మల్ని నా గుండెల్లో దాచేసుకున్నానే! మరొకరికి దాన మిస్తానా?" రాజా చటుక్కున లేచాడు.

"పద! మనో! ఎక్కడికైనా లేచి పోదాం."

మనోరమ నిర్జీవంగా నవ్వింది.

"సమస్తమూ ముగిసి పోయింది. ఇప్పుడిక విదారి లేదు— సంబంధం స్థిరపడి పోయాక ఇలా చెడిపోతే, అక్కకీ జన్మలో పెళ్ళికాదు— అక్క కన్నీళ్ళ మధ్య నా కళ్యాణమా? మొదటే మన సంబంధం స్థిరపడి ఉంటే అక్క తన మనసులో ఈ భావన నిలవ నిచ్చేది కాదు. ఇప్పు డాశలు నింపి ఆశాశాని కెత్తి పాతాళానికి తోస్తారా? అక్కకు అన్యాయం చెయ్యమని చెప్పడానికి రాలేను. నేను మీ దాన్నని చెప్పడానికి వచ్చాను. చెప్పానుగా, నేను లోభిని! మీరు నన్ను ప్రేమిస్తున్నారని నాకు తెలుసు. ఆ ప్రేమ అలాగే ఉండాలి. అది నాకు కావాలి. దానికి చిన్న మచ్చకూడా నేను సహించ లేను. శాస్త్రాలు సప్తేమని పిలిచినా, విధి నాకు నరకాన్ని విధించినా, సంఘం నన్ను వెలికి త్రోసినా నేను మీదానిని— మీ భార్యను."

"నువ్వేం చెప్తున్నావు మనో!" అయోమయంగా అడిగాడు రాజా..

"అక్కయ్యను చేసుకొమ్మని చెప్తున్నాను. నన్ను మరిచిపోవద్దని ప్రార్థిస్తున్నాను."

"నన్ను నరకం అనుభవించ మంటున్నావు."

"మన భాగధేయంలో అదే ఉందేమో! నేను వెళ్తాను. రహస్యంగా వచ్చాను."

మనోరమ లేచింది. "మనో!" అంటూ రెండు చేతులు చాపాడు రాజా.

"ఉహూ! మా అక్కయ్య సంపద నేను దొంగి లించను. ఇందాక నేనేం చేస్తున్నానో నాకే తెలియ లేదు."

విషాదం నింపుకొన్న చిరునవ్వుతో వెక్కిళ్ళు తీసుకుంటూ వెళ్ళిపోయింది మనోరమ.

* * *

సన్నాయి వాయిద్యాలు మధురంగా మ్రోగు తున్నాయి. నీరజను పెళ్ళి కూతురిగా అలంకరిస్తు న్నారు.

బంగారు జరీ— రవ్వల ముత్యాల వడ్డాణం— కెంపుల పొదిగిన బంగారు పట్టీలు— ఎర్రని నిగ్గు [illegible] ఉన్న జరీ పువ్వుల ఆకు పచ్చ పట్టు చీర— పచ్చగా కెంపులా ఉన్న అద్దిగ— అటు [illegible] కెంపుల గాజుల నడుమ పచ్చల గాజులూ. గుండెలమీదుగా వున్న బంగారు గొలుసు పచ్చలూ కెంపులూ రవ్వలూ తాపిన అంది [illegible]. మెరిసిపోతోంది నీరజ.

మనోరమ కళ్ళు క్రింది భాగమంతా నీ(గ [illegible]

లేలేక పోయింది. మనోరమ ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్న మబ్బులకు త్వరలో సంభవించబోయే తమ వియోగమే కారణమని అర్థం చెప్పుకున్న నీరజ మనసు చెల్లెలిపట్ల మరింత ఆర్ద్రమయింది. నీరజ బలవంతంమీద పట్టుచీర కట్టుకుంది మనో రమ. ఏ అలంకరణ మీదా ఆమె మనసు పోలేదు.

నిండు ముస్తాబులో ఉన్న నీరజను కళ్ళ పండువుగా చూసుకుంది జాహ్నవి. ఆమె కళ్ళ లోంచి ఆనంద భాష్పాలు జాలువారి పోతున్నాయి.

"నా బ్రతుకు పూర్తిగా మోడై పోలేదు. ఒక్క కోరిక— కనీసం ఒక్క కోరిక నా బ్రతుకులో నెర వేరింది. ఇది చాలు. సంతృప్తిగా చస్తాను."

నీరజను మళ్ళీ మళ్ళీ చూసుకొంటూ గొణు క్కుంది జాహ్నవి. తల్లి వంక జాలిగా చూసింది నీరజ.

"నా నీరజ పెళ్ళికూతురయింది. కోరిన వాడిని చేసుకుంటూంది. కలకాలం సుఖంగా ఉంటుంది."

నీరజ తల నిమురుతూ అంది జాహ్నవి. మనోరమ చటుక్కున అక్కడి నుండి లేవబోయింది.

నీరజ మనోరమ చెయ్యి గట్టిగా పట్టుకొంది.

"లేవకు మనో! నా కెందుకో భయంతో గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. నువ్వు నా దగ్గిరే ఉండు."

"ఇప్పుడే వచ్చేస్తానక్కా!" మృదువుగా విడి పించుకుని వెళ్ళిపోయింది మనోరమ.

ఎంత సరిపెట్టుకున్నా, జాహ్నవి ముఖం చూడ గానే మనసులో భగ్గుమంటూంది మనోరమకు. జాహ్నవి సమక్షంలో మంటలలో ఉన్నట్లే ఉం టుంది. మనోరమ కనిపించినప్పుడల్లా, జాహ్నవి కూడా ఉలిక్కి పడుతుంది. తన కూతురి సంతోష జీవితమనే నందన వనంలో మనోరమ విషవృక్షంలా అనిపిస్తూంది జాహ్నవికి.

"నీరజా! మనోరమ వంతగా నేరది య్యకు!" అంది మందలింపుగా జాహ్నవి.

తల్లి ధోరణి అలవాటయిన నీరజ నవ్వి వూరు కొంది.

"నవ్వుతున్నావ్ కదూ! నీ కర్థం కావటంలేదు. పెళ్ళయ్యాక మనోరమను పూర్తిగా మరిచిపో! పొర పాటునయినా, నీ భర్త దరిదాపులకు మనోరమను రానియ్యకు."

నీరజకు కొంచెం కష్టం తోచింది.

"ఏమిటమ్మా, నీదంతా చాదస్తం? వైవాహిక జీవితాన్ని అనుమానాలతో ప్రారంభించమంటావా?"

"అనుమానం కాదమ్మా! నిజం! నిజం! ఈ మనో రమా, రాజా ప్రేమించుకున్నారు. వాళ్ళిద్దరిని ఒక దగ్గిర చేరనిచ్చావంటే, నీ బ్రతుకు బూడిదవు తుంది."

జాహ్నవి నీరజను కన్నదేకాని పెంచలేదు. అందుకే నీరజ గురించి జాహ్నవి కేమీ తెలియదు. ఏ కొంచెం తెలిసినా, ఈ ప్రస్తావన చేసేదికాదు. తనను తానే అర్థం చేసుకోలేని వెర్రిబాగులది. నీరజ వంటి లోతైన మనుష్యుల సవలర్థం చేసుకో లేదు. తల్లి మాటలకు నిర్ఘాంతపోయింది నీరజ. వెలవెలపోతూ "రాజా మనోరమలు ప్రేమించు కున్నారని ఎవరు చెప్పారు నీకు?"

నీరజ వెళ్ళిపోటును జాహ్నవి తన మనసు బట్టి అర్థం చేసుకుంది. మనోరమ రాజాను ప్రేమిం చటం నీరజ సహించలేక పోతూందనుకొంది. కొంత గర్వంతో వివరించింది.

"నీకు రాజా రాసిన ఉత్తరం బట్టే అర్థం చేసు కున్నాను. దానివల్లే నువ్వు రాజాను ప్రేమిస్తున్న ట్లుగా కూడా అర్థమయింది. నువ్వు ప్రేమించిన వాడిని నీకు భర్తగా చెయ్యాలని భగీరథ ప్రయత్నం చేసాను. చివరకు సాధించాను."

గర్వంతో సంతృప్తితో పొంగిపోతోంది జాహ్నవి.

"ఏదీ ఆ ఉత్తరం? నీ దగ్గరుందా ఇంకా?"

"ఆ ఉంది. దాచాను. తెస్తానుండు."

జాహ్నవి వెళ్ళింది. నీరజకుతల తిరిగిపోతూంది. అంతకుముందు ఎంతో మురిపెంతో చూసుకున్న అలంకారాలన్నీ తనను చూసి వెక్కిరిస్తూ నవ్వు తున్నాయి. అవన్నీ తీసెయ్యబోయింది. అంతలో ఏదో ఆలోచించుకుని ఆగిపోయింది. కాస్సేపటికి నే జాహ్నవి ఉత్తరంతో వచ్చింది.

చాలా ఆసక్తిగా రాజా ఉత్తరం చదువుకొంది నీరజ.

"ఇప్పుడర్థమయిందా?"

"అర్థమయింది" నిట్టూరుస్తూ అంది నీరజ. అప్పుడు చాలా అర్థమయ్యాయి. రాజా తనకెందుకు సినిమాకు ఆహ్వానించాడో, పెదవులు తనతో మాట్లా డుతున్నా కళ్ళెవరి మీద నిలిచేవో, ఎవరిసాన్ని హిత్య సౌభాగ్యం కోసం తన చెలిమి వాంఛించాడో అంతా అర్థమయింది.

అయ్యో మకరందాల నూరిస్తూ వూగే గులాబి బాల చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్న మధుకరుని చూసి ముల్లు పొంగిపోయినట్టు, రాజా పైన తను ఆశలు పెంచుకుందేమిటి? తన వివేకమంతా ఏమ యింది? వ్యామోహం మనుష్యుల నింతటి మూఢు లను చెయ్యగలదా?

"కర్తవ్యం మీరే నిర్ణయించండి. మీ నిర్ణయం పట్ల నాకు చాలా గౌరవం" అని వ్రాసాడు రాజా.

ఏమనుకుంటాడు తన గురించి? ఆ ఉత్తరం తను చదవలేదని అతని కెలా తెలుస్తుంది?

ఆ ఉత్తరం మడిచి దాచుకుంది.

తల్లి వంక జాలిగా చూసి ఒక్కసారి పాదాలకు నమస్కారం చేసింది. ఎన్నడూ లేనిది నీరజ ఇలా ప్రవర్తించేసరికి జాహ్నవికి సంతోషమూ, సంభ్ర మమూ ఒక్కసారి క్రమ్ముకున్నాయి.

"ఇదేమిటి నీరజా."

"నా కోసం ఇంత శ్రమ పడ్డావు కదమ్మా! అందుకని నమస్కరిస్తున్నాను. కరువు తీరా నన్ను చూసుకో. మనసారా ఆశీర్వదించు."

"కలకాలం దీర్ఘ సుమంగళివై పుత్రపౌత్రులతో వర్ధిల్లు."

ఫకాలున నవ్వింది నీరజ.

"నవ్వుతా వెందుకు నీరజా."

"నీ ఆనందం చూస్తుంటే నవ్వొచ్చిందమ్మా"

"అదిసరే. నీ భర్త దరిదాపులకు కూడా మనో రమను రానియ్యవు కదూ."

"వూహూ. రానియ్యను నా భర్తగారి కూడా మనో రమకు పోకనియ్యను. నిశ్చింతగా ఉండు."

తృప్తిగా నిట్టూర్చింది జాహ్నవి.

# స్నేహానుబంధం కిసాన్ స్క్వాష్‌తో




కిసాన్ స్క్వాష్ ఆధునాతన జీవిత నిర్మాతల అపూర్వ కల్పన! ఆహా! ఏం రుచి! ఉల్లాసవంతమైన విచ్చేలలకు దీని ప్రత్యేకమైన రుచి ఉత్తేజాన్ని కలిగిస్తుంది సహజమైన విటమినులతో ఆరోగ్య దాయకంగా ఉంటుంది. నారింజ నిమ్మ, మామిడి ఇంకా ఇతర రకాలనుండి మీకిష్టమైన దానిని వాడండి

భారతదేశంలో విస్తారంగా అమ్ముడుపోయే కిసాన్ స్క్వాష్ లలో అసలు పళ్ళరుచిని అనుభవిస్తారు.

**కిసాన్ ప్రోడక్ట్స్ లిమిటెడ్ బెంగళూరు**

కిసాన్ స్క్వాష్ బ్రిటానియా క్లబ్ స్నాక్స్‌తోను, లీక్‌వెల్ జాంతోను ఎంతో రుచి!

# జాహ్నవీ హైమవతులు

కొంతమంది జమీందారీ వివాహాలు విచిత్రంగా ఉంటాయి. వివాహ మంటపానికి కూడా పెళ్ళికూతురు ఘోషాగానే వస్తుంది. దాసీలు నాలుగు వేపులా తెరలు పట్టుకుంటారు. లోపల పెళ్ళికూతురును మరొక దాసీ నడిపించుకొస్తుంది. మంగళసూత్రధారణ జరిగాకే, పెళ్ళికూతురు వరుడి కంటికి కనిపిస్తుంది.

రామరాను మరీ ఇంత చాదస్తంగా జరగకపోయినా, ఇటు ఉమాపతి తల్లికీ, అటు రాధాయమ్మకూ కూడా పూర్వసంప్రదాయమే ఇష్టం కావటం వల్ల ఆ ఆచారం ప్రకారమే వివాహం నిర్ణయమయింది.

పెళ్ళికుమార్తెను తీసుకురావలసిందని పురోహితుల దగ్గిర నుండి కబురొచ్చింది.

"నువ్వు నా పక్కనే ఉండు మనో. దాసిని పొమ్మన్నాను." అంది నీరజ.

జాహ్నవి ముఖం ముటముట లాడింది.

"మనోరమ దేనికి? దాసి ఉంటుంది. దాసీదే ఉండాలి" అంది కలిపించుకొని.

"అవునక్కా. నేనెందుకు?"

"ఏం? నా ప్రక్కన కూర్చోవటం చిన్నతనంగా ఉంటుందా?"

"ఛ. ఛ. అదికాదు."

"మన కులాల్లో స్త్రీలకిది చిన్నతనమే! కనీ, నేను అడుగుతున్నాను."

"అలాగే నక్కా!" అనేసింది మనోరమ. మనోరమ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. రాజా నీరజ కంఠాన మంగళసూత్రాలు కడుతూంటే తను ప్రక్కనుండాలి.

"భగవంతుడా! ఎందుకు నా మనసునిలా ఒరపిడి పెడుతున్నావు?" నిశ్శబ్దంగా దుఃఖించింది మనోరమ.

వడలిపోయిన మనోరమ ముఖాన్నిచూసి అల్లరిగా నవ్వింది నీరజ.

"నన్ను వదిలి ఉండాలని బాధ పడుతున్నావా?"

"అవునక్కా!"

"రేపు నీకు పెళ్ళయితే. నువ్వు మాత్రం వెళ్ళవూ?"

"నేనసలు పెళ్ళి చేసుకోను."

"అబద్ధం."

"ముమ్మాటికీ నిజం. ఈ జన్మలో నేనింక పెళ్ళి చేసుకోను."

"సరే! నీ భర్తతో నువ్వు కలకలలాడుతూ కబుర్లు చెపుతున్నపుడు వచ్చి ఈ విషయం గుర్తు చేస్తాను. కనీ, ఆనాటికి నీకీ అభాగ్యురాలు నీరజక్క గుర్తుంటుందో, ఉండదో?"

మనోరమ ఏదో అనబోయే లోగానే మళ్ళీ కబురొచ్చింది. దాసీలు తెరలు పట్టుకున్నారు. తెరల మధ్య నీరజా మనోరమలు నడిచి వివాహమంటపం చేరుకున్నారు. పురోహితుడు మంత్రాలతో అందించిన మాంగల్యాలను చేతులతో పట్టుకొని చేతులు తెరలోకి పోనిచ్చి నీరజ మెడలపై వేసాడు రాజా.

చేతులపై తన చేతులుంచింది నీరజ. ముడి వేయబోయిన రాజా ఆగిపోయాడు. అతనికి నీరజ ప్రక్కన మనోరమ ఉందని తెలియదు. అలా ఉండటం ఆచారం కాదు. తాను నీరజ మెడపై బదులు దాసీ మెడపై చేతులు వేసాడేమో, అందుకని దాసీది వారించిందేమో అనుకున్నాడు.

కొన్నిక్షణాలా చేతులను పట్టుకొని అలాగే ఉండిపోయింది నీరజ. రాజా కేం చెయ్యాలో తోచలేదు. తరువాత నెమ్మదిగా రాజా చేతులను మనోరమ మెడపై ఉంచింది. రాజా త్వరగా ముళ్ళు వేసేసాడు తలవంచుకుని కూర్చున్న మనోరమ ఉలికి పడి రాజా చేతులు తొలగించబోతే మనోరమ చేతులు గట్టిగా పట్టుకొని "హుష్" అంది నీరజ. శాసించటం నీరజకూ, శాసింపబడటం మనోరమకూ బాగా అలవాటే!

మాంగల్యధారణ పూర్తయింది. దాసీలు తెర తొలగించారు.

ఒక్కసారి గాలి ఆడటం ఆగిపోయింది. జాహ్నవి కెవ్వున కేక వేసి విరుచుకు పడిపోయింది. మనోరమ తల భూమిలోకి దిగిపోయింది.

రాజా కళ్ళు నులుముకుని చూసాడు.

హైమ చేష్టలు దక్కి నిలుచుండిపోయింది. రాధాయమ్మ పొంగిపోయింది.

నీరజ రాజా వంక ప్రసన్నంగా చూసి చిరునవ్వు నవ్వింది.

మిగిలిన తంతు యథావిధిగా పూర్తయింది. మనసులలో ఎవరెవరేమనుకున్నారో, అక్కడున్న జమిందారీ స్త్రీ లెవరూ పెదవి కదిపి ఒక్కమాట అనలేదు. ఆ సమాజం కట్టు అలాంటిది.

వివాహం పూర్తి కాగానే నీరజ హడావుడిగా తల్లి దగ్గిర కొచ్చింది.

అప్పటికే హైమా ఉమాపతులూ ఒక డాక్టరూ అక్కడున్నారు. నీరజ "అమ్మా" అన్న పిలుపు విని. కళ్ళు తెరిచింది జాహ్నవి. ఆ కళ్ళలో నుండి అశ్రువుల ధారలు కట్టాయి. ఒక్క మాంగల్యం తప్ప మిగిలిన అలంకరణ అన్నీ ఉన్న కూతురును చూడలేక కళ్ళు మూసుకుని "పూర్తిగా ఓడిపోయాను." అంది.

హైమ నీరజను చూస్తూ "ఇలా చేసావేమిటమ్మా?" అంది.

"ఆదికవి మహర్షి వాల్మీకి ఎంతటి క్రాంతదర్శి పెద్దమ్మా! ఆ ఆదికావ్యం ఇప్పటికీ పునఃపునః వేరు వేరు రూపాలలో మన అనుభవాల్లోకి వస్తూనే ఉంది. ఆనాడు కైక పగర్వంగా భరతుడికి తాను రాజ్యం సంపాదించి పెట్టానని చెప్పింది.

పాపం, మా అమ్మ కూడా నాకు మనో నుండి లాక్కుని రాజాను సంపాదించి పెట్టానని చెప్పేసింది. ఇంక నా చేతుల్లో ఏముంది పెద్దమ్మా? విషయం తెలిసాక, నా మీద మనసు లేని రాజాను, మనో మనసు పడిన రాజాను, ఎలా చేసుకుంటాను నేను? మనసు లేని కాపురం ఎంతటి నరకమో నాకు తెలియదా? ఈ విషయం అమ్మ కంటె ఎవరికెక్కువ తెలుస్తుంది? అయినా నా మీది వ్యామోహంతో ఏదీ ఆలోచించ లేకపోయింది."

జాహ్నవి కళ్ళు విప్పార్చుకుని నీరజను చూసింది.

"అవును— నరకం— నాకు తెలుసు— మర్చిపోయాను—ఆలోచించలేదు. అవును. ఆలోచించలేదు."

జాహ్నవి స్వరం నీరసిపోతూంది. అందరికీ గాభరాగానే ఉంది. ఇటీవల నీరజ పెళ్ళి ప్రయత్నంలో తన ఆరోగ్యాన్ని లెక్క చెయ్యకుండా తిరిగి గుండె నొప్పి ఎక్కువ చేసుకుంది. అందులో ఇప్పుడీ దెబ్బ సామాన్యమైనది కాదు.

జాహ్నవికి తెలివి వస్తూ పోతూ ఉంది. తెలివి వచ్చింది. హైమ వంక తిరిగి రెండు చేతులూ జోడించింది.

"నన్ను క్షమించక్కయ్యా!"

హైమకు కళ్ళ నీళ్ళ మధ్య గొంతు పూడిపోయింది. జాహ్నవి చేతులు పట్టుకొని "ఏనాడో నీ మూర్ఖత్వాన్ని క్షమించేసాను. జాహ్నవీ, ఆ ప్రసక్తి లేదు" అంది.

"ఒక్కమాట చెప్పనా? ఏనాటికీ బావ మీద అసలు నాకు ప్రేమలేదు."

హైమ నవ్వింది.

"నాకు తెలుసు ఆ సంగతి. అందుకే నీ మీద నాకు జాలి తప్ప ఈర్ష్య లేదు."

"నేను నిన్ను హింసించాను అక్కా! కానీ, నన్ను నేను హింసించుకున్నంతగా కాదు."

హైమ కన్నీళ్ళు జాహ్నవి చెక్కిళ్ళను తడిపాయి.

"అదీ తెలుసు నాకు. ఈ లోకంలో ఏదీ నీకు శాంతి నివ్వలేదని తెలుసు. దరిలేని శాంతిలో కొట్టుకుపోతూ, నీ మీద నువ్వు కక్ష పెంచుకుని ద్వేషాన్ని నింపుకొని, మొత్తం సృష్టినే ద్వేషిస్తున్నావని తెలుసు. కానీ, నేనేం చెయ్యగలను? నీకు శాంతి నెలా ఇవ్వగలను?"

"బావా! నువ్వూ నన్ను క్షమించగలవా?"

దీనంగా ఉమాపతి వంక చూసింది జాహ్నవి.

"క్షమ ఎవరు ఎవరి నడగాలి జాహ్నవీ?"

కన్నీటితో మలినమయిన చేతో జాహ్నవి శిరసు నిమిరాడు ఉమాపతి.

ఏదో మాట్లాడబోయిన జాహ్నవి పెదవులు పలకలేదు. కళ్ళు మూసుకుపోయాయి. నీరజ చేతులలో ఉన్న చెయ్యి వాలిపోయింది. దుర్భరమైన అశాంతిలో నుండి శాశ్వత శాంతిలోకి జారిపోయింది జాహ్నవి.

(అయిపోయింది) ●





వైజ్ఞానిక గాథావళి-95

# వెల్తురు అంటే

-: మేక్స్‌వెల్ :-

- డ్వేర్...

ఒక ఇనుపసూదిని అయస్కాంతంగా చేసి, దారముతో వ్రేలాడతీసి, దానికొనదగ్గరకు ఇంకొక అయస్కాంతపు కొనను తీసుకువస్తే, మొదటి ముల్లుకొన ఆకర్షణనో వికర్షణనో పొందుతుంది. అయస్కాంతపు కొన ముల్లుకొనకి కొంతదూరము ఉండగానే ముల్లుకొన కదలడము ప్రారంభిస్తుంది. అంటే అయస్కాంతము చుట్టూ దాని ప్రభావము విస్తరించి ఉన్నదన్నమాట. ఇప్పుడు ఒక లోహపు రింగును దారముతో వ్రేలాడతీసి, అయస్కాంతపు కొనను తొరింగుతో—రింగుకు తగలకుండా—ప్రవేశపెట్టితే, అయస్కాంతము కదులుతూవున్నంతసేపూ, రింగులో ఎంతో కొంత విద్యుత్ప్రవాహము ఆవిర్భవిస్తుంది. అయస్కాంతాన్ని కాక రింగును అయస్కాంతమువైపు కదిపినా ఆవిర్భవిస్తుంది ఈ విద్యుత్ప్రవాహము. అంటే ఏమన్నమాటా? అయస్కాంతక్షేత్రములో (విద్యుద్వాహకమైన) తీగను కదిపితే ఆ తీగలో విద్యుత్ప్రవాహము కలుగుతుందన్నమాట.

విద్యుత్ప్రవహించే తీగచుట్టూ (పొడగాగునీ) అయస్కాంతక్షేత్రముకూడా ఆవిర్భవిస్తుంది. ఆ తీగకు చేరువగా ఉన్న అయస్కాంతపు ముల్లు విద్యుత్ప్రవాహము వర్తిస్తున్నప్పుడు కదులుతుంది.

ఈ విద్యుత్—, అయస్కాంత—క్షేత్రముల పరస్పర ఆధార ప్రభావాన్ని పురస్కరించుకుని ఒక ఆలోచన చేద్దాము. పటములో విది లేడ ఫి..., గాజది. లోపల బయటా సీసపు కాగితాలు అతికి ఉన్నాయి, లోపల కాగితానికి 'క' బయటి కాగితానికి 'గ' అన్న లోహపు గుండ్లు కలిపిఉన్నవి. ఇప్పుడు 'క'కు తీవ్రమయిన విద్యుదావేశాన్ని ఇచ్చామనుకోండి. గాజుకడ్డితో 'గ'ను కొంచెముగా 'క'వైపు నొక్కితే, 'క' 'గ'ల నడుమనుండిన మెరుపు—వెనుకు అందాము—దాటుతుంది. ఈ మెరుపు 'క'నుంచి 'గ'కు దాటి ఆగిపోయినట్లుగా మామూలు దృష్టికి కనవస్తుంది. కని వాస్తవానికి గడియారపు లోలకపు బిళ్లవలె 'క' నుంచి 'గ'కి, మళ్లీ 'గ' నుంచి 'క'కి, అటూ ఇటూ గెంటులా గంతుతూ వుంటుంది; మనకు కనబడిన ఆకొద్దికాలంలోనే. అంటే 'క'కూ 'గ'కూ నడుమ విద్యుత్ప్రవాహము అట్నుంచి ఇటూ, ఇట్నుంచి అటూ ప్రవహిస్తుందన్నమాట. ఇప్పుడు ఇందాకా అన్న ఆలోచన చేద్దాము. 'క'నుండి 'గ'కు విద్యుత్ప్రవహించినప్పుడే ఆ దారి చుట్టూ అయస్కాంతిక క్షేత్రము ఏర్పడుతుంది. అలాగ వెంటే విద్యుత్క్రమంగా తగ్గడముతో ఇంకొక అయస్కాంతిక క్షేత్రము ఏర్పడుతుంది. ఈ రెండూ పరస్పర వ్యతిరేకములు. మెరుపు అట్నుంచి ఇటూ, ఇట్నుంచి అటూ గెంతడములో ఈ రెండో అయస్కాంతక్షేత్రము తీవ్రమై మొదటిదాన్ని పరిహరించి అంతా మిగులుతుంది. దీనివల్ల విద్యుత్ క్షేత్రమూ ఆవిర్భవించాలిగదా? ఈసన్నివేశ సౌందర్యాన్ని గణితముచే సాధించిన మేక్స్‌వెల్ అన్న స్కాచ్ మేధావము, "క గ, ల దారిలో వర్తిల్లే విద్యుత్ చెణుకుల (వల్ల జనించిన విద్యుత్ వక్షరాక్షేత్రాల) వల్ల అక్కడనుండి విద్యుత్ అయస్కాంత తరంగాలు పుట్టును" అని ప్రకటించాడు. "ఆ తరంగ ప్రసార వేగము వెల్తురుయొక్క వేగానికి సమానము" అని కూడా చెప్పేడు. అదితెప్పలవల్ల తేలిన భౌతిక ఫలితము. పెండ్లి అయితేగాని పిచ్చికుదరక, పిచ్చి కుదిరితేనేగాని పెండ్లికాక రెండంటినడుమా నలిగే వాడి సంక్షోభముతో మొత్తానికి పిచ్చిఎక్కువై పోయిన వాడి మనస్సులో ఆలోచనాతరంగాలు కట్టుతప్పి మనకు వినపడ్డట్టు, విద్యుత్ అయస్కాంతక్షేత్రాల పరస్పర ప్రభావాల పెరుగు తరుగుల సంక్షోభంతో విద్యుదయస్కాంత తరంగ ప్రసారము ఆవిర్భవించి అన్నివైపులకి వెల్తురు వేగముతో సెకనుకు 186000 మైళ్ల చొప్పున— ప్రసరిస్తుందని మేక్స్‌వెల్ కనిపెట్టాడు.

అంతవరకూ విద్యుదయస్కాంత శక్తులు ఒక తీగనుంచి ఒక అయస్కాంతమునుంచీ పక్కనున్న తీగకు వ్యాపిస్తాయని యాంపియరు ఫారడేలూ— అయస్కాంత క్షేత్రప్రభావముతో ఉన్న— గాజు నీరు వంటి కాంతి ప్రవేశక పదార్థాలలో చొచ్చుకు పోయే వెల్తురు, ప్రక్క తిరిగినట్లు కొంత తిరుగుతుందని కెర్ర్ విజ్ఞానీ కనిపెట్టేరు. వెలుగు విద్యుదయస్కాంత ప్రభావాలూ ఒక చోటనుంచీ ఇంకొక చోటికి ప్రయాణిస్తాయా, వెలుగు సెకను'కి— 186000 మైళ్ల వేగంతో ప్రయాణిస్తుంది. మెక్స్‌వెల్ 'విద్యుదయస్కాంతతరంగాలు వెల్తురు వేగంతో ప్రయాణిస్తాయి అని చెప్పడముతో ఇవీ వెల్తురూ ఒకలాటివే అనీ వెల్తురంటే విద్యుదయస్కాంతికతరంగాలే అనీ తేలిపోయింది.

న్యూటను గురుత్వాకర్షణ సిద్ధాంతమువల్ల కలిగిన వైజ్ఞానిక కలవరాన్నిమించి పోయింది మేక్స్‌వెల్ విద్యుదయస్కాంత తరంగవాదమువల్ల కలిగిన కలవరము. విద్యుత్తూ, అయస్కాంత మత్త్వమూ, కాంతి కలిసిన ముయ్యేలగుట్ట అయింది ఆ వాదము. దాని తర్వాత అయిన్‌స్టీన్ సాపేక్షతావాదమేగనివచ్చి ఉండకపోతే, గణితము సాధించిన అత్యుత్కృష్ట భౌతిక ఫలము ఇదేఅయి వుండును. అయితే అలాంటి తరంగాలు ఉన్నాయని చూపించడము కర్తవ్యంగానే మిగిలిపోయింది.






తెల్లవారి.

మఠం ముందు భక్తులు చేరుతున్నారు. సమాధిలో వున్న స్వామీజీ దర్శనం కోసం.

"ఇంతలో యెవరో స్వామీజీ వెళ్లిపోయినా'' అన్నారు.

"అయ్యో! స్వామీజీ వెళ్లిపోవటమేమిటి? పదిహేను రోజుల నుండి సమాధిలో వున్నాయన యెలా వెళ్లిపోతారు?''

ఎలా వెళ్లారో యెవరికీ తెలీదు. తెల్లవారేటప్పటికి అదృశ్యమైనారు.

మఠం వాకిట్లో పడుకొన్న మారికిగాని ముందు గదిలో పడుకొన్న విద్యార్థులకుగాని యేమీ తెలీదు. గదులకు వేసిన తలుపులు వేసినట్లే వున్నయి. స్వామీజీ మాత్రం లేరు.

శిష్యులు గజగజ లాడిపోయారు. ఏ మహాచారం జరిగిందో యేమోనని. కళ్ల నీరెట్టుకొన్నారు కొందరు. గుండెలు బాదుకొన్నారు కొందరు. తమ దురదృష్టమని వాదించుకొన్నారు మిగతావాళ్లు. ఉత్సవం పరగా వచ్చే భక్తులు అంతా అలా నిర్ఘాంత పడి నిలబడిపోయున్నారు.

స్వామి వెళ్లటం తాత్కాలికంగానా లేక మఠం మీద గాని శిష్యుల మీద గాని కృప తప్పి వెళ్లిపోయినారా అన్నది అందరికీ సమస్యగానే వుంది.

ఇక పీఠాధిపత్యాన్ని పొందేందుకు ఆయన ముందుంటే [illegible] క్లిష్టతరమైన ప్రశ్న.

అది శ్రీ శంకరాచార్య మఠం.

స్వామీజీ దివ్యవర్చస్వి. శ్రీరామచంద్రమూర్తిని ధ్యానించాలంటే ఆయన్ని జ్ఞాపకం చేసికొంటే మనసు త్వరగా అనుసంధానమవుతుంది. తెల్లవారు జామున బావి దగ్గర స్నానంచేసి ధ్యానానికి గదిలో తిరిగి వచ్చేటప్పుడు స్వామి శ్రీరామచంద్రమూర్తి అవతారాన్ని యిదమిత్థమని దర్శింపజేస్తున్నారా అనిపించేది శిష్యులకు.

ఆయన ధ్యానంలో వుండగానే శిష్యులు వచ్చి దూరంగా నమస్కరించి ఎదుట కూర్చునేవారు. ఉపనిషత్పఠనం ఓంకారంతో ఆరంభమయ్యే దాకా. స్వామిజీ ఓంకార ముచ్చరించగానే శిష్యులు శ్రుతి కలిపి, శరీరాన్ని విరిచి, శబ్దతరంగాల్లో మునిగి పోయేవారు. తరువాత స్వామి ఉపనిషత్ శ్లోకాన్ని శ్రావ్యంగా గానంచేసి, వివరణం చెప్పేవారు. ఎనిమిది గంటలకు ఉపనిషత్పాఠం ఓంకారంతో ముగించగనే శిష్యులు స్వామిని తాకి నమస్కారాలు చేసినా అంతా వెళ్లిపోవలసిందే.

అంతరంగికులైన ప్రసాదరాయుడు, రామకోటి గార్లు కొంతసేపు నిలిచి మఠ విషయాలు ఆయనతో చెప్పటం కద్దు. వేదాధ్యయన మెలా జరుగుతోందన్న విషయం, వంట బ్రాహ్మణుడు సన్యాసం పుచ్చుకొంటానంటున్న వయినం యింకా మఠం ఆదాయవ్యయాలూ ఇవి చెప్పేది ఆనవాయితీ.

ఇవిగాక లౌకిక పూర్వమైన సంభాషణం ఎన్నడూ ఆ పరిసరాల్లో వినపడేవి కావు.

ఈ మఠం ముందు ఇవాళ తండోప తండాలై స్వామిజీ సమాధిలో వున్నారని నమస్కరించి వెళ్లుదామనీ వచ్చిన వారంతా దిగాలుపడి వెళ్లిపోతున్నారు.

స్వామిజీని ఏడుగడగా పెట్టుకొని శిష్యులు ఎన్నో నిబంధనలని ఆచారాలనీ ఆశ్రమంలో అమలు పెట్టుతూ వుండేవారు. వచ్చేవాళ్లు ఒక దోవ నుంచీ వెళ్లేవాళ్లు మరొక దోవనుంచీ నడిచేటట్లు చేస్తూ వుండేవాళ్లు. ఇవాళ ఏదేమీ లేదు.

ఎంతసేపు నిలుచున్నా క్రొత్త సమాచారం అందటల్లేదు. నిలుచోని నిలుచోని వచ్చిన జనం తిరుగుముఖం పట్టుతున్నారు.

మఠ పరిసరం దాటంగానే జనులు స్వామీజీ వెళ్లిపోవటానికి గల కారణాలను చర్చించటం ఆరంభించారు. తమకేమీ తెలియకపోయినా తెలిసిందన్న చైతన్యాన్ని విదితం చేసికొంటూ వుంటారు సామాన్య జనం. ఎందుకంటే వాళ్లు చిత్తశుద్ధి కలిగినట్టి ప్రసన్న చేతసులు కాకపోటంచేత,

''ఎందుకు వెళ్లి వుంటారబ్బా!.. ఇక్కడేం కష్టమొచ్చిందీయనకు?...చక్కగా విద్యార్థులు పరిచర్యలు చేస్తుంటే సుఖంగా వుండక?''

''అసలు యీ విద్య యెలాంటిదోలే!.. ఆవిడకు గర్భసుటగా?''

''రామరామ సన్యాసేనా?''

అన్నీన్నీ. కాదుకాదు. అవకాశం. ఎవరో శిష్యుడు పుణ్యం కట్టుకొని వుంటాడు. అందుకే స్వామి తీసేసి వుంటాడు. లేకపోతే యింత మఠం యింత ఆస్తి యింత హంగు యింతమంది శిష్యులు సత్కాలక్షేపం, అన్నీవదలి ఎందుకు వెళతారయ్యా!''

ఇంతలో నవ్వులు. ఆ నవ్వుల్లో యేదో మురర్థం—

''అయ్యా! శిష్యుల మీదయితే యేదో అభాండం విసిరావుగాని, అసలు స్వామీజీ వుండగా శిష్యుల కలాంటి అవకాశం ఎలా కలుగుతుందయ్యా?''

ధరా చక్రానికి ఆధారమైన ధర్మమే నవ్వుల పాలయే సమయం తొంగి చూసిందనిపించింది. అది గమనించిన శిష్యుల నేత్రాలు ప్రసాదుల్లై పారినయి.

''విషయం బయటపడి ప్రసాదరాయుడు లాటి వాళ్ళు కర్రలుచ్చుకొని వెంటబడతారని చెప్ప కుండా దోవ చూసుకొన్నాడు స్వామీజీ.''

''ఎక్కడికి పోతుంటాడు?''

''ఏ కాశీకో టూరు ప్రోగ్రాం వేసికొని వెళ్ళి వుంటాడు.''

ఇలా అనుకొంటూ జనం వెళ్ళిపోయారు. అంత రంగికులైన శిష్యులు మాత్రం మఠసదనం ముందు మిగిలారు. అంతా చెంపలు చేతుల్లో వుంచుకొని విచిపోయి వున్నారు దిగాలబడి.

గంభీరంగా వింటూ వున్నవాడు ప్రసాదరాయుడు ఒక్కడే.

ఈయనే యిన్నేళ్ళూ మఠ నిర్వహణాన్ని చూస్తున్నాడు. ఈయనకు సన్యాసం యిప్పించ వలెనని ఉద్దేశ్యం స్వామీజీయే ఒకటిరెండు సార్లు వెలిబుచ్చారట. మఠానికి సంబంధించిన భృత్యలోకం ప్రసాదరాయుడు గారిని చిన్నస్వామి అనికూడ అంటూ వుండేవాళ్ళు.

స్వామీజీ వెళ్ళిపోయారన్న తరువాత ఇక ''వేల'' యైన ప్రసాదరాయుడే మఠాధిపతి అని శిష్యుల మనసుల్లో స్ఫురించింది గాని ఆయనకు యింత వరకూ సన్యాసాశ్రమం యివ్వలేదే!—అనే సందేహం వెంటనే రావటంవల్ల యిది ఒక సమస్య అయింది.

నిజానికి శిష్యులంతా కూడ ప్రసాదరాయుడుగా రేసి చేయబోతారా యీ క్షణాన, అనేదే అలో చిస్తున్నారీ రోజు. పీఠాధిపతి యిక నెవరవుతారా అనే ప్రశ్నటుంచి యిప్పుడు మఠసరళి సడవాలిగదా.

రామకోటిగారు దగ్గరకు వచ్చి అడిగారు—

''ఈ యవాంతరమేమిటి రాయుడు గారూ! యిన్నాళ్ళూ సమాధిలో వుండటం యివాళ అదృశ్యం కావటం కారణం యెవరికీ తెలియకపోవటం ఇదంతా యేదైనా అపచారం వల్ల కలిగిన ఫలితమా?'' ఆయన కంఠం గద్గదికమయింది.

ప్రసాదరాయుడుగారు కొంచెం చికాకుపడ్డాడు. తను నిర్వహించే మఠంలో అపచారం ప్రసక్తా?

''ఇక. అపచార మేమిటి? మీరేమయినా చేశారా అపచారం?.. మరెందుకలా అంటారు? ఆయన ఎందుకు వెళ్ళిపోయారో మనకెలా తెలుస్తుంది?''

ఈ మాటలు కొంచెం కఠినంగనే వున్నయి.

''అదికాదు—మీరు ఆశ్రమం పుచ్చుకుంటారనీ ఆ తరువాత నేను కూడ ఆశ్రమ స్వీకారం చేద్దామనీ ఉద్దేశించాను. అలాగని స్వామిని మనం ప్రార్థించాం కూడ. వారి తోటి ధ్యానాన్ని ప్రసాదిస్తారని అను కొన్నాను. ఇంత విస్మయ ఎందుకు కలిగిందో మన మీద.''

రామకోటిగారి కళ్ళు చమర్చినయి. అవును మరి. మిత్రుడెవడో తనను అపార్థం చేసికొన్నాడన్నప్పుడే మనిషయినవాడు మనసులో యేడ్చిపోతాడు. ఏడు గడే నమ్ముకొన్న స్వామి వాత్సల్యాన్ని త్రెంచుకొని వెళ్ళి పోయారంటే ఏడవటానికి అబ్బురమేమిటి?

రాయుడు కఠినంగానే అన్నాడు— ''ఇప్పుడు మాత్రమేం ఆయన మళ్ళీ రారని మీకెవరయినా చెప్పారా?.. ఆయన యెవరితోనయినా చెప్పారా?''

రామకోటి గారన్నారు ''ఏమోమరి ఆయన వెళ్ళేటప్పుడు యెవరున్నారిక్కడ. విద్య యెక్కడో అవుటు హవుస్‌లో వుండి వుంటుంది.''

విద్య తలుపు ప్రక్కన వుండి వింటోంది యీ సంభాషణ. అందుకని శిష్యులిద్దరూ సార్థకంగా తలుపు వయిపు చూశారు.

విద్య అన్నది: తెల్లవారకముందే వాకిట్లో ముగ్గు వేద్దామని వచ్చి ఆయనకు నమస్కరించాలని చూశా నటు. ఆయన లేరు. సమాధి చాలించారే అను కొంటూ దిగ్భ్రమతో నాలుగువైపులా చూశాను. దండ కమండలాలూ లేవు. నాకు హృదయంలో అదురు పుట్టుకొచ్చి మీకు కబురంపాను మాటచేత.

విట్టార్చి రామకోటి గారన్నారు రాయుడు గారితో, ''ఇక తమరే బాధ్యత వహించి యికనేం చెయ్యాలో ఆలోచించాలి. ఇవాళ జనార్దనస్వామివారు కాశీ నుంచీ వస్తారని కబురు వచ్చింది గదా! ఎదురు వెళ్ళి తీసికొని రావాలో యేమో! ఏం చేయటానికీ తోచటల్లేదు.''

రాయుడుగారు ''వూఁ'' అన్నారు.

* * *

రాయుడు గారికి సన్యాసం యిప్పించకుండా స్వామిజీ వెళ్ళిపోవటానికి ఎవరు కారణం అనే సమ స్యకు కీలకం తెలియటల్లేదు. యెవరికీ కూడ. అంతా పూర్వం జరిగిన సంగతులు మనసుల్లో తిరగ వేస్తూనే వున్నారు.

విద్యాగరి విధవ. కన్యాశుల్కమనే అధర్మ కారణంగా ఆమె రోగగ్రస్తుడైన ఒక ముసలివానికి భార్యగా కట్టబడింది.. ఆ జరాభిరుడు ఆమె పుష్పవతి కాకముందే భార్య నింటికి తెచ్చుకొన్నాడు. ఐతే కాలవశాత్తు ఆరునెలలకే చనిపోయాడు. ఆ తరు వాత యెప్పుడో విద్యాగరి పుష్పవతి అయింది. ఆమె తిరిగి పుట్టింటికి వెళ్ళలేదు. భర్త వదలి వెళ్ళిన యింట్లో కొన్నాళ్ళు నివసించింది. తరువాత కొన్నాళ్ళు ఎవరో ఆదరించే బంధువుల యింట్లో వుండి అనుకూలంగ్గా మెలిగింది. అక్కడ భార్యా భర్తలకేమో స్పర్థలు రావటంతో ఆవూరు వదలి వచ్చింది.

రామకోటి గారికి ఆమె దూర బంధువు. ఈ వూళ్ళో యెక్కడయినా చాకిరీచేయటమో లేదా భిక్షం అడుక్కోటమో చేసి బ్రతకాలని వచ్చింది. అందుకని రామకోటిగారు రాయుడు గారితో సంప్ర తించారు ముందు. ఇద్దరూ కలిసి స్వామితో చెప్పారు.

ఆమెను వంటశాలకు అధికారిణిగా అనుగ్ర హించ వలసిందని కోరారు. వున్న వంటవాడు వెళ్ళిపోవటం చేత వంటశాలలో ఆమెను యేర్పాటు చేస్తే మఠం నడక కుంఠితం కాకుండా వుంటుందని చెప్పారు. ఆమెకు సన్మార్గం చూపిన వాళ్ళమవుతా మన్నారు.

స్వామీజీ మాట్లాడలేదు. అంటే స్వామీజీ సమ్మ తం శిష్యులకందలేదు. శిష్యులూ మాట్లాడలేదు.

ఒక క్రమానికి స్వామీజీయే అన్నారు:

''ఒకరి కోసం ఒకరు దోవ తయారు చేయ టానికెవరికీ హక్కులేదు. ఎవరికి వారు స్వయంగా దోవ చూసుకోవాలి. ఎవరి ఆధ్యాత్మికోన్నతి కోసం వారు పాటుపడాలి గాని యింకొకరు పాటుపడ్డా ప్రయోజనంలేదు. అని అలవోకగా నవ్వారు.

''మనం అందర్నీ ప్రేమించాలి అనంటే—అది మన వున్నతి కోసమే. 'ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియా భవతి' అనేది అందుకనే.'' స్వామీజీ మళ్ళీ నవ్వారు.

శిష్యులకు అన్వయం కాలేదు చెప్పిన విషయం. అందుకని స్వామీజీ మళ్ళీ అన్నారు:''

''ఆవిడ్ని మనం యిక్కడికి తెచ్చుకోవటం ఆవిడ మీది జాలితోనా లేక మన మఠం నడక కోసమా? మళ్ళీ నవ్వారు. ''ఆమె తన దోవ కోసరం ఏమేం చెయ్యాలో మనకక్కర్లేదు.''

అప్పటికి స్ఫురించింది రాయుడిగారికి..అన్నా డిలాగ: ''అవును. ఆమె మీది జాలితో కాదు ఆమె నిక్కడ చేర్చటం. వంట యింటి నిర్వహణకు ఆమె సహకార పాటవం అవసరం కనక ఆమెను యిక్కడ చేర్చవలెనని సంకల్పం.

స్వామీజీ కండ్లు మూసికొని, ''ఏం మగవాడెవరూ దొరకడూ?'' అన్నారు.

రాయుడు అన్నాడు. ''స్వామీ! అయితే..స్త్రీలకు.. మఠంలో స్థానం.. వద్దంటారా?

'అవును. స్త్రీని మఠంలో చేరిస్తే మనం ఆధ్యాత్మి కాని కేమీ భంగంరాదు. కాని సిద్ధి ప్రపంచం అనేక వూహాల్ని చేస్తుంది కించపరకాశమువేది దొరికతే. అలాటి పిశాచా విన్మయైన వూహలు అలా వూహించిన వాళ్ళకు దుష్ప్రారబ్ధాన్ని సంతరించి పెట్టుతయి. వాళ్ళ ఆధ్యాత్మికోన్నతికే అడ్డు వస్తయి. వాళ్ళని అధోగతికి దింపేస్తయి. చిత్త శుద్ధిని వాళ్ళకు కలుగనీయవు. మెళ్ళ చేతే వాళ్ళ రాలని యెవళ్ళ వూహే వాళ్ళ యిహమని మనం పాఠం చదువుకోవటల్లా?

'పదను మఠంలో ప్రవేశపెట్టటం చేత ప్రజల్ని గోతిలో దింపిన వాళ్ళ మవుతాము. వళ్ళాలా దిగితే మనకేమని మఠస్థులమైన మనం అనుకొనే అధికారం మనకులేదు. మనకు మనమే ప్రసన్న చేతసులుగ వుండటంగాక ప్రజలను కూడ ప్రసన్న చేతసులుగా చెయ్యాల్సిన వాళ్ళం మనం. అందుకే మఠాల్లో కొన్ని పధార్ని తప్పనిసరిగా అనుసరించాలి. మన అవసరానవసరాలతో నిమిత్తంలేదు.

రాయుడు గారికి రామకోటి గారికీ యేంచెప్పాలో తెలీలేదు. చివరకు రామకోటిగారన్నారు:

'జితేంద్రియులైన మీను ప్రభావం మిమ్మల్ని విలా ప్రకాశిస్తున్నంతసేపూ ప్రజలు మాత్రం తమని దురర్థంతో కళ్ళెత్తి చూడగలరా? విద్యా ధరికి యిక్కడనే ప్రవేశం లేకపోతే యింకెక్కడ స్థానం దొరుకుతుంది''?

# జలుబులను నివారించే మరో దివ్యమైన శక్తి




# అనోలియం

ఇతర ఔషధాలకంటె బహుధా ప్రయోజనకరమైనది.

శీఘ్రగతిన విముక్తి
(చర్మంలోకి వేగంగా ప్రవేశిస్తుంది.
బాధాకరం కాదు
ఎక్కువగా అంటదు.
మెత్తనిది
(పసిపిల్లల పలుచని మెత్తని చర్మానికికూడా
ఉపకరిస్తుంది.

అనోలియం ఎలా వాడాలి ?

1. గుండెమీద రాయటం
2. ముక్కుకు అటూ, ఇటూ రాయటం)
3. మెడమీద రాయటం
4. అనోలియంను వేడినీటిలో కరగించి) దాని ఆవిరి పీల్చటం.

**జలుబు చేసేవరకు ఆగకండి. నేడే అనోలియం కొనండి**

# చిన్న స్వామి

స్వామీజీ కండ్లు మూసికొని నారాయణ అన్నారు. అంటే అర్థం సరే మీ యిష్టం అన్నమాట.

ఆవిధంగా విద్య మఠ ప్రవేశం చేసింది.

ఆమె చేరిన తరవాత మఠసదన పరిసరాల నిర్వహణం యెంతో చాకచక్యంగా ఆమే నిర్వర్తించుతూ వుంది. స్వామికి స్వయంగా వంట ప్రత్యేకంగా చేస్తుంది. ఆయనకు వడ్డించి యువతులకు వడ్డిస్తుంది. స్వామి ఒక్కరూ నారాయణ స్మరణం చేస్తూ ఆరగించేవారు.

సాయంత్రం స్వామీజీ ఉపన్యాసం అయిన తరవాత విద్య పాలూపళ్లూ తెచ్చి స్వామీజీ సముఖాన వుంచి నమస్కరించి వెళ్లుతుంది. తరవాత విద్యార్థుల భోజనాలు. విద్య రాత్రులు భోజనం చేయదు. పళ్లు మాత్రం తీసికొంటుంది.

ఉదయం సాయంత్రం విద్య నమస్కరించినప్పుడు ఆమెకు వినపడేటట్లు స్వామీజీ నారాయణ స్మరణం చేయటం తప్ప విద్య స్వామీజీతో మాట్లాడడం అనేది వుండేదికాదు.

రాత్రులు హాలులో యెత్తుగా వున్న రాతి వేదిక మీద స్వామియోగాభ్యాసం చేస్తూ కన్నుమూస్తారు. ఎప్పుడు నిద్ర పోతారో మరి.

రాయుడుగారు వంటయింటి నిర్వహణకు యేం కావాలనే విషయం విద్యతో సంప్రదిస్తారు. రామకోటిగారు విద్య యోగక్షేమాలు అప్పుడప్పుడూ అడిగి తెలిసికొంటూ వుంటారు.

ఒకనాడు కాశీనుంచీ జనార్దనస్వామి వస్తారని కబురు వచ్చింది. ఆనాడు స్వయంగా విద్యను పిలిచి చేయవలసిన యేర్పాట్లేవో కొన్ని చెప్పారు. తరువాత రాయుడుగారు వచ్చి ఉత్తరం చదివి వినిపిస్తూ ఫలాని యేర్పాట్లు చేయాలన్నారు. విద్య తానది వరకే చేసిన యేర్పాట్లు చూపించింది. రాయుడుగారికి విస్మయం తోచింది. స్వామీజీ విద్యతో మాట్లాడాడన్న విషయం తెలిసి.

జనార్దనస్వామి అప్పట్లో వచ్చి నాల్గురోజులున్నారు. ఆయన ఉత్తరదేశస్థుడు కావటం చేత భోజన సదుపాయాల విషయంలో రాయుడుగారూ రామకోటిగారూ కూడ ఎక్కువ శ్రద్ధతో విద్యకు సహాయంగా వుండి మఠ నిర్వహణాన్ని భుజస్కంధాల మీద వడిసారు.

స్వామి ఆ తరువాత అన్నారు రాయుడూ విద్య వున్న సమయాన.. ''జనార్దనస్వామి వున్న నాలుగు రోజులా విద్య చాలా శ్రమపడింది. ఆమాట జనార్దనస్వామే అన్నారు'' అని అన్నారు. విద్య నమస్కరించి వూరుకొన్నది.

స్వామి వెళ్లిపోయినారు. పూలమొక్కలను చూస్తూ. రాయుడుగారు తనకు చేసిన సహాయానికి విద్య కృతజ్ఞత చెప్పి రాయుడుగారికి నమస్కరించింది.

''నాకెందుకూ నమస్కారం స్వామివారికి చెయ్యాలిగానీ '' అన్నాడు రాయుడు.

''ఆయన భగవంతుడు. ఎలాగయినా కరుణిస్తారు. మీలాంటి పెద్దలకే నమస్కారం చెయ్యాలి. నేను చిన్నదాన్నే కదా!'' అన్నది విద.

రాయుడుగారు మేజిస్ట్రేటు చేసి రిటయిరయినారు. నేను చిన్నదాన్ని కదా' అనే మాటకు ఆయన మనసు అదిరిపడింది. చిరునవ్వు నవ్వి ''నేను మాత్రం చిన్నవాణ్ణి కాదా యేం?'' అని ఛలోక్తి విసిరారు.

ఈ సమయానే స్వామీజీ తిరిగివస్తూ యీమాట విన్నారు. కాని యెరగనట్లూరుకొన్నారు. అలాంటి ఛలోక్తులీ ప్రదేశంలో అనరదని చెప్పలేదు. రాయుడు నాలుక కొరుక్కొన్నాడు, అలా ఛలోక్తి అనటం స్వామిజీ విన్నందుకు.

స్వామిజీ నారాయణ స్మరణం చేసికొంటూ, మొక్కలూ పూవులూ చూస్తూ పెరడు చుట్టూ తిరిగి లోపలకు వెళ్లిపోయినారు. వెళ్లటమే తడవు ధ్యానంలో కూర్చున్నారు. అప్పటికి మామూలుగా విశ్రాంతి తీసికొనే సమయం పూర్తికాలేదు. ఆధ్యానం ధ్యానం ఐదింటి దాకా పీట మీద పద్మాసనంలో వుండిపోయారు. ఐదింటికిగాని లేచి స్నానానికి వెళ్లలేదు.

దొడ్డిలో నుంచి వచ్చి రాయుడుగారు స్వామి ఎదుట నిలచారు, సెలవు తీసికొందామని. చాలసేపు కూర్చొని యిక లాభంలేదనీ యింటికి వెళ్లి స్నానం చేసి మళ్లీ ఉపన్యాసానికి రావాలి కదా అనీ వెళ్లిపోయాడు స్వామీజీ కళ్లు తెరువకముందే.

ఏదయినా అపచారం జరిగితే స్వామీజీ ధ్యానంలో కూర్చుంటారనే విషయం రాయుడికి తెలిసింది. ఆవిధంగా.

ఇప్పుడీ పదిహేనురోజుల్నుంచీ స్వామీజీ ధ్యానంలో కూర్చొని లేవటమనేదే లేని పరిస్థితి ఎందుకు కలిగిందీ అనే విషయాలు రాయుడు గారు ఆలోచిస్తూనే వున్నారు. అది ఎవరు చేసిన అపచారమో అర్థంకాక సతమతమవుతున్నాడు. ఈ ఆలోచనల్లో మనసుకు చిత్తశుద్ధి లేని కారణాన అనుమాన పిశాచాలతో మనసును ఆవిష్కం చేసి బాధపడుతున్నాడు రాయుడుగారు. ఆ చిత్తశుద్ధి అనేది కలగటానికి పాపం ఆయనకు భగవదనుగ్రహం ప్రాప్తించాలి. అందాకా అది కలగదు.

స్వామి సమాధిలో కూర్చోటానికి ముందు కొన్నిసంఘటనలు జరిగినయి.

విద్యకు యేదో అనారోగ్యం ప్రవేశించింది. శ్రమ చేయలేక పోతోంది. నడుం లావెక్కింది. ఒకనాడు స్వామీజీకి భోజనం వడ్డించి వస్తుంటే స్వామీజీ తేరిపార చూశారీమె వంక.

ఆనాటి సాయంత్రమే రాయుడుగారు విద్యను ప్రశ్నించాడు. విద్యార్థులెక్కడ పడుకొంటారనీ, మాలీ మఠంలోనే ఉంటున్నాడా లేదా అనీనూ. చివరకు రహస్యంగానూ, గంభీరంగానూ అన్నాడు ''స్వామీజీ పరమాత్ముడు. ఆయన నిష్ఠకేమీ భంగం వాటిల్లకుండా నీవుండాలి. సుమా'' అని. ఇలా చెప్పటం విద్య ముఖం జేవురించటం, హాలు వాకిట్లో నిలబడి స్వామీజీ చూశారు. రాయుడుగారు కాని విద్యకాని యీ సంగతి నెరగరు.

స్వామీజీ తన స్థలంలోకి వెళ్లి కూర్చున్నారు. 'విద్య ఏడ్చింది. ఆ యేడ్పు స్వామీజీకి కూడ వినపడింది. స్వామిజీ ఆలోచించారు— విద్యనేమని చీవాట్లు పెడుతున్నాడీరాయుడు?'' అని. ''నారాయణ'' అంటూ కణతలు పట్టుకొన్నాడు. రాయుడు లోపలకు వచ్చి స్వామికి నమస్కరించి వెళ్లిపోయాడు.

దొడ్లో విద్య డోక్కున్నది. స్వామిజీ విని అదిరిపడ్డారు. గబగబా దొడ్లోకి వెళ్లి వంటయింటిలో నుంచి మంచినీరు ముంచి తెచ్చి ఆమె కిచ్చారు. ఆమె నిర్ఘాంతపోయింది.

అంతే. స్వామీజీ నారాయణ స్మరణం చేస్తూ లోనికి వెళ్లి ధ్యానంలో కూర్చొన్నారు. ఆనాడు ఐదయినా ధ్యానం నుంచీ లేవలేదు. శిష్యులంతా వచ్చి కూర్చొన్నా ఆనాడు వోంకారం పలకలేదు. ఆనాడు ఉపన్యాసం లేదు. ఆ తరువాత కూడ లేవలేదు.

మరునాడుదయం తిరిగి శిష్యులు వచ్చేటప్పటికి కూడ స్వామి అలానే కూర్చొన్నారు. రాత్రి వుంచిన పండ్లు పాలూ అలానే వుండిపోయినయి.

ఇదంతా యిలా యెందుకు జరుగుతోందో యెవరికీ అర్థంకాలేదు. రాయుడుగారిని యెవ



# మీ అభిమాన నటుడు తన అభిమాన

## మర్ఫీ ట్రాన్సిస్టర్ తో

సినీ నటుడు ధర్మేంద్ర తన మర్ఫీ మోడెల్ 816 తో యింట్లో విశ్రాంతి తీసుకుంటాడు.
తన రంగంలో అత్యుత్తమంగా పనిచేసే మోడెల్ 816 కేవలం అత్యధిక
శ్రవణానందం కోసం డిజైన్ చెయ్యబడింది.

ఈ మోడెల్‌ను మీకు అతి సమీపంలోని మర్ఫీ డీలరు వద్ద యీ రోజే చూడండి.
ఎన్నుకోవడానికి మీకు ఎన్నో మర్ఫీ ట్రాన్సిస్టర్లున్నాయి కూడా।


మోడెల్ బి 0579


మోడెల్ బి 0581


మోడెల్ బి 0816


మోడెల్ బి 0509

## మర్ఫీ ట్రాన్సిస్టర్

*Murphy sets the standard*



క్షనా అడిగినా ఆయనకే తెలీక ఏదో వినుక్కొంటు న్నాడు. అంతకుపూర్వం స్వామిజీ విషయం అలా త్రోసి వేసేవాడు కాదు. ఆయన ముఖం ముటముట లాడటం ఆరంభించింది. కాబోయే మఠాధిపతి అని, స్వామిజీకి 'చేల' అని అనిపించుకొనటం చేత ఆయన ముఖం బాధ్యతల బరువును సూచిస్తోందా—ఏమో మరి.

పదిహేనురోజుల సమాధి తరవాత స్వామిజీ యివాళ అదృశ్యమై వెళ్లిపోయారు. కారణం యెవరికీ తెలీలేదు.

రాయుడుగారి అనుమానం యేమిటంటే విద్య లోకొచ్చటానికీ స్వామి సమాధిలో వుండి యిప్పుడు వెళ్లిపోవటానికీ సంబంధం వుండి వుంటుందీ అని. మామూలు మనుష్యుల కయిన ప్రమాణమే వేల్పు లయిన వారికి కూడ అన్వయించరాదని ఆయనకు తెలీదు. అలాటి వూహలు రావటం అతడి గ్రహ చారం.

ఆ వూహ మనసులోకి రాంగానే రాయుడుగారు, రామకోటి గారిని దగ్గరకు పిల్చి విద్య అనారోగ్య లక్షణాలూ తన అనుమానం రెండూ ఆయన చెవిని వేశారు. రామకోటి గారు కంపించిపోయారు. విద్యకు అనారోగ్యమంటే అది అనారోగ్యంగానే యెందుకు అర్థం చేసుకోవటల్లేదీ రాయుడుగారు: తెస్తా! విద్యను పిలిచి పలకరించాడు రామకోటిగారు.

జనార్దనస్వామి వారు వస్తారని రొట్టెలకు పిండి తడిపి పెట్టుతున్నది విద్య. రాయుడు గారికీ రామకోటి గారికీ కూడ హఠాత్తుగా 'స్వామి' సంగతి జ్ఞాపకానికి వచ్చింది.

రామకోటి గారన్నారు: "విద్య విషయం వదిలేసి, ముందు జనార్దనస్వామి వారి ఆహ్వానం విషయం చూడండి రాయుడుగారూ."

రాయుడు వెంటనే అందుకున్నాడు: "ఆయన వచ్చేలోపల యీ మనిషి నిక్కణ్ణుంచి పంపివేస్తేనే గాని శాంతి వుండదేమో."

"ఏమిటీ?... ఆవిడ్ని ఎక్కడకు పంపుతాం?"

"ఇంకెక్కడకు? మీ బంధువేగా. మీ యింటికే తీసికొనిపోయి పురుడు పొయ్యి. ఏంచేస్తావ్?"

"రాయుడు గారూ! విద్యను అనుమానిస్తున్నారు సరే,—మరి స్వామీజీని కూడ అనుమానిస్తున్నారా?"

"మరి యీ వెళ్లిపోవటానికి అర్థమేమిటి?"

రామకోటి తల తిరిగిపోతోంది. చాలా నిక్కచ్చిగనే అన్నాడు: "ఆయన వెళ్లిపోవటానికి అర్థమేమిటి? ఆయన యిందంతా తన స్వార్థానికి కావాలని యెప్పుడన్నా ఆశించారు కనక ఉండాలని యీ భవనపు చూరుపట్టుకొని వేళ్లాడు తార!.. మీరు ఆయన్ని అనుమానించిన క్షణాన మీచే నిగ్రహింపబడే యీ మఠంలో ఆయన ఒక్కక్షణం కూడ వుండరు... ఇంతవరకూ ఆయన వెళ్లిన కారణం తెలీక బాధపడుతున్నాను. ఇప్పుడు తెలిసిపోయింది. దీనికి కారణం మీకు కలిగిన అనుమాన పిశాచమేనని."

ఇంతలో ఒకాయన యేదో చీటీ తెచ్చి రాయుడు గారికిచ్చారు. దాని ప్రకారం జనార్దనస్వామి వూళ్లోకి వచ్చారుట. మఠసదనానికి రారుట. శ్రీయోలాల్ సత్రంలో వున్నారు. ప్రసాదరాయుడు గారు వచ్చి మాట్లాడవలసిందని వుంది దాంట్లో.

# చిన్న స్వామి

రాయుడు రామకోటిగారికి ఆ చీటీ చూపించి "జనార్దనస్వామి కూడ యిక్కడకు రారుట. ఆయన దివ్యదృష్టికి అప్పుడే అంతా అర్థమయి వుంటుంది. ఇప్పుడేమంటావు?" అన్నాడు. "నేనక్కడికి, భోజనం అయింతరవాత వెళ్తాను." అన్నాడు.

రామకోటిగారు లోపలికి వెళ్లి విద్యతో జనార్దన స్వామి మఠానికి రారనీ శ్రీయోలాల్ సత్రంలో వున్నారనీ చెప్పి ఆమె కళ్లలో కాంతి తరిగిపోయిందనీ, అది అనారోగ్య కారణమనీ సాయంత్రం డాక్టరు దగ్గరకు వెళ్లటానికి సిద్ధంగా వుండమనీ చెప్పి వెళ్లాడు.

ప్రసాదరాయుడు భోజనంచేసి శ్రీయోలాల్ ధర్మశాలకు వెళ్లేటప్పటికి రామకోటిగారక్కడే వున్నారు. స్వామిజీ దర్శనం చేసికొనటం కూడ అయింది. అయినా మళ్లీ యిద్దరూ కలిసి స్వామి దర్శనం చేసుకొన్నారు.

జనార్దనస్వామి అడిగారు: మీ స్వామిజీ కాశీ యాత్రకు వెళ్లారటగా! ఆయన రాత్రి నాల్గో యామంలో యీ పత్రానికి వచ్చారట. ఎవరినో నిద్రలేపి, జనార్దనస్వామి వస్తున్నారు. ఎదురు వెళ్లి తీసికొని వచ్చి యీ సత్రంలోనే బస చేయించవలసిందని చెప్పి కాశీ యాత్రకు వెళ్లిపోయారట. అతను నిద్రలేచి చూసేటప్పటికి స్వామిజీ వెళ్లిపోటం కూడ అయిపోయింది. ఈ శ్రీయోలాల్ ఆ సంగతి తెలిసికొని వచ్చి యిక్కడకు తీసికొని వచ్చారు.

రాయుడు గారన్నారు: "స్వామిజీ కాశీయాత్ర విషయం మావాళ్లకీ తెలీదు స్వామీ. మరి వారెంతకు యింత అన్యాయం చేశారో మమ్మల్ని!"

"ఆయన వెళ్లాలని వెళ్లితే మీకు చెప్పవలసిన అవసరమేముంది? మీరంతా కూడ బయలుదేరి వెంట బడతారనేమో"

'అయ్యో వెంటపడితే మాత్రం ఆయన సుఖం కోసరమే. మేం ప్రాకులాడుతాము గాని,—ఆ పెటుత్వాన్ని ఆశించేవాళ్లం.."

జనార్దనస్వామి పెద్దగా నవ్వారు. "ఆయని కోసరం మీరు ప్రాకులాడడ మేమిటయ్యా!" అన్నారు.

రామకోటిగారు సెలవు తీసికొని వెళ్లిపోయారు.

రాయుడుగారు మాటల సందర్భంలో, విద్యకు రెండుమూడు నెలల నుంచీ అనారోగ్యంగ వుందనీ శోకులనీ ఏదోఅనుమానాస్పదంగా వుందనీచెప్పాడు.

స్వామి రాయుడి వంక క్షణం చూసి చిరునవ్వు




నవ్వి ఊరుకొని—"డాక్టరుకు చూపెట్టవలసినట్లు అలా పిశాచాల దగ్గరకు రావిస్తారా! తీవర వ్యథయి వుంటుంది" అన్నారు.

ఆయన చేతి సర్పతో రాయుడుగారికి యేదో మనసుతో జ్యోతి వెలిగినట్లుంది. వెంటనే స్వామిజీని తలచి భగవంతుడ్ని స్మరించి నమస్కరించారు మనసులో. అది నిజంగా వట్టి తీవరు వ్యాధి మాత్రమే కావాలని మనసార ప్రార్థించారు. తన తప్పిదానికి నాలుక కొరుక్కున్నారు. కాని ఆమెను డక్టరుకు చూపించాలి ముందర. స్వామి దగ్గర సెలవు తీసికొని మఠానికి బయలుదేరారు.

మఠం చేరింతరవాత తెలిసింది రామకోటిగారు విద్యను అప్పుడే డాక్టరు దగ్గరకు తీసికొని వెళ్లారని.

రాయుడి మనసు జనార్దనస్వామి అనుగ్రహం వల్ల ఆర్ద్రం కావటం ఆరంభించింది. రామకోటి పాటి చిత్తశుద్ధి తనకు లేదన్న విషయం అతడికి క్రొత్తగా తెలిసిన విషయం. తన మనసు పట్టి బురద గుంటలో దొర్లిస్తున్నది యిన్నాళ్లనన్నా. రామకోటిగారు తనకంటె కొన్ని రెట్లు శుద్ధ సత్త్వుడు.

తను మఠాధిపత్యం పొందవచ్చుననే వూహ వట్టి పాపష్ఠు టాళలాటది అనిపించింది. ఆ వూహతోనే బహుశ తన మన స్థితి అనుమానానికి తావిచ్చిందేమో. అరుగు మీద కూర్చొని కళ్లు మూశారు రాయుడుగారు.

రామకోటిగారూ విద్య తిరిగి వచ్చారు మఠానికి. చేతుల్లో మందుల సీసాలున్నాయి. ఆమెకు కడుపులో బల్ల పెరిగిందని డాక్టరు చెప్పాడుట. ఈ అనారోగ్యం ఆవిడకు వుందన్న సంగతి తెలిసిన రామకోటిగారి ముఖం ఎంత సంతోషాన్ని వెలిబుచ్చుతోందో అది చెప్పటానికి వీల్లేదు. రాయుడు యీ విషయం తెలిసికొని అనూహ్యమైన శాంతి పొందాడు. విద్య లోపలకు వెళ్లింది.

రామకోటిగారన్నారు—"జనార్దనస్వామి తనకు సన్యాస మిప్పిస్తానని అన్నారనీ స్వామిజీ అనుమతి రాలేదని తనే సందేహించాడనీ, అందుకు స్వామి, స్వామిజీ అనుమతికేం అది మూడురోజుల్లో రాదా" అని అన్నారనీ చెప్పాడు. ఆ సందర్భంలో రామకోటిగారు స్వామిజీ అనుమతి అదివరకే యిచ్చారు కనక రాయుడుగారికి సన్యాసాశ్రమం యిప్పించవచ్చని చెప్పారట కూడను. జనార్దనస్వామి మాట్లాడలేదట. మళ్లీ అడిగితే స్వామిజీ అనుమతి రానీ అన్నారుట.

రాయుడి హృదయం యిది విని పశ్చాత్తాప పరిపూరితమయింది. రామకోటిగారి కాళ్లకు నమస్కరించి కళ్లు కద్దుకొన్నాడు.

మూడురోజులకు స్వామీజీ నుంచి జనార్దన స్వామికి ఉత్తరం వచ్చింది. రాయుడుగారికీ, రామకోటి గారికీ యిద్దరికీ ఆశ్రమం యిప్పించవలసిందనీ ఒకరు మఠాన్ని కనిపెట్టుకుని వుంటే రెండవవారు కాశీయాత్ర చేయవలసిందనీ వ్రాశారు.

ఆశ్రమం యివ్వటం జరిగిన నాటిరాత్రి నాల్గో యామాన ఒక స్వామి కాశీ వెళ్లిపోవటం ఎవరికీ తెలీదు. మిగిలిన వారు పీఠాధిపతి అయినారు.

మఠంలోని భృత్యులు చిన్నస్వామి వెళ్లిపోయారా అని ఆశ్చర్యపోయారు.




(క) ఇద్దరు పరదేశులు గుర్రాలమీద స్వారీ చేస్తూ కొండదారుల వెంట పోతున్నారు. వారిలో చిన్నవాడు పెద్దవ్యక్తికి కొడుకు అవుతాడు. కాని, పెద్దమనిషి చిన్నవాడికి తండ్రికాడు. మరి వారిమధ్య బాంధవ్యం ఏమిటి?




(చ) అలమారులో రెండుబైండు పుస్తకాలు ఒకదాని పక్కన ఒకటి ఉన్నాయి. అవి హిందూదేశ చరిత్ర మొదటి భాగమూ, రెండో భాగమూనూ. వాటి అట్టలు







$\frac{1}{8}$ అంగుళం మందమూ, అట్టలేని పుస్తకాలు ఒక్కొక్కటి రెండు అంగుళాలమందమూ ఉన్నాయి.

చరిత్ర పుస్తకాలంటే ప్రత్యేకించి మోజుఉన్న చెదపురుగొకటి మొదటిభాగపు మొదటి పేజీ దగ్గర బయలుదేరి, దారి దొలుచుకుంటూ రెండవభాగం ఆఖరిపేజీ వరకూ వచ్చింది. ఆపురుగు మొత్తం ఎంతదూరం దొలుచుకుంటూ వెళ్ళింది?




(ట) "ఒక్కచీర ఆరడానికి గంటసేపుపడితే, రెండు చీరలు ఆరడానికి ఎంతసేపు పడుతుంది?" అనికొంటె తనానికి ప్రశ్నవేస్తే, "రెండుగంటలు పడుతుంది" అని పిల్లలు చటుక్కున సమాధానం ఇవ్వడమూ, పెద్దవాళ్ళు నవ్వుకోవడమూ మనకు తెలిసినదే. అలానన్నే పెద్దలకు ఈసమస్య ఇచ్చి చూడండి, ఏం సమాధానం చెప్తారో.

రెండురాగి బిందెలు— ఒకటి పెద్దదీ, మరొకటి చిన్నదీనూ—ఉన్నాయి. వాటినిండా మరుగుతున్న నీళ్ళుపోసి, మూతవేశారు. ఒక అరగంట పోయాక వచ్చిచూస్తే ఏబిందెలో నీళ్ళు ఎక్కువవేడిగా ఉంటాయి? (కారణం కూడా చెప్పాలి)




(త) గంటకు 10 మైళ్ళవేగంతో సైకిలు తొక్కితే సరిగ్గా మధ్యాహ్నం ఒంటిగంటకు ఒకడు అడుగు చేరగలడు. గంటకు 15 మైళ్ళ వేగంతో తొక్కితే ఉదయం 11గంటలకే చేరుకోగలడు. సరిగ్గా 12 గంటలకు చేరుకోగలగాలంటే ఎంత వేగంగా సైకిలు తొక్కాలి?

## జ వా బు లు

(క) వారిద్దరూ తల్లీ, కొడుకు కావచ్చునుగా.

(చ) చెదపురుగు దొలిచివేసిన దూరం $\frac{1}{4}$ అంగుళం మాత్రమే. నమ్మకం లేకపోతే బొమ్మ మరోసారి చూడండి జాగ్రత్తగా. మొదటిభాగం మొదటి పుటకీ, రెండవభాగం ఆఖరి పుటకీ మధ్యన రెండు అట్టలు మాత్రమే ఉన్నాయి. వాటి మొత్తం మందం $\frac{1}{8}+\frac{1}{8}=\frac{1}{4}$ అంగుళమేకదా.

(ట) రెండు బిందెలలోని నీళ్ళూ సమానమైన ఉష్ణోగ్రతలోనే ఉంటాయని మీ సమాధానమైతే, అది తప్పు. పెద్ద బిందెలోని నీళ్ళు ఎక్కువ వేడిగా ఉంటాయి. ఎందుచేతనో పరిశీలిద్దాం:

బిందెలు గుండ్రంగా బంతుల ఆకారంలో ఉన్నాయనుకుందాం మాటవరుసకి. (ఇల్లా అనుకోవడం మనలెక్కను సులభంగా అర్థంచేసుకోవడానికిమాత్రమేసుమా. బిందెలు ఏ ఆకారంలో ఉన్నా ఈతర్కం సరిపోతుంది) పెద్దబిందె వ్యాసార్థం చిన్నబిందెకి రెట్టింపు అనుకుందాం. వీటి ఉపరితల వైశాల్యములు 4:1 నిష్పత్తిలో ఉంటాయి. వాటి ఘనపరిమాణములు 8:1 నిష్పత్తిలో ఉంటాయి. ఘనపరిమాణం ఎక్కువ అయినదీకొద్దీ నీళ్ళు ఎక్కువపడతాయి, అంటే నిలువఉన్న ఉష్ణశక్తి ఎక్కువఅన్న మాట. బిందెకి అన్నివైపుల నుంచీ వేడిమీ బయటికి పోతూ ఉంటుంది. అంటే బిందెనుంచి బయటికి పోయే ఉష్ణశక్తి దాని ఉపరితల వైశాల్యాన్నిబట్టి ఉంటుంది. పెద్ద బిందెకి ఘనపరిమాణం 8, ఉపరితల వైశాల్యం 4. అంటే నిలువఉన్న వేడిమి 8 అయితే, నష్టపోయే వేడిమి 4. అదే చిన్నబిందెకు ఘనపరిమాణము 1, ఉపరితల వైశాల్యంకూడా 1. కనుక చిన్న బిందెలోని నీళ్ళు, పెద్ద బిందెలోని నీళ్ళకన్నా రెట్టింపు వేగంతో చల్లారి పోతాయి.

(త) 10 మైళ్ళకీ, 15 మైళ్ళకీ సరాసరి కట్టి, ప్రయాణం చేయవలసిన వేగం గంటకి $12\frac{1}{2}$ మైళ్ళు అని మీ సమాధానం అయితే పొరబడ్డారన్నమాటే.

ప్రయాణం చెయ్యవలసిన దూరం X మైళ్ళు అనుకో. వేగం 10 మైళ్ళు అయితే X/10 గంటలలో అడుగు చేరుకుంటాడు. అంటే గడియారంలో $13-\frac{x}{10}$ గంటలు అయినప్పుడు అతడు ఇంటి దగ్గర బయలుదేరి ఉండాలి.

15 మైళ్ళ వేగంతో ఇదేదూరం ప్రయాణం చెయ్యడానికి X/15 గంటలు పడుతుంది. అతడు $11-\frac{x}{15}$ గంటలవేళ ఇంట్లో బయలుదేరేడన్న మాట. బయలుదేరిన సమయం ఒకటే కనుక:

$$13-\frac{x}{10}=11-\frac{x}{15};$$

ఈసమీకరణాన్ని సాధిస్తే X=60 మైళ్ళు వస్తుంది. అతడు బయలుదేరినది ఉదయం 7 గంటలకి. సరిగ్గా 12 గంటలకు చేరుకోవాలంటే 5 గంటలసేపు ప్రయాణం చెయ్యాలి. కనుక 60÷5=12 మైళ్ళ వేగంతో సైకిలు తొక్కాలి. ●

సీరియల్

# రామశాస్త్రి

వి.ఎస్.సుక్తాంకర్

(జరిగిన కథ: మరాఠా సామ్రాజ్యం పేష్వా నారాయణరావ్‌ని రఘోబా (లేక దాదాసాహెబ్) హత్య చేయించి తను పేష్వా కాపోతాడు. అతని నేరానికి చంపాజీ, శ్యామాల సహాయం ద్వారా, రుజువు సంపాదించిన ప్రధానన్యాయమూర్తి రామ్‌శాస్త్రి నిండు సభలో నేరారోపణ చేస్తాడు. రుజువు ఉన్నది కబట్టి రఘోబా ఆరోపణని తోసి వెయ్యలేక ఇదంతా రాజనీతికి సంబంధించినదేనని, ప్రాయశ్చిత్తం ఏదయినా ఉంటే చేసుకుని పాప విముక్తి పొందటానికి సిద్ధంగా ఉన్నానని అంటాడు. రామ్‌శాస్త్రి అతని వైఖరిని ఆమోదించలేకపోతాడు. ప్రధానన్యాయమూర్తి పదవికి రాజీనామా ఇచ్చి వెళ్లిపోతాడు.)

## 13

వర్షం కుండపోతగా కురుస్తూ ఉంది. ఈదురు గాలికి ఆ పల్లెలోని ఇళ్లు నిలుస్తాయా అనే సందేహం కలిగేట్లుగా ఉంది. ఆ ఇళలో మరీ పేదగా కనిపిస్తూ ఉంది ఒక చిన్న మట్టి ఇల్లు. కప్పులోని చిరుగుల ద్వారా వాన నీరు లోపలికి ధారలుగా ప్రవహిస్తూ ఉంది. గృహవాసులూ ముగ్గురూ పూర్తిగా తడిసి పోయారు. వారు రామ్‌శాస్త్రి, అతని భార్య సీతాబాయి, అయిదేళ్ల కొడుకు గోపాల్. రఘోబా ఏలే రాజ్యంలోనే ఉండటానికి ఇష్టపడని రామ్‌శాస్త్రి రాజ్యం బయట ఉన్న ఈ కుగ్రామంలో తన నివాసం ఏర్పరచుకున్నాడు. ఇంతకన్నా మంచి ఇంట్లో ఉండే ఆర్థిక స్థోమత అతనికి లేదు.

ఉన్నట్లుండి వడగళ్లు పడటం మొదలుపెట్టాయి. విరిగిపోయిన కిటికీలలో నుంచీ, ఇంటి కప్పులోని చిరుగుల ద్వారా వడగళ్లు పెద్దపెద్ద చప్పుడు చేసుకుంటూ వచ్చి పడటంతో చిన్న పిల్లవాడయిన గోపాల్ భయపడిపోయాడు. తల్లికి అతుక్కుపోయి ఏడవటం ప్రారంభించాడు. సీతాబాయి అతన్ని ఓదార్చటానికి ప్రయత్నించింది. రామ్‌శాస్త్రి గోపాల్‌ని విడిపించి తన వళ్లో కూర్చోపెట్టుకున్నాడు.

"బాబూ గోపాల్, ఒక కథ చెప్తాను వింటావా? మంచి కథ, తెలుసా?" అంటూ సీతాబాయి వంక కూడా చూసి ఇలా చెప్పుకుపోయాడు.

"ఈ కథ నువ్వేకాదు మీ అమ్మ కూడా బాగుందంటుంది చూసుకో. ఇదొక వెర్రిబ్రాహ్మడి కథ... ఈబ్రాహ్మడు ఒక పెద్ద వూళ్లో ఒక పెద్ద ఇంట్లో ఉండేవాడు. అతనొక పెద్ద అధికారి. అందరూ అతన్ని 'ప్రధానన్యాయమూర్తి' అనేవారు.. వూళ్లో వాళ్లందరు అతనికి వంగి దణ్ణం పెట్టేవారు. తనూ, భార్యా, చిన్నకొడుకూ ముగ్గురికీ చాలినంత భోజనం, బట్టలూ దొరికేవి అతనికి. హాయిగా కాలం గడుపుతూ వచ్చాడు. కాని వట్టి పిచ్చివాడేమో, పని కాస్తా వదులుకున్నాడు.

"పని వదులుకున్నాడా, అంతటితో వూరుకోకుండా వూరు కూడా వదులుకున్నాడు! పెద్ద వూరు వదిలి ఒక చిన్న పల్లెటూరికి వెళ్లిపోయాడు. ఆ పల్లెటూరిలో ఒక చిన్న పూరిగుడిసెలాంటి ఇల్లు తీసుకున్నాడు. అతని వూళ్లో ఇంత చిన్న ఇంట్లో ఉంటున్న సంగతి ఎవరికీ తెలీదు! అందుకోసమే అతని సంగతి ఎవరూ పట్టించుకోలేదు..

"అతమా, భార్యా చిన్న పిల్లవాడూ ముగ్గురూ తపుడు తినేవారు.—అంతకన్నా మంచి భోజనం వాళ్లకి దొరికేది కాదు. వాన కురిసినప్పుడు ఇల్లంతా నీళ్లే! వాళ్లెవళ్లకీ మంచిబట్టలు ఉండేవికావు. వాన కురిస్తే నానిన బట్టలతో ఉండి పోవల్సిందే! ఆ అబ్బాయి కష్టాలు చూసి పాపం వాళ్లమ్మ ఎంతో ఏడ్చేది. ఇవన్నీ అబ్బాయి నాన్న తీసుకువచ్చిన కష్టాలే కదా అనుకునేది!"

సీతాబాయి చిరునవ్వుని అపుకుని అమాంతంగా లేచి గోపాల్‌ని తండ్రి చేతుల్లో నుంచి తీసుకుంది. తన వళ్లో కూర్చోపెట్టుకుని, "గోపాల్, చిట్టి తండ్రీ! నేనూ ఇదే కథని చెప్తానుకాని, ఎంత బాగా చెప్తానో చూడు. మీనాన్న గారి కన్నా ఇంకా ఎంతో బాగా చెప్తాను!

"ఆ బ్రాహ్మడు నిజంగా వెర్రి బ్రాహ్మడే! ఎందుకూ? తనంత పెద్ద ప్రధానన్యాయమూర్తిగా ఉంటూ అలా బీదగా బతకటం ఏమిటి? అంత పెద్ద ఇంట్లోఉంటూ? కానీ అతని వెర్రికాస్తా వదిలిపోయింది! పెద్ద ఊరు వదిలి చిన్న పల్లెటూరికి మారిపోయాడు. చిన్న గుడిసెలాంటి ఇంట్లో కాపురం పెట్టాడు. ఆ పెద్ద వూర్లో పెద్ద ఇంట్లో కన్నా ఈ చిన్న పల్లెలోచిన్న గుడిసే తన భార్యకి బావుందని ఆ వెర్రిబ్రాహ్మడికి తెలీదు పాపం! ఏం చేస్తాము?" అన్నది.

సీతాబాయి కథ విన్న రామ్‌శాస్త్రి విరగబడి నవ్వాడు. ఆమె కోపం వచ్చినట్లు ముఖంపెట్టి "ఎందుకా నవ్వు? నేనేమన్నా పరిహాసం ఆడానా? ఉన్న నిజం చెప్పానంతే. దేవుడే నాకు సాక్షి. నిజంగా ఆ భవనంలో ఉన్నప్పుడు మీకు ఇంట్లో భార్యా, కొడుకు ఉన్నారనే ధ్యాసఉండేదా అసలు? ఎప్పుడు చూసినా న్యాయస్థానం పనితోనే సరిపోయేది? అప్పుడు మీరు పేష్వావారికీ, వారి రాజ్యానికీ సొత్తు. మీ మీద అధికారం అంతా వారిదే. అసలు మీకు దూరంగా ఉండిపోయిందెవరు? ఇంట్లో భార్యా, కొడుకూ —వీరిద్దరే....

"ఇప్పుడు మాత్రమే మాతోనే ఎక్కువ కాలం గడుపుతున్నారు. ఇన్నాళ్ళ నగరంలో మీతో కాపురం చేశాము కదా, ఎప్పుడయినా ఇలా తేలికగా కూచుని కబుర్లు చెప్పుకున్నామా? భర్తగా, తండ్రిగా మీ పాత్ర ఏమిటో తెలుసుకునే అవకాశమే ఉండేదికాదు మునుపయితే.. నిజంగా చెప్తున్నాను. మీరు పేష్వా వారి సొత్తుకాదు, వారి ప్రజల సొత్తుకాదు— ఈ ఇంటి యజమానులు, అంతే."

"వహినీ. క్షమించండి. మీతో ఏకీభవించలేను." ('వహినీ అంటే మరాఠీలో 'వదినె.' కొంచెం పరిచయం ఉన్న స్త్రీలని బంధువులు కాని వారు కూడా గౌరవంగా ఈ సంబోధన చేస్తూ ఉంటారు—రచయిత.) అంటూ ఆ ఇంట్లోకి వచ్చాడు ఆజానుబాహువయిన ఒకవ్యక్తి. అతని వేషం చూస్తే

మరాఠా ప్రభువులై ఉన్నాడు. చూపరులలో గౌరవ భావం కలిగించేట్లు ఉన్నాయి అతని ఆకృతి, వైఖరి, కంఠస్వరం. అతనెవరో కాదు. బార్‌భాయిల నాయకుడు నాన ఫడ్నవీస్. రామ్‌శాస్త్రి రాజీనామా తర్వాత మరి పదకొండు మందితో కలిసి రఘోబాని పేష్వా పదవి నుంచి తొలగించాడు. రఘోబా దేశం వదిలి పారిపోయాడు. పన్నెండుగురూ గణనాయకులుగా దేశాన్ని ఏలుతూ వచ్చారు. ఇదంతా రామ్ శాస్త్రికి తెలియదు.

"మీరా. రండి దయచెయ్యండి." అంటూ నానాఫడ్నవీస్‌ని ఆహ్వానించాడు.

నానాఫడ్నవీస్ వెంట సఖారామ్‌బాపూ కూడా లోపలికి వచ్చాడు. అప్పటికి బయట గాలివాన బాగా తగ్గిపోయాయి. వాతావరణం కొంచెం నిర్మల మయింది.

రామ్‌శాస్త్రి, సీతాబాయిలు ఇంకా మర్యాద చేసేందుకు అవకాశం ఇవ్వకుండానే నానాఫడ్నవీస్ ఇలా అన్నాడు: "వహినీ. మాలాంటి అల్పమనస్కులే కదా ఈ లోకంలోని ఐశ్వర్య సంపదలని ఆశించేది? రామ్‌శాస్త్రుల వారు వాటి అతీతులు! మానవాళిని ఉద్ధరించటానికే కదా భగవంతుడు అటువంటి వారిని ఈ భూమి మీదకి పంపిస్తాడు. అందుకనే సమయం వచ్చినప్పుడు వారి శరణు చొచ్చే హక్కు అందరికీ ఉంది.."

అతి గంభీర స్వరంతో చెప్పిన ఈ మాటలు విని రామ్‌శాస్త్రి, సీతాబాయిలు ఇద్దరూ నిరుత్తరులయి పోయారు. నానాఫడ్నవీస్ వినమ్రుడయి ఇంకా ఇలా అన్నాడు: "అయ్యా. తమరు మరాఠా సామ్రాజ్యానికి భగవంతుడు ప్రసాదించిన రత్నం వంటివారు. ఈ శుభ వార్త తమకి చెప్పుకోక నేనెవరికి చెప్పుకుంటాము?

"తమరు ఆనాడు సభ వదిలి వెళ్లిపోయిన తర్వాత మాకు ఒక హంతకుడిని పేష్వాగా స్వీకరించలేమని పించింది. రఘోబాని పదవీచ్యుతుడిని చేసే ఏర్పాట్లు చేసుకున్నాము. అతన్ని దేశంనుంచి బహిష్కరించాము.

"నారాయణరావ్ పేష్వావారి సతీమణికి అంతకు ముందే జన్మించిన వారి మగబిడ్డ సవాయి మాధవ రావ్‌ని సింహాసనం మీద అధిష్ఠింపచాము.

"ఇప్పుడు మేము తమర్ని కోరేదేమిటంటే, తమరు తక్షణమే రాజధానికి వచ్చి తిరిగి ప్రధాన న్యాయమూర్తి పదవిని అలంకరించాలి.

"తమ న్యాయ నిర్వహణ కన్నా మా ఆయుధ బలం గొప్పదికాదు. తమరు మా కోరికని మన్నించాలి."

రామ్‌శాస్త్రి ప్రశ్నార్థకంగా సీతాబాయి వంక చూశాడు. ఆమె ముఖంలో వెలసిన చిరునవ్వే అతనికి సమాధానం అయింది.

(సశేషం)






పందిరి మంచం మీద మల్లెపూలను కప్పు కుంది. పెంటువావన గది నిండా గుప్పుమంటోంది. అగర వత్తుల పొగతో, అత్తరూ, పూవుల వరి మాలాలతో దేదీప్యమానంగా వెలిగే దీపాలతో దేవేంద్ర భవనంలా వుంది నవ వధువు శ్యామలకోసం అలంకరించిన గది. రాజారావు మంచానికి వెనక్కి వాలి మెత్తని పరుపుమీద మృదువుగా కాలితో తాళం వేస్తూ పన్నని రాగాలాపనలో గీతాన్ని గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. అతనికి యిది రెండో రాత్రి జీవితంలో. అయినా ఎటువంటి చలనమూ కలగడం లేదు రాగానికీ, మనసుకీ యెక్కడా పొత్తు కుదరడం లేదు. వుత్తర దక్షిణ ధృవాల్లా రెండూ చెరో దారినా లేవలేవ కొట్టుకుంటున్నాయి. నూనె దీపాలే అయినా అతని ప్రాణానికి కంచు కాగడాల్లా కళ్లల్లో దూరి భగ్గుమనిపిస్తున్నాయి. పక్కనే చిన్న టేబుల్ మీద రకరకాల తినుబండారాలూ, పానీయాలూ అమర్చి తనకువున్న రాజసానికి యెటువంటి ఆనందమూ కలిగించడం లేదు యీ రెండో అత్తవారు. తనవంటే కాగి చల్లారిన పాలు. కానీ............ కానీ శ్యామల పొంగే యవ్వనంలో తన జీవిత ప్రాంగణంలో అడుగుపెడుతోంది. తనకు యిప్పుడు........ యిప్పుడు పెళ్ళియేమిటి? యిది తనకు పుట్టిన బుద్ధేనా? కాదు...... తన చుట్టూ తనని ప్రతి ఘడియా పరికిస్తున్న యీ సంఘానిది యీ ప్రోద్బలం. 'అందాకు యిరవై ఏండ్ల ఆడపిల్ల గొంతు కోస్తావా?' చిత్రంగా పరిహాసం పుట్టించింది మనసు. సిగ్గుతో చితికి పోలేదు రాజారావు. ఛాతీమీద చేయి వేసుకుని తలెత్తుకుని సనసారా నవ్వుకున్నాడు.

కోరికలు కోటలు దాటుతూంటే ఆ కోటలను చేరుకోలేక అన్యాయం అయిపోతున్న ఆడపిల్లల్ని ఎంతమందిని ఎరుగడు తన నలభై సంవత్సరాల జీవితంలో. తన దగ్గరికి పాఠం చెప్పుకోవడానికి ఎంతో మంది పిల్లలు వచ్చేవాళ్ళు. అలాంటి వాళ్ళలో కొందరు ఆత్మహత్యలు చేసుకున్నారు. కొందరు నామరూపాలు లేకుండా మట్టిలో కొట్టుకు పోయారు ఇందుకు......... ఇందుకు కారణం అంతస్థులు కొంత అయితే కట్నాలు మరి కొంత కారణం అయ్యాయి.

ఈసారి రాజారావు మనసు కుంగిపోలేదు. 'ఇది త్యాగం కాదు స్వార్థం. పొంగే రక్తంతో తనను తాను అర్పించుకుంటున్న పిల్లమీద నీకు సానుభూతి ఎందుకు వుంటుంది?'

తల అడ్డంగా వదిలించాడు రాజారావు. 'కాదు' నేను అలాంటి వాడిని కాను. నా అన్నపూర్ణని...... నేను పెద్ద సెంటిమెంటలిస్టునే అయినా కానీ కట్నం లేకుండా పెళ్ళి చేసుకున్నాను మళ్ళా దీనికి 'ప్రేమ' అని పేరు పెడితే ఒప్పుకోలేను. నేను పెళ్ళి చేసుకున్నాకే ప్రాణం పెట్టాను. అన్నపూర్ణని ఆరేళ్ళు కళ్ళల్లో నింపుకున్నాను. ఆ కళ్ళని భగవంతుడు పొడిచేశాడు, ఆధారంగా చిన్న గుడ్డి దీపాన్ని అంతి రాత్రాల్లో వెలిగించి. రాజారావు కళ్ళు చెమ్మగిల్లాయి. పన్నెండేళ్ళ రామం అతని మెదడులో గిరగిరా తిరుగుతున్నాడు. వచ్చీరాని మాటలతో వున్న యేళ్ళకి ఆరేళ్ళు తక్కువగా మానసిక వయసు పెంచుకుని. వాడికోసమే యిన్నేళ్ళు తను పెళ్లి పేరు తలపెట్టలేదు. వాడి చూపుల్లో, నడకలో ప్రతికదలికలో అన్నపూర్ణ ప్రత్యక్షం కాగానే తను తాత్కాలికంగా కలుగుతున్న 'వివాహం' అనే అభిప్రాయాన్ని పూర్తిగా తుడిచేసుకున్నాడు. పన్నెళ్ళకి వాడు మెంటల్ హాస్పటల్ నించి యింటికి రాగానే ఆలంబన లేని తన జీవితానికి ఓ తోడు కావాలని, ఆ తోడు తన జీవితం పొడుగునా నీడలా వెంటాడినా లేకపోయినా స్త్రీలో సహజ సిద్ధంగా పెరిగే మాతృప్రేమకు తన కొడుకు రామం పెట్టి పుట్టాలని మాత్రమే తను కోరుకున్నాడు. బి.యస్.సి. [illegible] చేసిన శ్యామల కుటుంబానికి భారం అయిపోతే ఆవిడ తలితండ్రులు తనని అడిగినప్పుడు శ్యామలని కలుసుకున్నాడు.

ఆ రోజు....... .

'మీవాళ్ళు నీ గురించి పడుతున్న బాధని గ్రహించాను. ఏకూ తెలును వాళ్ళ అభిప్రాయం. నేను ఒకటి, రెండేళ్ళు తక్కువగా నలభైలో పడేవాడిని. నన్ను చేసుకోవడం నీకు యిష్టమో, కాదో తెలుసు కోవలసిన బాధ్యత నామీద వుంది. ఇందుకు నువ్వు

వింటూవోయ్,' శ్యామలని అతను యెప్పుడూ అలాగే అంటాడు. చాపమీద కూర్చుని గోడకు చేరగిల బడ్డ శ్యామల తల దించుకుని అంది: "మా వాళ్ళకి నేను చేరుగిల సహాయం అంటూ వుంటే యింతకు మించి మరేమీ కనిపించడం లేదు మాష్టారూ. అక్కయ్యలు ఆరుగురూ ప్రవేశ పెట్టిన యీ రివాజు నాతో అంతం కావాలి. నా చెల్లెళ్ళు పుట్టింట్లో తిండికి కొట్టుకు లాడ కూడదు. మరొక్క మాట. మీరు బాధపడకండి. మా చెల్లెళ్ళు ముగ్గురూ రెండో పెళ్ళి వాడిని చేసుకోకూడదని మా నాన్నగారు నన్ను అడుగు తున్నారు. అంటే ఆర్థికంగా 'మీ సహాయం కోరు తున్నాం' అని వేరే చెప్పనవసరం లేదనుకుంటాను. మీ దయా భిక్షల్లో మమ్మల్ని పునీతం చెయ్యండి!" శ్యామల రెండు చేతులూ రాజారావు కాళ్ళ దగ్గర ఆగిపోయాయి. ఖంగారుగా అన్నాడు: "అదే అయితే చూడు శ్యామలా మీకు అండగా నేను వుంటాను. నాకోసం నువ్వు చేయగల్గేది యేదో వుంటుందని' మాత్రం అనుకున్నాను. కానీ యిలా.......... అతని మాటని పూర్తి చేయ నివ్వలేదు శ్యామల: "క్షమించండి మిమ్మల్ని నొప్పించాను. మేము పేద వాళ్ళం. కానీ మీరు దయతో యిచ్చే ధనాన్ని తీసు కోలేం. మీకు పుణ్యంవుంటుంది. మీ వయసుతో నాకు సంబంధం లేదు నా కళ్ళకి మీరు యువకులకన్నా తీసికట్టుగా కనిపించటం లేదు. నాకు అవకాశాన్ని యివ్వండి. మీ రామానికి తల్లినయేందుకు ప్రయత్నం చేస్తాను. మీ భార్యగా సేవ చేసేందుకు నాకు అనుమతి యివ్వండి."

రాజారావు కళ్ళ మీద చేతులు రెండు అలీనా జూకుగా వచ్చి అతన్ని కుదిపి కుదిపి ఆలోచనల్లోంచి లేపాయి. రాజారావు తృళ్లిపడ్డాడు. అతని వూహాగానం చెదిరి పోయింది. పచ్చని శరీరంతో మిస మిస లాడే లావణ్యంతో మనసు నిండా నింపుకున్న తెల్ల దనాన్ని చీరతో కప్పిపుచ్చుతూ రెట్టింపు అందాన్ని పులికి పుచ్చుకుని అతని పాదాల దగ్గర కూర్చుండి పోయింది శ్యామల. రాజారావు లేచి నిలుచుని భార్యను లేవదీసి రెండు చేతుల్తో బంధించి గుండె లకి అదుముకున్నాడు. శ్యామల అతని చెవిలో గుసగుస లాడింది. చదువుకుని, విజ్ఞానాన్ని సంపా దించుకున్న శ్యామలకి అలిగాపోయే సిగ్గు బిడియా లంటే నవ్వు వస్తుంది.

"నేను చాలా పెద్దవాడినోయ్. ముసలివాడినని పలుగురూ అంటారు" రాజారావు చమత్కారంగా అన్నాడు.

శ్యామల ముక్కుపుటాలు యెగరేస్తూ నవ్వింది: "పాతికేళ్లు పైబడ్డ ఆడపిల్లని ఈ రోజుల్లో తనిఖీ చేసి పెళ్లి చేసుకుంటున్నారు చాలా మంది యువకులు. మరి మీరు అలా చేయనందుకు ఆ యువ కుల కన్నా మీకు పెద్ద వయసు ముదిరిపోయిందని అనుకోను" రాజారావు తృప్తిగా కళ్ళు మూసు కున్నాడు. అతని కళ్ళల్లో అన్నపూర్ణ దీపం వెలి గిస్తూ కనిపించింది. ఆ చిరు జ్యోతిలో పక్క పక్కగా శ్యామలా, రామం కనిపిస్తున్నారు. రామం తల శ్యామల ఒళ్లో వుంది. రాజారావు మనసు దూదిపింజలా తేలిపోతోంది. అతని చేతులు బిగుసు కుని అందులో శ్యామల యిమిడిపోయి యే మహ త్తర శక్తీ విడదీయనంత అనురాగంలో మునిగి పోయింది.

* * *

తృళ్ళిపడి లేచాడు రాజారావు. అతని వీపుమీద కమ్చీతో ఎవరో కొడుతున్నారు బలంగా. కళ్ళు నులుముకుని పక్కకి తిరిగాడు. "రామం" అతనికీ శ్యామలకీ మధ్యగా యెప్పుడు వచ్చాడో నవ్వుతూ తండ్రి మెడచుట్టూ చేతులు వేసి కాళ్ళని అతని మీద వేసి 'నాన్నా నేను పారిపోయి వచ్చేశాను. ఆ దెయ్యం నన్ను పోనీదే.'

రాజారావు నిర్ఘాంత పోయాడు. అత్తగారిని ముద్దుగా 'దెయ్యం' అంటున్న కొడుకును ఏమి అనాలో అర్థం కలేదు. శ్యామల మంచి నిద్రలో వుంది.

'నాన్నా ఆచ్చటల్లో రాక్షసుడున్నాడు...' శ్యామల అన్నగారిని యెలా అంటున్నాడు. రాజారావు వూహాగానం చెల్లా చెదరై పోయింది. వాస్తవానికి పరుగిలు పెడుతున్నాడు. 'చూడు బాబూ మనం అక్కడ పడుకుందాం పద'

రామం మాట్లాడలేదు. రాజారావు బుజ్జగిస్తూ అడిగాడు మళ్ళీ. రామం కళ్ళు యెర్రబడిపోయాయి. శ్యామలని చేత్తో కుమ్ముతూ అన్నాడు: 'దీన్ని యీ దయ్యాన్ని పొమ్మను' వాడి కళ్ళకి 'పిన్ని అలా కనిపిస్తోందా? రాజారావు మనసు క్షణం ఆలోచించి రామాన్ని తనిఖీ చేయడంలో లీనం అయిపోయింది. శ్యామల అప్పటికే లేచికూర్చుంది.

రాజారావు తప్పు చేసిన వాడిలా తలదించు కున్నాడు. శ్యామల నవ్వుతూ అతని భుజం మీద చేయి వేసింది. 'మరేం బాధ పడకండి' అని వెళ్ళి చాప పరుచుకుంది. రాజారావు యిక ఆ రాత్రి నిద్ర పోలేదు ఈ రభసకి కారకుడైన రామం ఎప్పుడో నిద్రా దేవత ఒడిలో వాలిపోయాడు.

* * *

రాజారావు తనని తను తిట్టుకోలేని క్షణంలేదు. ఈ వయసులో తను యెంత అన్యాయంగా ప్రవ ర్తించాడు. డబ్బుతో ఆ కుటుంబాన్ని కొనుక్కుంటే దానికి తగిన ప్రతిఫలం ఆదరణ రూపంలో అయినా యివ్వలేక పోతున్నాడు. శ్యామల మనసారా ప్రేమిం చేందుకు అవకాశం యివ్వడం లేదు రామం.

పన్నెండేళ్ళ రామం తండ్రి తనవా, పినతల్లి వేదన అర్థం చేసుకోగల్గితే అతను 'చిల్డ్రన్స్ మెంటల్ హాస్పిటల్' లో వుండవలసిన అవసరం రకపోయేది.

'చూడు బాబూ కొంచెం తలకి నూనె రాస్తాను. గాలికి యెలా యెగురుతున్నదో చూడు మట్టి కొట్టుకుపోయి!' శ్యామల చేతిలో కొబ్బరి నూనె రామం తలకి పూర్తిగా అంటుకోనేలేదు. గోలీ విసిరేయడంతో శ్యామల కణతకి మంచి దెబ్బ తగి లింది. మెట్లమీద నుంచి పరుగున వచ్చాడు రాజా రావు. రామాన్ని దగ్గరికి తీసుకు శ్యామలని చుర చురా చూస్తూ అన్నాడు: 'నీకు బుద్ధిలేదు శ్యామలా వీడు నిన్ను కొట్టినప్పుడు యేం చెయ్యమన్నాను? ఫోన్ చేసి హాస్పటల్ వాన్ పంపమని చెప్పమని చెప్ప లేదూ' శ్యామల నవ్వుకుంది. రామం యెదుట శ్యామలని కసురుకుంటే వాడికి చాలా యిష్టం. పిన్ని నాన్న చేత దెబ్బలు తినడం అతనికి భలే సరదా. అందుకే రాజారావు శ్యామలకి పూర్తిగా విప్పి చెప్పి రామం యెదుట బద్ధ విరోధిలా నటిస్తున్నాడు.

రామం మొహం క్షణంలో రంగులు మారి పోయింది. 'నాన్నా నన్ను ఆచ్చటల్‌కి పంపకు' అంటూనే యేడ్చేశాడు.

నందు చూసుకుని రాజారావు అన్నాడు: 'మరి నేను చెప్పినట్లు వింటావా?'

'ఓ.........' రామం హాస్పటల్‌కి దూరంగా వుండాలని యెప్పుడూ అనుకుంటూనే వుంటాడు.

'పిన్ని పాపం మంచిది బాబూ. కొట్ట కూడదు నిన్ను యెప్పుడైనా తిట్టిందా? నువ్వే యిన్ని సార్లు కొట్టావు. మన పిన్నికదా, నిన్ను యెంత ప్రేమగా చూస్తుందని' రామం వినినట్లు నటించాడు.

'విన్నే బాబూ' రాజారావు రెట్టిస్తూ అడిగాడు.

రామం చూపులు శ్యామల మీదికి వాలాయి. నీడలా వెన్నాడుతూనే వున్నాడు. శ్యామల రాగానే తండ్రి గది తలుపులు మూసుకు పోవడం. అతని ఒడిలో శ్యామల తల ఆన్చి, అతని గుండెల్లో కద లడం అతన్ని నిలువునా ఈర్ష్యలో ముంచెత్తడం ప్రారంభించింది. శ్యామల రాగానే తండ్రి మొహం వికసించడం ఆవిడతో గంటల తరబడి కాలక్షేపం చేయడం తన తాలూకు బొమ్మని యెవరో బల వంతంగా గుంజుకు పోతున్నట్లు బాధపడుతూనే వున్నాడు. ఆ మంటల్లో మిడతలా శ్యామల దగ్ధం అయిపోతోంది. రామం కళ్ళు గర్వంగా మెరిశాయి. శ్యామల చేతిమీద అంగుళం మేర గాటు చూపి నిద్రలో వున్న శ్యామలని తనే........ తనే బ్లేడు పెట్టి గీశాడు. అప్పుడు మాత్రం యేడ్చిందా? నాన్న రాగానే అతనికి చెప్పేస్తుందను కున్నాడు. తనని తిడితే తండ్రికి ఫిర్యాదు చేద్దాం అనుకున్నాడు. కానీ ఆ రాక్షసి చెప్పలేదు. తన నాన్నని అది..... 'అది రామం ఈ మాటని పైకి అనేశాడు. 'నిన్ను అది నాది అంటుంది' శ్యామలని వేలితో చూపిస్తూ అంటూంటే రాజారావు మాట్లాడలేక పోయాడు. తన కొడుకు మానసికంగా దెబ్బతిన్నాడనీ, మాత్ర ప్రేమకు లొంగి పోతాడనీ అనుకున్నాడే గాని యిలా అణువణువునా స్వార్థం పెంచుకుని శ్యామలని 'బూచి'ని చూసినట్లు చూస్తున్నాడని యిప్పటికీ గాని గ్రహించలేక పోయాడు.

ఆ రాత్రి మెల్లగా శ్యామలతో అన్నాడు: "వీడు మరీ యింత దారుణంగా ప్రవర్తిస్తాడని అనుకో లేదు శ్యామలా. నిన్నేదో సుఖపెట్టాలనే ధ్యాస లేపోయినా, నీ కున్న సుఖాన్ని నాశనం పట్టించి వట్టున్నాను."

శ్యామల తలదించుకుంది: తనకూ మానవత్వం వుంది. ఆ మానవత్వంతోనే ఒక తండ్రికి యిల్లా లిగా, ఒక కొడుక్కి తల్లిగా ఆ యింట్లో అడుగు పెట్టి అతని తాలూకు ఋణ భారాన్ని కొంత తగ్గించుకోవాలని అనుకుంది. తీరా యిక్కడికి వచ్చాక ప్రేమ అనేచోట యింత బానిసత్వం మిగిలి పోయిందనీ, ఆ బానిసత్వానికి కట్టుబడి పోయిన భర్తని తను అర్థం చేసుకుని జాలిపడటం తప్ప మరొకటి చేయలేననీ, పొందలేననీ కూడా గ్రహిం చింది. రామాన్ని తలుచుకుంటే హృదయం భగ్గు మనడం లేదు. తన భర్త మరొకరిని కన్నెత్తి చూస్తే స్త్రీ సహజం అయిన ఆ ఈర్ష్య యెటు వంటిదో గ్రహించ గల్గింది. అదే ఈమధ్య రామంలో మరో రూపం దాల్చి పరవళ్ళు త్రొక్కుతోంది

అలా అర్థం చేసుకుంది. తన దురదృష్టమో, అదృష్టమో తేల్చుకోలేని స్థితిలో నిరాశగా నవ్వుకుంది.

అన్ని విధాల రామం జీవితంలో గడిచిన ఎనిమిది నెలలలో వారధిలా నిలుచున్నా 'విధి'కి మాత్రం కట్టలేక పోయాడు యినుప గోడల్ని. శ్యామల తల్లి వచ్చింది. రాజారావుకి రెండోసారి జరుగుతున్న సన్మానాలే కావచ్చు. శ్యామలకి ప్రతిది మొదటిసారి కనుకే. ఏడో నెలన గాజులు పెట్టించి పూలల్లో ముత్తైదువల్ని పిలిచే యేర్పాటు రాజారావు యింట్లోనే జరిగాయి. పిన్నికి అన్నిరకాల ఈ హామతులు యెందుకు వస్తున్నాయో అర్థంకాలేదు రామానికి. 'అది' అంటే పిన్ని తల్లి వచ్చి దీన్ని అంటే శ్యామలని సింగారిస్తోందని మాత్రం గ్రహించాడు.

'నీకు తమ్ముడు పుడతాడు. మీ పిన్నికి పుట్టే పిల్లాడిని మాకు యిస్తావా?' పేరంటానికి వచ్చిన ఆవిడ ఎవరో గొప్పగ అంది. ఎంతైనా గొప్పింటి

# కాంతికిరణం

బిడ్డ రామూన్ని ఏదోరకంగా పలకరించి జాబునేరి వేద్దాం అనుకుని.

రామం కళ్ళు చిన్నవి అయిపోయి కనుబొమ్మలు ముడుచుకు పోయాయి. "పిన్నిని కూడా తీసుకో పో...... అదేం వద్దు......" గట్టిగా అనేసి యిసకలో ఆడుకుంటూ ఆ మట్టిని చేతుల్నిండా పోసుకున్నాడు. రాజారావు మానసికంగా మరీ కృంగిపోయాడు.

ఆ రాత్రి అదేమాట అన్నాడు రామం గురించి. శ్యామల కంట తడి పెట్టింది: "నన్ను మీరు అపార్థం చేసుకోకండి. చచ్చిపోయిన అక్కయ్య ఆత్మకుశాంతి కావాలంటే వాడు యీ యింట్లోనే మన యిద్దరి మధ్యా వుండక తప్పదు. నా కోసం వాడిని దూరం చేసుకోవడంలో మీరు త్యాగం యేమాత్రం చేయడం లేదు. మీ స్వార్థం కోసం ఒక అమాయకుడిని చిత్రవధ చేస్తున్నారని అనుకుంటున్నాను. కాలం కలిసి రావాలి! యింతకన్నా మీకు నేనేం చెప్పగలను. నేను ఎందుకు బాధ పడుతున్నానంటే......" శ్యామల గొంతులో నీళ్ళు గిరగిర లాడాయి. "అక్కయ్య పోయి మిమ్మల్ని యేకాకిని చేసింది. భగవంతుడు మీకు చూపించిన ఈ దారిలో కొంచెం కాంతివంతం అయిన దీపం వుండి వుంటే మీరు యెంత తృప్తి పొందేవారు? మీరు చేసుకున్న పాపం యేమిటో యిప్పుడే అనుభవించమని యిలా దేవుడు అన్యాయంగా రాతలు రాసి తన మనిషిని యెంత విచిత్రంగా చిత్రించుకుంటున్నాడు. మీరు నే వున్నంతవరకూ బాధ పడ నవసరం లేదు." అంది.

రాజారావు దీర్ఘంగా నిట్టూర్చాడు: న్యాయం, అన్యాయం భార్యా, కొడుకూ యిద్దరి మధ్య త్రాసులా నిలుచుని వెర్రిగా చూస్తున్నాడు.

* * *

బండి యెక్కుతూ ఒంగి నమస్కారం చేసింది శ్యామల భర్త కాళ్ళకి. రాజారావు కళ్ళతో ప్రేమని పంపిస్తున్నాడు భార్య నరనరాల్లోకి. రామం చిత్రంగా చూస్తున్నాడు యిదంతా.

"మరి వెడుతున్నా" శ్యామల బండి యెక్కింది. రామం చిక్క మొహం వేశాడు తండ్రి మొహం చూశాక. ఆ రోజు అన్నపూర్ణని యిలాగే పంపాడు. అందుకే అతని కళ్ళు నీళ్ళు నింపుకున్నాయి. 'మీరు బెంగపెట్టుకోకండి. దేవుడు లేడని నేను అనను. వాడికి దగ్గరగా నేను మీకు దూరం అయివుండ లేను. వాడు వో దారికి వస్తే తప్పకుండా వుత్తరం రాయండి. నేను మీ దగ్గరికి వస్తాను. కాని పక్షంలో మీరు పంపే డబ్బుతో మీ కోసం యెదురుచూస్తూ వుంటాను.' శ్యామల బుగ్గలమీద నీళ్ళు విరిచాయి,

"అంటే...... అంటే యింక రావా శ్యామూ" రాజారావు గొంతు పెగల్చుకుంటూ అన్నాడు. శ్యామల మౌనంగా బండిలో కూర్చుంది. శరీరంలో కొన్ని రామం తాలూకు గుర్తులూ, రాజారావు తాలూకు ప్రతిబింబం కదులుతూంటే అయోమయంలో రామం రూపానికి జడుసుకుని మౌనంగా వుండడంతో తన అర్థాన్ని భర్తకి చూపించి ఆకుపచ్చని చీరతో కళ్ళు తుడుచుకుంటూ తన జీవితం శుభం కావాలనే కోరుకుంది. రాజారావు కళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

రామం చిత్రంగా చూస్తున్నాడు. తన నాన్న, యింత పెద్ద నాన్న. దాని కోసం...... ఏమో ఎందుకో ఏడుస్తున్నాడు. ఈ మాట భరించ లేక పోతోంది వాడి మనసు. ఖంగారుతో గట్టిగా అరుస్తున్నాడు.

"పిన్నీ నువ్వు త్వరగా రావాలి...... నాన్నా పిన్నిని రమ్మనండి." అంటూ. శ్యామల వీపు మీద చరిచి పట్టింది. అప్పుడు తనకి మంచి రోజులు వున్నాయి ముందు. రాజారావు కళ్ళు ఆనందంగా శ్యామల వైపు పరుగులు తీస్తూంటే చేతులు ప్రేమగా రామంపైపు మళ్ళాయి ●

# వారఫలం

**31-3-1967 శుక్రవారం మొదలు 6-4-1967 గురువారం వరకు.**

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో ఆదాయవ్యయాలు రెండూ కూడా పెరుగుతాయి. నూతన వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా వుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో యితరుల మూలంగా శ్రమకు గురి కాగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపారంలో నూతన అవకాశాలు లభిస్తాయి. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వస్తాయి. అనుకూల వార్తలను వింటారు.

**మిథునం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. కొన్ని వ్యవహారాల్లో మీరు యెంత మంచిగా ప్రవర్తించినా అది యితరులకు చెడుగానే కన్పిస్తుంది. కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేస్తారు. మానసికాందోళన కలుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా వుంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**కర్కాటకం:** వ్యాపారంలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసి వస్తుంది. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు:— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి.

**సింహం:** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించ గలవు. వృత్తిలో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. పోటీవారితో వాద ప్రతివాదాలకు దిగడం తగదు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమమీద అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య:** కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం తగదు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణము ద్వారా కార్యసాధన చేయగలరు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. అలంకార వస్తువులు కొంటారు.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించగలదు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో మీ కృషిని అధికారులు గుర్తించగలరు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం:** మీ ఆలోచనలు మీకే కాకుండా మీ మిత్రులకు కూడా లాభదాయకంగా ఉంటాయి. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:** వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. నూతన వ్యాపారాలు లాభించగలవు. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేస్తారు. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**మకరం:** వారం ప్రారంభంలోనే అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం వుంది. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలి వేయడం మంచిది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయంజరుగుతుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**కుంభం:** కొన్ని వ్యవహారాలు సులువుగా నెరవేరినా, మరి కొన్నింటిలో శ్రమ పొందవలసివస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం ప్రారంభంలో లాభిస్తాయి వారం మధ్యలో అనుకోని చికాకులకు గురి కాగలరు. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:** మీకు ముమ్ముందు లాభించని వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వృత్తిలో ఉదాయం పెరుగుతుంది. వ్యాపారంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— బంధువులకు సహాయం చేస్తారు. విలాస వస్తువులు కొంటారు.

—మహేష్

**జరిగిన కథ**

రామదాసును హత్యచేసి ఆయన దాచుకొన్న దంతా ఎవరో దోచుకు పోయారు. అంతక్రితమే సత్యమూర్తితో తన కథ కొంత చెప్పారు రామదాసు. ప్రకాశం తన షుగర్ ఫ్యాక్టరీలో సత్యమూర్తికి ఉద్యోగం ఇచ్చాడు. ఆ చుట్టుపక్కల ప్రకాశానికి చాల పరపతి వుంది. అతనికి దామోదరం నమ్మిన బంటు. భానుమతిని వశపరచుకుంటే కావలసినంత ఆస్తి దక్కుతుందని అందుకు దామోదరం ప్రయత్నిస్తున్నాడు. సత్యమూర్తి భానుమతి పరస్పరం ఆకర్షించుకున్నారు. భంగపడిన బెనర్జీ, దామోదరం కొడుకు గోపాలన్ ఇద్దరూ భానుమతి మీద మక్కువ చూపిస్తున్నారు. ప్రకాశం ప్రమాదానికి గురి అయ్యాడు. ఉమ అతనికి సేవ చేస్తుంది.

# సుప్రభాతం (సీరియల్)

## రంగనాథ్

## 22

"ఒక వేళ ఆమె ఇప్పుడు కన్పిస్తే, ఆమెను వివాహం చేసుకుంటారా?" అని ఉమ అడిగేసరికి ప్రకాశం ఆమె వైపు అనుమానంగా చూశాడు. "ఈ ప్రశ్నలు ఎందుకు అడుగుతున్నారు?"

"నా ప్రశ్నకు జవాబు చెప్పండి. వివరాలు తర్వాత చెప్తాను."

"ఆమె కూడా ఇష్టపడాలి కదా."

"అది నిజమే. ఆమెను ఒప్పించడానికి నేను ప్రయత్నిస్తాను."

"ఆమెను మీకెలా తెలుసు?"

"ఆమె సత్యమూర్తిగారి చెల్లెలు కళ్యాణికదూ?"

"అవును. మీ కామె కన్పించిందా? ఎక్కడ ఉంది?" అని ఉత్సుకతతో ప్రకాశం అడిగాడు. అతని మొహంలోని భావాన్ని బట్టి, అతనికి నిజంగా కళ్యాణి యందు అభిమానం వున్నట్లు గ్రహించింది.

"కళ్యాణి ప్రస్తుతం మద్రాసులో ఆంధ్ర మహిళా సంఘంలో ఉద్యోగం చేస్తోంది. ఆమెను నేను మద్రాసు వెళ్ళినప్పుడు, మహిళా సంఘానికి వెళ్ళి నా స్నేహితురాలొకర్ని కలుసుకుని మాట్లాడుతూంటే, కలియడం జరిగింది. అకస్మాత్తుగా ఒకరి నొకరం పరిచయం చేసుకున్నాం. తరువాత వారం రోజుల పాటు రోజూ ఆమెను కలుసుకుంటూ వచ్చాను. ఆమె గురించి సత్యమూర్తిగారు చాలా బాధపడుతున్నారనీ, తిరిగి రామవరం వెళ్ళమనీ చెప్పాను. ఆమె అందుకు నిరాకరించింది. బాగా ఒత్తిడిచేసి అడగ్గా, మీరు ఆమెను నమ్మించి మోసం చేశారని చెప్పింది. వివాహం చేసుకుంటానని భ్రమపెట్టి, చివరకు 'నువ్వు బీదపిల్లవు. నిన్ను నేను పెళ్ళి చేసుకోనని' అన్నారని చెప్పింది."

"అందుకు నేను చాలా విచారిస్తున్నాను. అవి నేను రాజకీయాలలో ప్రవేశించిన మొదటిరోజులు. కళ్యాణికీ నాకూ అనుబంధం అంతకు ముందు మూడేళ్ళ నుండి వుంది. ఆ రోజుల్లో నాకు డబ్బు మీద చాలా ఆశ వుండేది. కళ్యాణితో నేను డబ్బున్న పిల్లను పెళ్ళి చేసుకుంటా నన్నాను. కాని తరువాత నేను చాల డబ్బు సంపాదించాను. చాలా మంది డబ్బు ఉన్న వాళ్ళు తమ పిల్లల్ని నా కిస్తామని వచ్చారు. కాని వాళ్ళెవరూ నాకునచ్చలేదు. నా కళ్యాణి ఎప్పుడూ నా మనసులో మెదులుతూ వుండేది. ఆమెను మళ్ళీ వివాహం చేసుకోవాలనే వుద్దేశంతోనే సత్యమూర్తికి రామవరంలో వుద్యోగం ఇస్తానని పిల్చాను. సత్యమూర్తి వచ్చాడు గాని, కళ్యాణి రాలేదు. ఆమె పౌరుషంతో నాకు కన్పించకుండా, ఎక్కడికో వెళ్ళి పోయింది. ఇప్పుడు మీరు చెప్పేదాకా ఆమె ఎక్కడుందో నాకు తెలియదు. సత్యమూర్తికి కూడా ఈ విషయం తెలియదు."

"అయితే ఇప్పుడేం చేస్తారో చెప్పండి."

"వెంటనే మద్రాసు వెళ్ళి ఆమెను కలుసుకుని, విషయమంతా ఆమెకు చెప్పి, ఆమె కోపం పోగొడతాను. కళ్యాణికి నాయందింకా ప్రేమ పోలేదను కుంటాను. లేకపోతే మీకీ విషయం చెప్పదు."

"అవును. ఆమె ప్రస్తుతం ఇక్కడే వుంది."

"ఆ! ఎక్కడుంది? వెళ్ళి ఆమెను కలుసు కుంటాను." అని లేచాడు.

"ఇవాళ ప్రొద్దున్నే కొందరు స్నేహితురాండ్రతో తిరుపతి వచ్చింది. వాళ్ళు వేరొక కాటేజి తీసుకున్నారు. సాయంకాలం ఇక్కడికి వస్తుంది."

"ఎన్నాళ్ళకు మళ్ళీ ఆమెను చూడగల్గుతున్నాను! నిజంగా మీ మేలు ఎప్పటికీ మర్చి పోలేను. అని ప్రకాశం అంటూంటే బయట కారాగిన చప్పుడైంది. అనంతరావుగారు లోపలికి వచ్చారు. ఆయన చాలా ఆందోళనలో వున్నట్లున్నారు. "మనం ఈ రాత్రే తిరిగి వెళ్ళిపోదాం. ప్రకాశం కారు బాగు పడలేదు. మన కారులో వెళ్ళిపోదాం. రజాక్‌తో ఫోనులో మాట్లాడాను. పరిస్థితి చాలా ప్రమాదకరంగా వుందని చెప్పాడు. వాళ్ళు భానుమతిని బలవంతంగా లొంగదియ్యాలని చూస్తున్నారు." అన్నా రాయన.

"అయ్యో! అయితే వెంటనే బయల్దేరాలి" అంది ఉమ.

"భానుమతి ఎవరు?" అని అడిగాడు ప్రకాశం.

"నీకు ఇన్నాళ్ళనుంచీ ఆమె ఎవరో తెలియదా?"

"ఊహూ!"

"నువ్వు ఎవరికోసం ఇన్నేళ్ళనుండీ గాలిస్తున్నావో ఎవరివల్ల నీవు అనుభవిస్తున్న ఆస్తిలో సగ భాగానికి ప్రమాదం వస్తుందని భావిస్తున్నావో, ఆ— పెద బాబుగారి మనవరాలే భానుమతి." అన్నా రాయన.

"ఆ! ఎక్కడుంది?" అన్నీ ఉద్రేకంతో లేచాడు ప్రకాశం.

"కూర్చో. నీతో చాలా విషయాలు మాట్లాడాలి. మనకు అయిదు గంటల వ్యవధి వుంది." అన్నా రయన తన వాచీ చూసుకుంటూ.

"కళ్యాణిని కూడా మనతో తీసుకు వెళ్దాం." అంది ఉమ.

"అలాగే. తప్పకుండా." అని ఆయన అనగానే ఉమ కళ్యాణికోసం బయల్దేరింది. అనంతరావుగారు ప్రకాశంతో మాట్లాడ సాగారు.

* * *

"మీకు ట్రాన్స్‌ఫరయిందని తెలిసి చాలా విచారిస్తున్నాను." అన్నాడు సూర్యం, కుమారస్వామితో. ప్రొద్దున్నే తొమ్మిది గంటలకు వచ్చిన టపాలో వెంటనే కుమారస్వామిని బెజవాడ ట్రాన్స్‌ఫరు చేస్తూ ఆర్డర్లు వచ్చాయి. మరొక గంటలో సూర్యానికీ, మరి కొందరికీ ఆ విషయం ఆయన ద్వారానే తెలిసింది. ముందర అందరికన్న ఎక్కువగా విచారించిన వాడు సూర్యం. "ఈ ఊళ్ళో సరైన స్నేహితులు దొరకనే దొరకరు. మీరున్నన్నాళ్ళూ మాకెంతో సరదాగా గడిచింది. మీరు వెళ్ళిపోతే మళ్ళీ మా కిక్కడేం తోచదు."

"నాకూ ఇక్కడ బాగానే గడిచి పోయింది. మీ అందరి సహచర్యం నాకెంతో ఆనందం కలిగించింది." అన్నారు కుమారస్వామిగారు, మాలయ్య తెచ్చిన రెండు కాఫీ గ్లాసులలోనూ, ఒక గ్లాసు సూర్యం కందించి, రెండొకగ్లాసు తీసుకుని. ఆయనకు తన పని తను చేసుకుంటూనే, ఎదుటి వారితో మాట్లాడడం అలవాటు. ఇద్దరూ కాఫీ త్రాగారు. సూర్యం, "మీకేం. మీరెక్కడికి వెళ్ళినా మంచి వూళ్ళు వెళ్తారు, సరదాగా గడప గలుగుతారు. కాని ఈ వూరి లాంటి వెధ వూరెక్కడా వుండదు." అన్నాడు చిరాకుగా.

"అలా అనకండి. ఈ వూరులో నా కెక్కువ లోపాలేవీ కన్పించలేదు. మీరూ, తదితరులూ మంచి స్నేహితులు దొరికారు. మొదట్లో ఈ వూరి వాతావరణం కొద్దిగా విచిత్రమని పించింది గాని, రాను రాను వ్యక్తుల్ని అర్థం చేసుకున్న కొద్దీ, ఇక్కడి వ్యక్తులకూ, తదితర ప్రదేశాలలోని వ్యక్తులకూ ఏమీ తేడా లేదని పించింది."

"అలా అనకండి. ఇక్కడ ఉన్నన్ని రాజకీయాలు మరెక్కడా లేవు. మనుషులలో ఇంత మోసం, దగా, మరో చోటెక్కడా వుండవు."

"ఈ రోజుల్లో రాజకీయాలు లేని వూరే లేదు. స్వతంత్రం వచ్చిన దగ్గర్నుండీ, దేశ స్వరూపమే మారింది. మునుపు అగ్రస్థానాల నలంకరించిన వారంతా పతనమై పోయారు. జమీందారులు నశించి పోయారు. కొత్తరకం శ్రీమంతులు బయల్దేరారు. వీరికి అవకాశాలు కలిసివచ్చి, నడమంత్రపు సిరి పట్టింది. తరతరాలుగా వీరికి భాగ్యం లేక పోబట్టి, వీరికి సంస్కారం, విద్యా, విశాల దృక్పథం లేదు. అందుకని వాళ్ళకు ఏ విధంగా ప్రవర్తించాలో తెలియకుండా వుంది. కొన్నాళ్ళకి పరిస్థితులు సర్దుకుంటాయి."

"అయినా బొత్తిగా పాపభీతి లేదండీ. మరేమన్నా అనండి. ఈ వూరు వదిలి వెళ్తున్నారంటే మీరెంతో అదృష్టవంతు లన్నమాట. హాయిగా బెజవాడలో జీవితం ఎంతో దర్జాగా వుంటుంది. ఈ ప్రకాశం, దామోదరం గొడవలతో ప్రాణం చిరాకెత్తి పోయుంటుంది. ఇక్కడ అంతకన్న మరో వ్యాపకమే లేదు."

"అక్కడ మాత్రం ప్రకాశంలూ, దామోదరలూ లేరంటారా? అయితే వూరు పెద్దదైన కొద్దీ, ఒక మనిషికీ మరొక మనిషికీ దూరం ఎక్కువవుతుంది. ఒక రంగానికీ మరొక రంగానికీ అంత

సన్నిహితత్వం వుండదు. ఇక్కడ అలాకాదు. తప్పని సరిగా ఒకరి గురించి ఒకరు తెలుసుకోవలసి వస్తుంది, వూరు చిన్నది కాబట్టి."

"ఏమో, మీకలా అనిపిస్తోందేమోకాని, నాకు మాత్రం ఇదంతా ఈ వూరులోనేనని గట్టిగా నమ్మకం. అరుగో సుబ్బయ్యగారు వస్తున్నారు. నేను మళ్ళీ సాయంకాలం కలుస్తాను." అని సూర్యం వెళ్ళి పోయాడు.

"సుబ్బయ్యగారు ప్రవేశిస్తూనే, "మీకు 'ట్రాన్స్‌ఫరయిం'దని తెలిసింది. బెజవాడ వెళ్తున్నారటగా. మీకు 'రిలీవర్'గా ఎవరు వస్తున్నారు?" అని అడుగుతూ కుర్చీలో కూచున్నారు.

"గోవింద నాయర్ వస్తున్నాడు. మీ కతను తెలుసు ననుకుంటాను. కేరళ నుండి వస్తున్నాడు."

"అతనా! మంచివాడే. అన్నట్లు ప్రకాశానికి 'యాక్సిడెంటు' అయింది మీకు తెలుసా? నాకు విన్నాకే తెలిసింది."

"అలాగా నాకా విషయం తెలియదు."

"ఇందులో ఏదో గమ్మత్తు వుంది. పదిహేను రోజులనుండి దామోదరం, గోపాలన్ వూళ్ళో లేరు. ఇవాళ సత్యమూర్తి హడావుడిగా విశాఖపట్నం వెళ్తున్నాడు. ప్రకాశం ఎక్కడున్నదీ ఎవరికీ తెలియదు. అతనికోసం చాలా మంది ఎదురు చూస్తున్నారు."

"ఏమయ్యా డంటారు?"

"అదే ఆశ్చర్యంగా వుంది. నేను అసలు చాలా కాలం నుండి ఒక విషయం అనుమానిస్తున్నాను. ఈ దామోదరం ఎప్పుడో ఒకప్పుడు, ఉడాయిస్తాడని, చేతికి చిక్కింది రెండు లక్షలో మూడులక్షలో పట్టుకు పోతాడనీ నాకు చాలా అనుమానంగా ఉంది."

"పట్టుకు పోవడం ఎందుకు, అతని వల్ల అన్ని ఉపకారాలు పొందిన ప్రకాశాన్నే నూటిగా ఇమ్మని అడుగవచ్చు కదా?"

"అమ్మా! అలా అనకండి. ఒకసారి ఆ బుద్ధికి అలవాటు పడ్డవాడు ఎప్పుడూ అదే పద్ధతిలో ఆలోచిస్తాడు. వాడికి తిన్నగా ప్రవర్తించాలని ఉండదు. ఏమైనా ఇవాళ సాయంకాలంలోగా ప్రకాశం ఎక్కడున్నదీ తెలియాలి. లేకపోతే బదిరీ, రంగారావు మొదలైన వాళ్ళు అన్ని చోట్లకి వరి సెత్తుదా మనుకుంటున్నారు. ఇంకో ముఖ్య విషయం. ఈ వూళ్ళో దాలినాయుడని, తెగ తాగి తిరుగుతూండే వాడూ, వాడిని పోలీసులు అరెస్టు చేసి తీసుకు పోయారు. మునుపొకసారి ఒక హత్యకేసులో వాడు ఇరుక్కుంటే ప్రకాశం వాడిని విడిపించాడు. అప్పటినుండీ వాడొక పెద్ద మనిషి క్రింద చలామణి అవుతున్నాడు. మళ్ళీ వాడిని అరెస్టు చేసారంటే ఇందులో ఏదోవుందన్నమాటే."

కుమారస్వామి నవ్వాడు. "బాగా తాగాడని కేసు పెడ్తారేమో. అంతకన్నా విశేష మేముంటుంది."

"వాణ్ణి విశాఖపట్నం తీసుకు పోయారు. ఆమధ్య ఒక సి. ఐ. డీ. ఈ వూరు వచ్చి చాలా విషయాలు తెలుసుకుంటున్నాడని అన్నారు. కొన్ని కొన్ని సంగతులు చూస్తూంటే నిజమే ననిపిస్తోంది. మరో విషయం. పెదబాబుగారి కూతురు విశాఖపట్టణంలో వుందట. ఇప్పుడు వీళ్ళ ఏం చేస్తారో చూడాలి. ఒకసారి అలా బ్యాంకు ఏజంటుగారి వద్దకు వెళ్ళి వస్తాను." అని లేచారు సుబ్బయ్యగారు.

"మంచిది." అన్నాడు కుమారస్వామి నవ్వుతూ. సుబ్బయ్యగారు వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళి పోయాక కొంచెంసేపు ఆఫీసుపని చేసుకున్నాడు. మధ్య మధ్య సుబ్బయ్యగారి మాటలు జ్ఞాపకమొచ్చాయి. ప్రజలకు చాలా విషయాలు తెలిసాయి. కాని వాటి అసలు రూపంలో తెలియలేదు. అయినా వాళ్ళకు చాలా ఆసక్తి వుంది. ప్రజలకు మంచీ, చెడూ రెండూ తెలుసు. తెలిసి కూడా, చెడుని నిరోధించరు. అది మనలోని బలహీనత.

తను రామవరం వదిలి వెళ్ళిపోయినా కొన్ని సంఘటనలు శాశ్వతంగా మనసులో అలా వుండి పోతాయి. ప్రజలు నిజంగా అమాయకులు, బీద వాళ్ళు. ఆ చిన్న పల్లెటూరులో జరుగుతున్న కథే



అనేక రూపాల్లో యావద్భారత దేశంలో జరుగుతోంది. కాస్త చొరవ వున్నవాళ్ళు స్వతంత్రం వచ్చాక అనేక విధాలుగా బాగు పడ్తున్నారు. తాము బాగు పడిన వెంటనే, ఇతరులకు ఆ అవకాశం లేకుండా చేసి రాజకీయాలు నడిపించి తమ స్థానాన్ని భద్రంగా కాపాడు కోవడానికి ఎటువంటి దుర్మార్గాల నైనా చెయ్యాలని చూస్తున్నారు. కాని అది ఆట్టే కాలం సాగదు. బజారులో మొన్న మొన్నటి దాకా రోడ్డు ప్రక్కన చిన్న బుట్టలో కూరగాయలు పెట్టుకుని అమ్ముకునే రామన్న, ఇప్పుడొక పెద్ద కూరగాయల కొట్టు పెట్టి, తెర వెనుక వ్యాపారాలు అనేకం చేస్తూ బాగా డబ్బు సంపాదించి, వచ్చే ఎలక్షన్లలో అసెంబ్లీకి నించోవాలని చూస్తున్నాడు. అమ్మోనియాని ఎరువుగా ఉపయోగించే కన్నా సారా తయారు చెయ్యడానికి ఉపయోగిస్తే ఎక్కువ లాభం అని గ్రహించి, ఆ వ్యాపారంలో డబ్బు గణిస్తున్నాడు. ఆ డబ్బుతో నలుగురి గౌరవాన్నీ కొనుక్కుంటున్నాడు. ఇళ్ళూ, మేడలూ కట్టుస్తున్నాడు. బ్లాకు మార్కెట్టులో ధనవంతులైన వాళ్ళంతా, సమాజంలో, నిగ్గూ ఎగ్గూ లేని ఒక సంకర జాతి. వాళ్ళకు అంతరాత్మలో నిమిత్తం లేదు, దేశంలో తిండికి లేక మల మల మాడి పోతున్న వాళ్ళను చూస్తే జాలి లేదు, వాళ్ళు ఏనాడు డబ్బును చూడలేదు. ఇప్పుడు అకస్మాత్తుగా చూస్తూంటే, వాళ్ళకు అది తప్ప మరేమీ కన్పించటం లేదు. విలువలతో అసలు సంబంధం లేదు. సాయంకాలం పూట రామవరం బజారులో తిరిగే మనుషుల్లో చాలా మంది పూర్తి నిషాలో వున్న వాళ్ళే. వాళ్ళు షుగర్ ఫ్యాక్టరీలో పని చేసేవాళ్ళు కావచ్చు. లేకపోతే మరోవిధంగానైనా కష్టం చేసి తాన్ని గడిపే వారు కావచ్చు. ఏమైనా వాళ్ళ వంటి మీద చిరిగిన బట్టల్నీ, అర్ధాకలినీ, వూపిరి సలుపని గుడిసెల్లో ముక్కులు బద్దలయ్యే మురుగు కంపునీ, తిండికి లేక వస్తులు పడుకునే భార్యా బిడ్డల్నీ, అందర్నీ మరిచిపోయి పావలా గ్లాసుతో స్వర్గంలో ఒక చెక్కర్ కొట్టాలని చూస్తారు. అది వారిని ఇంకా క్రిందికి లాగేస్తోంది. ఇక మధ్య తరగతి వాళ్ల జీవితం మరీ అర్థాన్నం. తమ దరిద్రాన్నీ, బీదతనాన్ని దాచుకోవడానికి నానా అవస్థలూ పడుతూ పరువు ప్రతిష్ఠల కోసం పాకులాడుతూ, చిరిగిన చీరను కుట్టుకుంటూ భార్య ఇంట్లో విచారిస్తూంటే తన చేతకాని తనానికి విచారించలేక, ఎప్పుడో తను

# సుప్రభాతం

తప్పక టిక్కు గెలిస్తానని "పేష్కాపిజం" అలో చనలలో కాలం గడుపుతాడు భర్త.

పల్లెటూళ్లో జీవించబట్టి, జీవితాన్ని అన్ని అంతస్థులలోనూ సన్నిహితంగా చూడ గలిగాడు. పట్నవాసంలో అయితే, తన లాంటి వాళ్లే మధ్య తరగతి ఉద్యోగస్థుల మధ్య, సాయంకాలం ఏ క్లబ్బులోనో కాలం గడుపుతూ, పేపరులోని విశేషాలు చర్చించుకుంటూ వుండేవాడు, అదే సంస్కార జీవితం అనుకుంటూ. ఆదివారం నాడు ఇంగ్లీషు ఫిల్ములూ, క్లబ్బులో బ్రిడ్జీ, ఏటా జరిగే టెన్నిస్, క్రికెట్, ఫుట్‌బాల్ పోటీలూ, అప్పుడప్పుడు రవి శంకర్ సితార్ కచ్చేరీయో, యామినీ కృష్ణమూర్తి భరత నాట్యమో, కాలాన్ని ఇట్టే తిప్పేస్తాయి. కాని పల్లెటూళ్లో కాలం అలా గడవదు. ఎంత తప్పించుకుందామన్నా లంవ్యక్తుల దరి గురించీ తెలిసి తీరుతుంది. కాలం గడపడానికి ఒకరి మీద ఒకరు నేరాలు చెప్తూనే వుంటారు. ఆయన అలా ఆలో చిస్తూంటే, చేతికర్ర వూపుకుంటూ ప్రొఫెసరు గోపాలరావుగారు వచ్చారు. "మీకు ట్రాన్స్‌ఫరయిందని తెలిసింది. ఏమైనా 'ప్రమోషన్' కూడా అయిందా?" అన్నారు.

"చిన్న ప్రమోషన్ కూడా లభించిన మాట వాస్తవమే." అన్నాడు కుమారస్వామి, చిరునవ్వుతో.

"బాగుంది. ప్రస్తుత మీ గ్రహస్థితి బాగుంది కాబట్టి ప్రమోషన్ వస్తుందని నేను మునుపే చెప్పానుగా."

"నేను చాలా సార్లనుండీ మిమ్మల్ని ఒక విషయం అడుగుదా మనుకుంటున్నాను గాని అడగ లేక పోతు న్నాను. ఈ వూళ్లో సుమారు మీరెంత కాలం నుంచి వుంటున్నారు.'

"ముప్ఫై ఏళ్ల నుంచీ వుంటున్నాను.

"అప్పటికిది బొత్తిగా పల్లెటూరిలా వుండి వుండాలి మీలాంటి చదువుకున్న వాళ్లకి విజ్ఞాన వంతులకు ఇక్కడెలా వుండ బుద్ధేస్తుంది? పైగా ఇన్నాళ్లెలా వుండగలిగారు?

"అదా. ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఈ ప్రశాంత వాతావరణం నాకు నచ్చిపోయింది. పట్న వాసాల్లో ఇలా ప్రకృతికి దగ్గరగా వుండ గలగడం సాధ్యం కాదు. ఈ స్వచ్ఛమైన గాలి, చుట్టూ పొలాలూ, చిన్నవూరూ నాకెంతో నచ్చింది.

"మరి వూళ్లోని రాజకీయాలతో మీకేమీ సంబంధం లేదా?"

"లేదు. నేనెప్పుడూ పుస్తకాలు చదవడంలో కాలం గడుపుతాను. ఎవరి విషయాలలోనూ జోక్యం కలుగజేసుకోను. నా చిన్నతనంలో గాంధీగారి సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని జైలుకు కూడా వెళ్లాను. జైలునుంచి వచ్చాక ఎద్దైనా ఒక చిన్న పల్లెటూరులో గాంధీగారి ఆదర్శాలతో ఒక ఆశ్రమం నిర్మించాలని ఇక్కడకు వచ్చాను. కాని నేను కున్నట్లు ఆశ్రమం నిర్మించలేక పోయాను. ఉన్నత ఆదర్శాల గురించి మాట్లాడితే, పిచ్చివాడి క్రింద జమకట్టారు ఇక్కడి వాళ్లు. ఈ మను షుల కన్నా ప్రకృతే నాకు బాగా నచ్చింది. అందు కని ఈ ప్రకృతికీ, ఈ ప్రశాంతతకూ ఆకర్షింప బడి, సరళమైన జీవితాన్ని గడుపుతూ కాలక్షేపం చేస్తున్నాను. నాకు చేతనైతే ఎవరికైనా ఉపకారం చేస్తాను. అదే నా పద్ధతి."

"బాగానే వుంది. కాని మీరు గాంధీజీ అను యాయులు కదా, స్వతంత్రం వచ్చాక, ప్రజలలో అవినీతి ప్రబలిపోతూంటే ఎలా చూస్తూ వూరు కుంటారా? అందుకు తగిన చర్య తీసుకోవాలని పించ లేదా?"

"అదంతా ఇక మీలాంటి యువకులు చెయ్యా ల్సిన పని. మేము రంగంలోంచి తప్పుకున్నాము. ఇక జీవితశేషాన్ని భగవధ్యానంలో గడుప దల్చాం"

"అలాగంటే ఎలాగ? మీరు బొత్తిగా వూరుకో కూడదు."

"మా దృష్టిలో భారతీయులంతా ఒకటే. మునుపు మనకు శత్రువు విదేశీయుడు కాబట్టి, అంతా ఏకమై వాడిని వెళ్లగొట్టాం. కాని ఇప్పుడు మనలో మనకే అంతః కలహాలు పెరిగిపోయాయి. తప్పు చేస్తున్న వాళ్లూ మనవాళ్లే. గట్టిగా వాళ్లని కేక లెయ్యాలన్నా మనకి కష్టంగా వుంటుంది. కాని త్వరలోనే అన్నీ సర్దుకుంటాయి. మంచికి చావు లేదు. దానికి ఓర్పు ఎక్కువ. భరించినంత కాలం అత్యాచారాల్ని భరిస్తుంది. కాని ఒక్కసారి అది మేలుకుని విజృంభించిందంటే దుష్ట శక్తులన్నీ పరారై పోతాయి. అందుకే శ్రీ కృష్ణ పరమాత్మ" "యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారతా, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్." అని చెప్పారు అందువల్ల త్వరలోనే ప్రజల లోని మంచితనం మేల్కొని దుష్టశక్తుల్ని ఖండి స్తుంది.

"అలాగే ఆశిద్దాం. ఈ పల్లెటూళ్లో నా అనుభ వాన్ని ఎన్నటికీ మర్చిపోలేను పల్లెటూళ్లు అభి వృద్ధి చెందుతున్నాయి. కొత్త కొత్త ఫ్యాక్టరీలూ, హైస్కూళ్లూ, హాస్పిటల్సూ, ఆఫీసులూ వస్తు న్నాయి. కాని ప్రజలలో ఐకమత్యంగా వుండి, అందరం కలిసి సంఘ శ్రేయస్సు కోసం పాటు పడుదామనే ఆలోచన లేదు. ఎవడి స్వార్థం వాడు చూసుకోవాలని తాపత్రయ పడుతున్నాడు. అందరూ బాగుంటేనే తను కూడా బాగుంటానని ఎప్పుడు ప్రతివాడూ గ్రహిస్తాడో, అప్పుడే దేశం బాగు పడుతుంది."

"అవును" అన్నా రాయన తన మెల్లని కన్నులు అతని వైపుంచి.

కొద్దిసేపు ఇద్దరూ మౌనంగా ఆలోచించారు. తరవాత ప్రొఫెసరు గోపాలరావుగారు లేచి, "వెళ్లి వస్తా." నని చెప్పి మెల్లిగా చేతికర్ర వూగించు కుంటూ వెళ్లిపోయారు. ఆయన వెళ్లిన దిక్కే చూస్తూ కుమారస్వామి కొద్దిసేపు పోయాక, జేబులోంచి ఒక కాగితం తీసి చదువుకుంటూ, చిరునవ్వు నవ్వుకున్నాడు. అందులో ఇలా వుంది:

"డియర్ స్వామీ,

ఈ రెండేళ్లనుండీ రామవరంలో వుండి, అవసరమైన వ్యక్తులనందర్నీ కలుసుకుంటూ, నాకు కావలసిన సమాచారం అందిచ్చినందుకు చాలా కృతజ్ఞుణ్ణి. రామదాసుగారి హత్యానేరం చాలావరకూ మన మనుమానిస్తున్న వ్యక్తిపై ధ్రువ పడినట్లే. ఇంక త్వరలో అతన్ని అరెస్టు చేసిన శుభవార్త వింటావు. ప్రాణ స్నేహితుడవైన నువ్వు, నా ఉద్యోగ ధర్మం నిర్వర్తించడంలే కాక, ఒక పరమ దుర్మార్గుడిని శిక్షించడంలో తోడు పడినందుకు నేనెంతో ఆనందిస్తున్నాను. త్వరలోనే కలుసుకుందాం. ఇట్లు, నీ రజాక్"

అది మరొక్కసారి చదువుకుని ఏ వ్యక్తి రామ వరం గ్రామ వాతావరణమంతా కలుషితం చేసి, అతను ఇంక ఆ వాతావరణం నుండి తప్పుకుంటా డనీ, ఇన్నాళ్లూ అక్టోపస్ హస్తాల్లాంటి అతని దుర్వ్యాపారాలతోనూ దురాలోచనలతోనూ ఆవ రింప బడిన రామవరం గ్రామం ఇకముందు అతని ప్రభావం నుండి విముక్తి పొందుతుందని ఆలోచించి సంతృప్తిగా నిట్టూర్పు విడిచాడు.

ఇక మిగిలిందల్లా మంచికి మేలు కొలుపు! 'స్వార్థం' అనే మత్తులో పడివున్న— మంచి— ఒక్కసారిగా కళ్లు తెరచి మేలుకోవాలి: "కౌసల్యా సుప్రజారామా." అనే మేలుకొలుపుతో ఏడు కొండల వెంకటేశ్వరుణ్ణి మేల్కొలపటమే కాక మన హృదయంలోని దైవాన్ని మేలుకొల్పాలి. ప్రతి మానవుని హృదయంలోనూ 'మంచి' అనే అంశతో దాగివున్న దైవాన్ని, మేలు కొలిపి, "ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవిందా, ఉత్తిష్ఠ గరుడధ్వజా ఉత్తిష్ఠ కమలాకాంతా, త్రైలోక్యం మంగళం కురు!" అని సర్వజనులకూ మంగళం కలిగించ మని ప్రార్థించాలి—అనుకున్నాడు కుమారస్వామి.

(సశేషం)

ఏయ్ యుద్ధాల్ని వినిపించాట్లల్లారా



అవి పిచ్చిగొడవాతో బయలుదేరి కాబ్బ్రోస్తోంది. నేనంటే పిన్నికి అంత ఆపేక్ష. నిజంగా అదృష్టం అంటూ ఏదో నన్ను అంటిపెట్టుకుని వున్నది కాబట్టి అమ్మపోయినా, నాన్న స్వరాజ్యం అంటూ, కంగ్రెసు అంటూ దేశం పట్టిపోయినా పిన్ని నన్ను చేరదీసి పెంచింది. పిన్ని లేకపోతే యీపాటికి నే నెక్కడుండేవాడినో? ఏమై పోయ్యేవ డినో.''

''అమ్మాయ్. నువ్వొకసారివెళ్ళి తెలిసిన నాలుగిళ్ళు. చూసిరావే. అప్పుడే ఎలా ముసురుపట్టిందో చూడు ఇంకా చీకటి పడితే ఆవిడ యింటికి రాలేదు గూడాను'' అన్నాడు నాగభూషణం రాజేశ్వరితో.

''ఆవి డెక్కడి కెడుతుంది నాన్నా ? అంత లేనిదయితే అసలు వెళ్ళొద్దని చెప్పరాదూ?'' అంటూ విసుగులో రాజేశ్వరి చేతిలోని పత్రిక ఠపీమని నేలమీద పడేసి లేచింది.

ఇంతలో గేటు తీసుకుని రాధమ్మ రానేవచ్చింది. నాగభూషణం వూహించింది అక్షరాలా నిజం. చలిలో గోధుమపిండి పొట్లంతో ఆవిడ లోపలికొచ్చింది.

నాగభూషణం యాభయ్యోపడిలోపడ్డాడు. కళ్ళ జోడులేందే ఏదీ అతడికి స్పష్టంగా కన్పించదు. అటువంటప్పుడు తల ముగ్గుబుట్ట లాగా తయారై వళ్ళంతా ముడతలుపడుతున్న రాధమ్మ సంగతి ఎందుకు? దగ్గరగావస్తేనేగాని మనుషులను పోల్చుకోలేదు. అట్లాగే ఒకచోటనుండి యింకో చోటికి నెమ్మదిగా వెడుతుంటుంది.

ముసలావిడను చూడగానే రాజేశ్వరి వళ్ళు మండిపోయింది. ఈవిడవల్లేగా తాను తండ్రి చేతులో తిట్లు తిన్నది? ''ఎక్కడికి కెళ్ళావ్? బామ్మా? ఇందాకటినుంచి నాన్న మమ్మల్నందర్ని కేకలు వేస్తున్నారు. అయినా ముసలిదానివి నీ కెందుకు చెప్పు యివన్నీ, ఒక మూల కృష్ణా రామా అంటూ కూర్చోరాదూ?'' అన్నది తీక్షణంగా.

''అమ్మాయ్ ఏం మాటలే అవి? పెద్దవాళ్ళతో అట్లాగేనా మాట్లాడేది? ఎన్నిసార్లు చెప్పాను? పెళ్ళయినదానివి? అక్కడకూడ యిట్లాగే మాట్లాడితే అయినట్టే.....'' అన్నాడు వరండాలో నిల్చున్న నాగభూషణం.

''అంటే అన్నదిలేరా? దాన్ని కేకలేస్తావెందుకు? చిన్నపిల్ల. ఏదో అంటుంటుంది......అమ్మాయ్ సరస్వతీ యీపిండి తీసికెళ్ళి తడపవే''అన్నది రాధమ్మ.

''చిన్నపిల్ల ఏమిటి పిన్నీ. పెళ్ళయింది. ఎట్లా మాట్లాడాలో యింకా తెలుసుకోకపోతే ఎట్లా? వీళ్ళు రాగానేసరా. బుద్ధీ, జ్ఞానం వుండొద్దూ?'' అన్నాడు నాగభూషణం తీక్షణంగా.

''ఛీ ఛీ అసలీ ముసలాళ్ళు వున్న యింట్లో యింతే. సుఖం, శాంతి వుండవు.....'' అంటూ రాజేశ్వరి చరచరా లోపలి కెళ్ళింది.

ఇంతలో సరస్వతివచ్చి అత్తగారి చేతులోంచి పొట్లం అందుకొన్నది.

''నువ్వెప్పుడు యింతేరా నాగూ. దాన్నెందుకట్లా కసురుకొంటావ్? అత్తగారింటి కెళ్లాల్సిన పిల్ల. ఎన్నాళ్ళుంటుం దిక్కడ'' అంటూ రాధమ్మ రాజేశ్వరి వెనకనే లోపలి కెళ్ళింది.

రాధమ్మ కాపురము కొచ్చేటప్పటికి నాగభూషణానికి నిండా నాలుగేళ్ళులేవు. అప్పటిరోజుల్లో అన్నీ సమిష్టి కుటుంబాలే కాబట్టి నాగభూషణం తండ్రి, పినతండ్రి-అంటే-రాధమ్మ మొగుడు—కలిసే వుండేవారు. రాధమ్మకు చిన్నప్పటినుంచి పిల్లలంటే చెప్పలేని మమత. అందుచేత నాగభూషణం రెండావుల దూడ అయ్యాడు. ఆ తరువాత కొద్దికాలానికే తల్లి చనిపోవటం, తండ్రి దేశాలు పట్టిపోవటం, రాధమ్మ దగ్గిరే పెరగటం జరిగిపోయింది. రాధమ్మ మొగుడు రెవిన్యూ డిపార్టుమెంటులో పనిచేస్తూ చచ్చిపోయ్యాడు. ఈయిల్లు, గుడివాడ దగ్గిరో నాలుగు ఎకరాల పొలం సంపాయించాడు. ఇవిగాక బిర్లాకంపెనీల్లో షేర్లు కొన్నాడు. వాటిమీద సంవత్సరానికో వెయ్యి రూపాయలు వస్తాయి.

ఇంత ఆదాయమూ ఎప్పటికప్పుడు నాగభూషణం చేతుల్లో పోసేస్తుంటుంది రాధమ్మ. నాగభూషణమే బలవంతంచేసి ఆవిడకు కొంత డబ్బు యిచ్చి దగ్గిర అట్టే పెట్టుకోమంటాడు. అదంతా ఆవిడేం చేసుకొంటుంది? ఇంటికోసం ఖర్చు చేయటమో, లేకపోతే పిల్లల కేదన్నానో చేయిస్తుంది.

నాగభూషణాన్ని ఎట్లా పువ్వుల్లోపెట్టి పెంచిందో అతడికి పుట్టిబట్టకట్టిన యీ యిద్దరు పిల్లలను గూడ అట్లాగే పువ్వుల్లోపెట్టి పెంచింది.

తనను నానా మాటలూ అని రాజేశ్వరి లోపలి కెళ్ళినా రాధమ్మ మనస్సు తల్లడిల్లిపోయింది. ఆమెను రాజేశ్వరి ఆమె తమ్ముడు మురళి యింతకంటే గూడ యిదివరకు ఎన్నోసార్లు హీనంగాచేసి మాట్లాడారు. కాని మమకారం అనే పొరలోంచి తనకు జరిగే అవమానాలను ఎన్నడూ పట్టించుకోలేదు రాధమ్మ.

మాతృహృదయానికి అవన్నీ సోకవేమో?

తనవెనకాలే బామ్మరావటం చూసి రాజేశ్వరి కన్నీళ్ళు కూడ తెప్పించు కున్నది.

రాధమ్మ వెళ్లి రాజేశ్వరి భుజంమీద చెయ్యేసింది. రాజేశ్వరి విసురుగా చేతిని అవతలికి తోసేసింది. రాధమ్మ ''పిచ్చిపిల్ల''అంటూ మళ్ళీ భుజం పట్టుకుని ''ఎందుకే. నాన్నేమన్నాడని? అంటే మటుకు నాన్నేగా?'' అంటూ సముదాయించటం మొదలు పెట్టింది.

''అంతేలేవే బామ్మా—నేనే అందరికీ లోకువ అయిపోయింది. దగ్గరకొచ్చేసిందిగా వెళ్ళిపోతానులే....'' అంటూ వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టింది రాజేశ్వరి.

రాజేశ్వరి ఏడుపు ఎట్లా మాన్పించాలో రాధమ్మకు బాగా తెలుసు. ఆవిడ అడపా దడపా యిటువంటి బ్రహ్మాస్త్రాలే ప్రయోగించాల్సిన అవసరం కలుగుతుంటుంది. ''వూరుకోవే. మాతల్లివి గదూ! నేచెప్పినప్పుడు ఏడుపు మానెయ్యాలి అంతే. ఇంట్లో ఆడపిల్ల ఏడవరాదు మరి! నీకెందుకు ఈసారి కౌలుడబ్బు రాగానె అడుగు. ఏది కావాలో అది యిస్తాను......''

రాజేశ్వరి ఠపీమని ఏడుపుమానేయలేదు. అయితే అంచెలవారీగా అయిదునిమిషాలలో మానేసింది! ఆతరువాత గోముగా తనకోర్కె బయట పెట్టింది. ''బామ్మా మరే ఆయనేమో మొన్న వచ్చినప్పుడు నన్నొక రిస్టువాచి కొనుక్కోమన్నారు. ఈ రోజుల్లో అందిరూ అదేపెట్టుకొంటున్నారుగా. వంది పెచిలుకు అవుతుంది.. ...మరి......''

''ఓస్, అంతేగా. తీసుకొందువు గానిలే!.....''

* * *

రాధమ్మ చెల్లెలి కొడుకు సుదర్శనం ట్రాన్స్ఫర్ మీద గుంటూరువచ్చి రెండు నెలలయింది. ఈ రెండునెలల్లోనూ అతడు నాలుగు సార్లు విజయవాడ వొచ్చి రాధమ్మను తనతో రమ్మనమని నాలుగు రోజులు తన యింట్లో గడపమని బలవంతం చేశాడు. పుట్టింటివేపు దగ్గిర బంధువంటూ రాధమ్మకు ఎవరేనా వుంటే సుదర్శనం ఒక్కడే. అందుకని రాధమ్మకూడ ఒకసారి చెల్లెలి కొడుకు కాపరం చూసి వద్దామని బయలుదేరి వెళ్ళింది. ఆవిడ యిట్లా యిల్లు కదిలి వెళ్ళి ఎన్నేళ్ళయిందో?

రాధమ్మ వెళ్ళి ఇప్పటికి వారం రోజులైంది. ఇంట్లో ఎవరికీ ఏమీ మార్పు కనిపించటంలేదు. కాని, నాగభూషణం మాత్రం కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతున్నాడు. ''పిన్ని లేకపోతే ఏమీ తోచటం లేదే..... ఆవిడ అక్కడేం చేస్తోందో ఏమిటో.......'' అంటూ పిచ్చెత్తిపోసాగాడు.

''అదేమటండీ, మరీ పసిపిల్లాడిలాగా విలవిల్లాడిపోతున్నారు? ఎవరన్నా వింటే నవ్విపోతారు'' అన్నది సరస్వతి నవ్వుతూ.

''ఏకేం తెలుసేది దాదాపు ఏభై సంవత్సరాల అనుభవం......''

ఇంతలో మురళి యింట్లో కొచ్చాడు. కొడుకుని చూడగానే ''మురళీ మధ్యాహ్నం గుంటూరు వెళ్లి బామ్మను వెంటపెట్టుకురా. ఆ సుదర్శనం రాసిన వుత్తరంలో వాళ్ళయింట అడ్రెసు వుంది. అది జేబులో పెట్టుకొని వెళ్ళు'' అన్నాడు నాగభూషణం.

మధ్యాహ్నం గుంటూరుకు బయలుదేరబోతూ మురళి ఒక ప్రకటన జారీ చేశాడు. ''అసలు నాన్న చెప్పక పోయినా నేనే వెళ్ళిరావాలనుకొంటున్నానే అమ్మా......''

సరస్వతి, రాజేశ్వరి ప్రశ్నార్థకంగా అతడివంక చూశారు.

''అవునమ్మా. బామ్మను యిట్లా వాళ్ళింట్లో వదిలేస్తే యింకేమన్నా వుందీ? వాళ్లేమన్నాకాగితం మీద ఆవిడ సంతకం చేయించుకొన్నారంటే యీయిల్లూ, ఆపొలం, ఆషేర్లు గంగపాలయ్యాయన్నమాటే! ఇన్నాళ్ళూ ఆవిడ ఆస్తి మీద ఆశపెట్టుకుని, చివరికి ఆవిడ యివ్వాళో రేపో గుటుక్కుమనే టప్పుడు మనం అశ్రద్ధ చేస్తే యీనగాచి నక్కలపాలు చేసినట్లు కదూ?......''అన్నాడు మురళి.

''నేనూ అదే అనుకొంటున్నానురా. ఆవిడసలే పిచ్చిది. వాళ్ళ పొగడ్తలకు వుబ్బి ఏ సంతకమన్నా చేసొచ్చిందో యిహ మన పని గోవిందా అన్నమాటే. నాన్నతో చెప్పి ఆయిల్లు కొంచెం రాయించుకోమనవే. అమ్మతో ఎన్ని సార్లు చెప్పినా నామాట చెవినెక్కించుకోలేదు.'' అన్నది రాజేశ్వరి.

సరస్వతి మనస్సులోను అచ్చంగా యివేభావాలు వున్నాయి. అయితే వయస్సు అనుభవంవున్న వ్యక్తి కాబట్టి యింత తేలికగా బయటపెట్ట

# అనుబంధం

లేదు. "నేనూ నాన్నతో చూచాయగా ఎన్నోసార్లు యీమాట చెప్పాను. ఆయన ఒప్పుకొంటేనా? వింటేనే మండిపడుతున్నారు" అన్నది సరస్వతి.

"లాభం లేదమ్మా! నాన్నతో మనందరంకలిసి కట్టిగా చెప్పి ఆవిడ చేత కాగితం మీద సంతకం చేయించేటట్టు చెయ్యాలి. నాన్న ఒక్కమాట అంటే చాలు. ఆవిడ నిముషాలమీద పిలువనూ రాయించి రిజిష్టరు చేయిస్తుంది......" అన్నాడు మురళి.

"అసలు బామ్మే యిదివరకు ఒకటి రెండు సార్లు అంటే నాన్న కేకలేశారు. ఇల్లుమాటఎత్తితే వూరుకోనని! ఏమైనా మనం తొందర పడాలమ్మా ఇల్లంటూ ఏదీలేక ఆవిడ కళ్ళు మూస్తే లక్ష రూపాయల ఆస్తి కోర్టు కెక్కుతుంది..." అన్నది సరస్వతి.

"సరే అదంతా తరువాత సంగతి. ముందు నేను గుంటూరు వెళ్ళాలిగా! అమ్మా నీ దగ్గిర అయిదు రూపాయిలుంటే యివ్వవే" అని మురళి తల్లి నడిగాడు.

"గుంటూరు వెళ్ళిరావటానికి అయిదు రూపాయ లెందుకురా చెవలాయ్? నాదగ్గిరరెండో మూడో వున్నాయి. పట్టికెళ్ళు" అంటూ సరస్వతి గదిలో కొచ్చింది.

తల్లిదగ్గర ఎట్లాగయినా అయిదు రూపాయలు తీసుకోవాలనే కోర్కెతో ఆమెవెంటే మురళికూడ గదిలో కొచ్చాడు...

మురళి గుంటూరొచ్చి సుదర్శనం యిల్లు తెలుసుకొని అక్కడికి చేరుకొనే టప్పటికి సాయంత్రం నాలుగైంది. అతడు యింట్లో అడుగు పెట్టేటప్పటికి వరండాలోంచి రాధమ్మ మాటలు వినిపిస్తున్నాయి. 'కాదురా అబ్బాయి నేను ఎట్లాగైనా యివ్వాళ సాయంత్రం వెళ్ళిపోతాను బస్సెక్కించు. అక్కడ బస్సుదిగి రిక్షా చేసుకొని యింటికి చేరుకొంటాను. నాగుని, పిల్లలను విడిచి యీ మధ్యలో యిన్నిరోజులు ఎక్కడావుండలేదు. పిచ్చెక్కినట్టుగా వుంది. నాకు కోడలూ సరేసరి. పిల్లలిద్దరూ అసలు నన్ను విడిచి వుండలేరు"

సుదర్శనం ఏదో చెప్పబోతున్నాడు. ఇంతలో మురళి లోపలకు రావటం చూసి చెప్పదల్చుకొన్నది నోట్లోనే ఆపి "అడుగో మురళి వచ్చాడు...." అన్నాడు.

ఆమాట వినటంతోటే రాధమ్మ ఒక్కసారిగా మంచంమీద నుంచి లేచింది. "నే చెప్పలేదుట్రా, యీ పిచ్చి సన్నాసికి నన్ను చూడందే అసలు తోచదు..............."

ఆరాత్రికి ఇద్దరూ యిక్కడే భోజనంచెయ్యాలని, మర్నాడు వెళ్ళాలని సుదర్శనం పట్టుపట్టడం చేత మురళికి రాధమ్మకు వుండక తప్పింది కాదు. మరునాడు పొద్దున్నే ఏడు గంటల బస్సుకు బయలుదేరి మునలమ్మా, మనుమడూ విజయవాడ చేరుకున్నారు.

రిక్షా దిగి ఇంట్లోకి అడుగుపెడుతూనే వరండాలో కూర్చుని తండ్రితో ఏదో మాట్లాడుతున్న బావగారిని— రాజేశ్వరి భర్తను చూసి ఆశ్చర్యంతో—

"గుడ్‌మార్నింగ్ బావగారూ! ఎప్పుడురావటం?" అన్నాడు.

రామారావు రాజేశ్వరిని చూసి నవ్వుతూ "బ్రదర్‌యిన్‌లా" అన్నాడు. మురళి వెనకాలే రాధమ్మ వరండాలోకి రాగానే కూర్చున్న కుర్చీ లోంచి లేచాడు. "అమ్మమ్మగారూ కులాసాగా వున్నారా?" అని పలుకరించాడు.

"నాయన రామారావ, నువ్వా? అమ్మా నాన్నగారూ కులాసాగావున్నారా? వస్తున్న వ్యాసయ్యావుటగా? రిజల్ట్సు చూసిన రోజున మా రాజమ్మ కాలుకిందపెట్టలేదనుకో. మేఘాల మీదే నడిచింది. తరువాత పై చదువుకు చదువుతావా?" అన్నది రాధమ్మ.

పిన్నిని చూడగానే నాగభూషణం ముఖం వికసించింది. "ఎం. బి. ఎ. కోర్సు అని ఒకటుందిటే పిన్ని. దానికి అప్లై చేశాడు. సీటు వచ్చిందిట." అన్నాడు నాగభూషణం.

"అట్లాగా. మంచిదినాయనా" అంటూ రాధమ్మ మెల్లిగా లోపలికెళ్ళింది.

ఆ తరువాత అరగంటకే రాజేశ్వరి అసలు సంగతి రాధమ్మదగ్గిర బయట పెట్టింది. "....ఎం.బి.ఎ. సీటు రావటం చాలా కష్టంట బామ్మా. అటువంటిది ఈయన కొచ్చింది. విశాఖపట్నంలోవుండి చదవాలట. నాన్నగారి దగ్గిరేమో డబ్బులేదుట. ఎంతలేదన్నా చదువు పూర్తి అయ్యేటప్పటికి నాలుగైదు వేలన్నా అవుతుంది. అదయినా నన్ను తీసికెళ్ళి పొదుపుగా ఖర్చుపెట్టు కుంటేనేను. కోర్సు పూర్తయితే ఎక్కడపడితే అక్కడ అయిదొందలు జీతంతో వుద్యోగం దొరుకుతుంది. కాని డబ్బుకే చిక్కొచ్చి పడింది. అందుకని నాన్నని అడగటానికొచ్చారు. కోర్సు పూర్తయి ఉద్యోగం రాగానే నెలకు రెండొందల రూపాయలు ఖచ్చితంగా తీర్చేస్తా నంటున్నారు" అన్నదిరాజేశ్వరి.

"అయిదువేలే.... ఇప్పుడు మనదగ్గిరెక్కడున్నాయే?..... అయినా నాన్నేమంటాడు?" అడిగింది రాధమ్మ.

అప్పుడే అక్కడి కొచ్చిన సరస్వతి అత్తగారి చివరి మాటలు విన్నది. "ఆయనేమంటారు అత్తయ్యా? కోర్సు చాలా మంచిదేనట. ఎటు తిరిగి డబ్బు సంగతే ఏమిటని దిగులు పడుతున్నారు.."

"నువ్వు వూరుకుంటేనే గాని పని జరగదు బామ్మా. ఏం బామ్మా యీ ఒక్క సహాయం చేయవూ ?.........."

"సరే చూద్దాంలే. నాన్నతో మాట్లాడుతానుగా" అంటూ హామీ యిచ్చింది రాధమ్మ.

ఆమధ్యాహ్నం రామారావు వరండాలో మంచం మీదపడుకొని మురళి చెబుతున్న కబుర్లేవో వింటున్నాడు. ఇంక కార్యం జరగలేదు. కాబట్టి రాజేశ్వరి అందరి యెదుటా మొగుడితో మాట్లాడదు. ఆమె గడప యివతల కూర్చుని ఏదో పత్రిక తిరగేస్తూ ఆకబుర్లు వింటోంది.

నాగభూషణం అల్లుడొచ్చాడని ఆఫీసుకు సెలవుపెట్టి ఇంట్లోనే వున్నాడు.

"ఏం. అబ్బాయ్. అల్లుడేదో డబ్బు కావాలని అడిగాడటగా? ఏమాలోచించావ్ మరి ?" అని అడిగింది రాధమ్మ కొడుకుని.

"ఆలోచించటానికేముంది పిన్ని. ఇప్పుడు డబ్బెక్కడుంది! కోర్సయితే చాలా మంచిది. అసలు సీటు రావటమే కష్టం...ఇది పూర్తయితే హీనపక్షం అయిదొందల వుద్యోగం ఎక్కడున్నా దొరుకుతుంది.

# అనుబంధం

యిచ్చాను రాజేశ్వరికి యిచ్చి కాపురానికి పంపించాని రాధమ్మ ఆశ. రాజేశ్వరి ఆ చీర కట్టుకోక పోయినా దగ్గర పెట్టుకొంటే శుభం జరుగుతుందని రాధమ్మ భావం. అందుకని పెట్టె తీసి ఆచీర బయటకు తీసింది........

ఇంతలో మధ్యహాలులోంచి మాటలు వినిపించ సాగాయి.

"మీ బామ్మఏది? ఎక్కడకెళ్ళింది?" అని రామారావు రాజేశ్వరిని అడిగాడు.

"ఏమో? ఎక్కడికెళ్ళిందో ఇప్పుడెందుకు?....."

"అదేమిటే ఆవిడలేకుండా వెళ్ళటం ఎటా ?... .

"ఆవిడెందుకుండీ ఎదురుగా, వెధవముండ శుభమా అని వెడుతుంటే ఎదురుగా రావాలా?" అన్నది రాజేశ్వరి.

పెళ్ళాం మాటలకు రామారావు తెల్లబోయాడు. "ఛీ ఏంమాటలే అవి. ఆవిడే ఆసహాయం చేయక పోతే........"

"మహ చేసిందిలెండి. అసలు యీ ఆస్తి అంతా నెత్తిన కొట్టకుంటుందా, కట్టుకెళుతుందా? తెప్పకేం చేస్తుంది. మర్యాదగా యివ్వకపోతే బలవంతంగా లాక్కుంటాము. మీకు తెలియదేమోగాని అసలు నాన్న అడ్డంపడకపోతే యీ ఆస్తి అవతల వాళ్ళ చెల్లెలు కొడుకులు ఎప్పుడో స్వాహా చేసివుండేవారు. తెలుసా?......"

రాజేశ్వరిమాటలు వినలేకనా అన్నట్టుగా రామారావు అక్కడనుండి వరండాలో కెళ్ళాడు.

అక్కడ రాజేశ్వరి, మురళి మిగిలారు. ఇంతలో సరస్వతికూడా అక్కడకొచ్చింది.

"నువ్వు యిహ వూరుకొంటే లాభంలేదమ్మా. ముసలావిడచేత నాన్న విల్లు రాయించుకొనేటట్లు నువ్వే చెయ్యాలి. నాన్న ఒకపట్టాన వినరనుకో. అయినా వూరుకుంటే ఆవిడ గుటుక్కుమంటే రేపొద్దున యీ ఆస్తికోసరం కోర్టుకెక్కుతూ తిరగాలి..... ఏరా నువ్వుకూడ నాన్నతో వీల్లైనప్పుడల్లా చూసి యుగి చెబుతుండరా" అని రాజేశ్వరి అమ్మకిటమ్ముడికీ సలహాలు యిచ్చింది.

"నేనూ అదే లోచిస్తున్నానే. వెధవది. ఎప్పుడేమవుతుందో చెప్పలేం. ఏదో నెపం మీద ఆవిడను ఆ సుదర్శనం తీసుకువెళ్ళి ఏ దస్తావేజుమీదన్నా సంతకం చేయించుకొన్నా చేయించుకొంటాడు. అందుకే వాడు యీ మధ్య మాటిమాటికీ రావటం సాగిస్తున్నాడు. నీ కెందుకు నేను నాన్నతో చెబుతానుగా. అంతగా ఆయన వినకపోతే ఆవిడ తదనంతరమే మనకు చెందేటట్టు రాయించుకోమనన్నా గట్టిగా పోరతాను" అంటూ హామీ యిచ్చింది సరస్వతి.

"నేనూ వూరుకోనులేవే అక్కా. నాన్నతో చెబుతాగా" అన్నాడు మురళి.

"ఆ దిక్కుమాలిన చీర ఒకటి యిస్తుందిట నాకు. ఆవిడెప్పుడో కట్టుకొన్నదట. అది నేను తీసుకుపోవాలట. ఆవిడలాగానే పిల్లలు లేకుండా నేను ముండమోయ్యాలనుకొంటుందో ఏమో? నేను చస్తే ఆచీర తీసుకెళ్ళనమ్మా యిప్పుడే చెబుతున్నాను. ఆవిడెక్కడికి కెళ్ళిందో రాగానే ఆ చీర తీసియిస్తుంది. ఎట్లాగైనా వెళ్ళేటప్పుడు యిక్కడే వదిలి వెళతాను, ఏ పాతబట్టలవాడికో

ఇచ్చేసెయ్ అమ్మా" అన్నది రాజేశ్వరి.

"సరే చూద్దాంలే. పద. అదిగో నాన్నగారొచ్చి నట్టున్నారు"

సామానుల గదిలో కూర్చున్న రాధమ్మకు ప్రపంచం అంతా అంధకారమయమైనట్టుగానూ, యిక తాను జీవించటం కేవలం నిష్ప్రయోజనంగానూ కనిపించింది. చేతిలో చీరతో అట్లాగే పిచ్చెదరుగా నిశ్చేష్టితయై కూర్చుంది.....

* * *

ఆ తరువాత పదిహేనురోజులనాటి సంగతి.

గవర్నరుపేటలో ఉత్తరహిందూస్థానం యాత్రా బస్సు బయలుదేరటానికి సిద్ధంగావుంది. రాధమ్మ బస్సులోఎక్కికూర్చుంది. కిటికీకి యివతల ఫుట్‌పాత్‌మీద నాగభూషణం, సరస్వతి, మురళి నిల్చుని వున్నారు. నాగభూషణం కళ్ళు చెమ్మగిల్లివున్నాయి. ఎంత ప్రయత్నం చేస్తున్నా కన్నీళ్ళు ఆపుకోలేక పోతున్నాడు.

"ఈ వయస్సులోవెళ్ళి ఆ ఆశ్రమంలోవుంటావా పిన్నీ. నేను చచ్చిపోయ్యానా? నేను నీకు—ఏం ద్రోహం చేశాను?" అన్నాడు. నాగభూషణం బొంగురు గొంతుతో. అతడు యిట్లా అనటం యిప్పటికి యిది మూటడెబ్బయి మూడోసారి.

ఋషికేష్‌కువెళ్ళి శేషజీవితం గడపాలని రాధమ్మ రాజేశ్వరి అత్తగారింటి కెళ్ళిన రెండోరోజున నిశ్చయించుకొన్నది. ఆ నిశ్చయం ఎందుకు చేసుకొందో యింట్లో ఎవరికీ తెలీదు. ఆమె నిర్ణయాన్ని ఎవ్వరూ ఎంత ప్రయత్నించినా మార్చలేకపోయ్యారు. తను తప్పు ఏదన్నావుంటే చెప్పమని నాగభూషణం, సరస్వతి, మురళి అడిగారు. ఎవరికీ ఆమె ఏదీ చెప్పలేదు. ఆస్తినంతా తన తదనంతరం నాగభూషణానికి చెందేట్టురాసి రిజిష్టరు చేయించింది. ఋషికేష్ ఆశ్రమానికి నెలనెలా తన పేరున ఓ ముప్పయి రూపాయలు మనీఆర్డరు చేయమని నాగభూషణానికి చెప్పింది.

సరస్వతి కళ్ళవెంట నీళ్ళు ప్రవాహంగా కారిపోతోంది. పద్నాలుగేళ్ళ వయస్సులో ఆమె కాపురాని కొచ్చింది. మొదటి నాలుగేళ్ళూ రాధమ్మ కొంగు పట్టుకొని "అత్తయ్యా, అత్తయ్యా" అంటూ గడిపింది. "ఇప్పటికైనా దిగి వచ్చెయ్యండి. అత్తయ్య మీరు లేకపోతే....." అంతకంటే ఎక్కువగా మాట్లాడలేకపోయింది సరస్వతి.

"ఛా వూరుకోవే...." రాధమ్మ హృదయం శిలగా మారిపోయింది. ఆ సాయంత్రం సంఘటన తరువాత ఇహ అది కరగదు.

యాత్రా బస్సు బయలుదేరే సమయమైంది. నెమ్మదిగా కదిలింది. బస్సు కదలికతోబాటు నాగభూషణం హృదయంలోని దుఃఖంగూడ కట్టలు తెంచుకొన్నది. "పిన్నీ, వుంటాపిన్నీ, ఉత్తరంఅయినా రాస్తుంటావా ?...." అంతే! అంతకంటే ఎక్కువ మాట్లాడలేకపోయ్యాడు. ఉత్తరీయం నోట్లో పెట్టుకొని ఏడుపు ఆపుకొంటున్నాడు.

"నాన్నా, నాగూ, నీ ఆరోగ్యం జాగ్రత్త. కొలుదబ్బు అదీ సరిగా కట్టమని రెడ్డికి గట్టిగా చెప్పాలి....." అంతకంటే రాధమ్మ నోట్లోంచి మాటలు పెగల్లేదు...

**ఒకటూ, రెండా—యాభై సంవత్సరాల అనుబంధం ఆ తల్లి కొడుకులది!**

# పుస్తకాలు

## వినిపించని స్వరాలు

రచన: శ్రీ ఇనుకపల్లి లక్ష్మీనరసింహ శాస్త్రి; క్రౌన్ ⅛ సైజు 154 పేజీలు వెల: రు. 3/—లు ప్రకాశకులు: రవిప్రకాశ్ పబ్లికేషన్స్ అండ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, చిక్కడపల్లి మెయిన్ రోడ్, హైదరాబాదు—20.

ఈసంపుటిలో మొట్టమొదట కనిపించే కథ 'వినిపించని స్వరాలు'. అనాధ శకుంతల రంగనాథం పంచచేరుకుంది. "నన్నేమి అడగకండి. నేను ఒక అభాగ్యురాలను," అనే మాటలు తప్పితే ఆమె కథ ఇంకేం తెలియదు. రంగనాథం అతని సతి శాంతమ్మా, వాళ్ళమ్మాయి సావిత్రి కాపరాన్ని గురించి బాధపడుతూ వుంటారు. ఇది మినహా సావిత్రి సంగతి మరేం తెలియదు.

చివరికి సావిత్రి, శకుంతలా ఒకవ్యారి వాళ్ళవుతారు. "మీ సావిత్రిఇంకలేదు. బాధపడలేక ఆత్మహత్య చేసుకుంది" అని చెబుతుంది శకుంతల. "సావిత్రి చచ్చిపోలేదు, నువ్వేసావిత్రివి" అంటూ రంగనాథం దంపతులు శకుంతలని చేరదీస్తారు. ఈ విధంగా ప్రతి కథలోనూ ఏదో ఒక బాధ, బాధ గాధ చదువరికి ఎదురవుతాయి.

మేనమామను పెళ్ళిన మధు కథ రెండోది. జీవితకాలంలోనే కొడుకు వల్ల యమయాతన అనుభవించిన రామశాస్త్రి దంపతుల కథ'పున్నామ నరకం'. పెద్దదిక్కు అయిన 'మామ్మ' రుణం తీర్చుకున్న శ్రీపతి—మాలతులకథ తరువాతిది. 'ఆఖరి కోరిక'లోరవి చరిత్ర ఎన్.జి. ఒ. ల జీవితానికి ఒక మచ్చుతునక.

"చంద్రకాంత" అప్సర. ఆమెను ఎందరో వలచారు, ప్రేమించారు. కాని, ఆమె ప్రేమిస్తేగా!— తీరా ఆమె పెళ్ళికి సిద్ధపడే సరికి ఒక్కరూ ముందుకు రాలేదు. 'తప్పటడుగు'లో వసంత, మధుల మనస్తత్వాలు మనోహరంగా చిత్రితమయ్యాయి. 'అనపిల్ల' కథలో మూడు తరాలవాళ్ళ అచారాల్లు, రెండు పెళ్ళిళ్ళు, అచపకాలు, కావలసినన్ని కన్నీళ్ళు వలభైతొమ్మిది పేజీలు నింపాయి.

ఆత్మస్వరూపం, ఎల్లోరా సుందరి, పెళ్ళి కావాలి—ఈమూడూ సూక్ష్మంతో [illegible]

వల్లి, సుజాత, మధు, శాంతమ్మ, సావని—వంటి పేర్లు ఎన్నోకథల్లో మళ్లీమళ్లీ రావటం బాగా లేదు. లెక్కకు మీరిన పాత్రలను కథలో ప్రవేశపెట్టడంతో ఎవరు ఎవరికి ఏమవుతారో చప్పున స్ఫురించదు. పదకొండు కథల ఈసంపుటిలో సందర్భశుద్ధి ఎంతవరకు పాటింపబడింది. అనే దానికి ఒకమచ్చు— (112 వ పేజి.) వల్లి అత్తవారిల్లు. తల్లి శాంతమ్మ వచ్చే సరికి వల్లి సరితతో కబుర్లు చెప్పుకుంటూ వుంది. (119 వ పేజి.) వల్లి పుట్టిల్లు. 'సరిత వాళ్లింటికి వెళ్లివస్తానే' అంటూ వల్లి పక్కింటి వాళ్లింటికి వెళ్లింది. సరిత— వల్లి అత్తింటా, పుట్టింటా కూడా మనకి ఎలా తారసపడుతుంది అని.

లోగడ పత్రికల్లో పడిన ఈకథలను పుస్తకంగా కూర్చేముందు ఒక్కసారి రివైజు చేసివుంటే ఎంత బాగుండేది.

## పట్టాలు తప్పిన బండి

నాటకం, శ్రీ రావికొండలరావు రచన, క్రౌన్ ⅛ సైజు 130 పేజీలు వెల: రు. 2—50 ప్రచురణ: నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

"ఇలారా— నా కళ్ళలోకి చూడు. ఏం కనిపిస్తున్నాయి నీకు?— నా ఇద్దరు పిల్లలూ నా చెరో కంటోన్లూ కనిపించడం లేదూ?— వాళ్ళు తల్లి లేని పిల్లలు. నా అబ్బాయికి అమ్మ తెలుసును కాని హేమ?— దానికా ప్రాప్తం లేదు."

ఇదేం స్వగతం కాదు— నారాయణ మూర్తి గతం.

భార్య కాలం చెయ్యగా, ఇద్దరు బిడ్డలు— హేమ, సీతారామారావులను అతి గారాబంగా పెంచుతూ కాలక్షేపం చేస్తున్నాడు నారాయణమూర్తి— నాటకంతో ఇంటి యజమాని.

ముద్దు ఎక్కువై, హేమ వెర్రిబాగులదయింది. సీతారామారావు ప్రేమాయణంతో పడ్డాడు. అడిగినప్పుడల్లా కొడిక్కి డబ్బు చేస్తూ తండ్రి అప్పులపాలయ్యాడు. —ఇలా పట్టాలు తప్పుతున్న నారాయణ మూర్తిని పూర్తిగా రైలు తప్పించేస్తారు— దూరపు బంధువు రామచంద్రయ్యా, పక్కింటి లక్ష్మీపతిన్ని.

సీతారామారావు ప్రేమా పెళ్ళి 'జగమే మాయ!' అవుతాయి. ఆస్తిపాస్తులు కాస్తా రామచంద్రయ్య స్వాహా చేస్తాడు. అక్కుపక్షి అయిపోతాడు నారాయణ మూర్తి.

అంతవరకూ తమాషాగా ప్రేక్షకుల్ని నవ్విస్తూ వచ్చిన రోమియో— మోహన్ కుమార్ ఒక్కసారిగా రంగంలోకి దూకుతాడు. నారాయణ మూర్తికి అభయమిస్తాడు—ఆదుకుంటాడు— వెర్రిబాగుల హేమను కట్టుకుంటాడు!—

కొన్ని నాటకాలు చూస్తేనే బాగుంటాయి. కొన్ని వింటే సొంపుగా వుంటాయి. కొన్ని చదువుకుంటికి ఇంపుగా వుంటాయి.

ఈనాటకం—

ప్రదర్శించినప్పుడు చూట్టానికేకాదు చదవటానికీ, ఎవరేనా చదువుతూంటే వినటానికీ కూడా కుతూహలంగా ఉంది.

—శివకుమారి







సినిమాల్లో హీరో ఎన్ని వేషాలు మార్చినా ప్రేక్షకులు వెంటనే గుర్తిస్తారు. కని, విలన్ గుర్తించి లేడెందుకు?

— యన్. వెంకటేశ్వర్లు, గుంటూరు.

**విలన్ ప్రేక్షకుడు కాదు కాబట్టి.**

పరీక్షలు దగ్గిర కొస్తున్నాయి. నిద్ర రాకుండా చిట్కా చెబుదురూ?

కె. యన్. శాస్త్రి, గుంటూరు.



**చిట్కా మీద ఆధార పడితే జట్కాయే! నిద్రాహారాలు మానేసి శ్రద్ధగా రాత్రింబవళ్ళు కష్టపడి చదువు బదరా! పాసవ్వడం గ్యారెంటీ!**

వాస్తవానికి దూరంగావున్న చిత్రాలె శత దినోత్సవాలు చేసుకొంటున్నాయి. కరణం ఏమిటి?

— బి. పుష్పలీల, హన్మకొండ.

**ఆర్థిక విజయానికి దగ్గరగా వున్నవి కాబట్టి.**

ఈ శీర్షికకు మీరే స్వయంగా జవాబు లిస్తున్నారని, మీ కింత తీరుబడి వుంటుందని నాకు నమ్మకం కలగడం లేదు, ఎందుకు?

— డి. కమల, బరంపురం.

**తీరుబడి లేని మాట వాస్తవమే! అయినా స్వయంగా జవాబు లిస్తున్నాను. ఎందుకంటే మీ అందరి సందేహాలు తీర్చడం కూడా ఒక అనుభవమే!**

మీ జీవిత ధ్యేయం ఏమిటి?

వై. వి. సుబ్బారావు, జబల్‌పూరు.

**మంచికోసం బ్రతకడం, మంచి గానే చావడం.**

సినిమారంగంపై మీ అభిప్రాయం?

— పి. ఎల్. సూర్యనారాయణ, నరసాపురం.

**సినిమాలు చూసే ప్రజలు బాగా గెడన బారారు. తేలికగా యిప్పుడేవి ఒప్పుకోవటం లేదు. దీనిని గమనించి ప్రేక్షకుల్ని మెప్పించడానికి ప్రొడ్యూసర్లు యింకా గెడన బారాలని నా అభిప్రాయం.**

మీరు ఏ పార్టీ?

— జి. లక్ష్మణమూర్తి, గుంటూరు.

**'హోమ్' పార్టి, 'స్టుడియో' పార్టి, ఆనందంగా 'టీ పార్టి'.**

మీరు జీవితంలో ఏం సాధించ గలిగారు?

— కె. భారతి, బాపట్ల.

**యింకా ఆదిలోనే వున్నాను. ఏం సాధిస్తానో నాకే తెలియక గందరగోళంగా వుంది.**

హీరోయిన్ "ఏడవని" తెలుగు చిత్రం ఏదయినా ఉన్నదా?

— ఎం. వీరభద్రరావు, సేలం.




**అదేమో నాకు తెలియదు. ఏ పిక్చరులో కూడా హీరోయిన్ ఏడవదు. చక్కగా గ్లిజరిన్ వేసుకుని తన నటనా శక్తితో ప్రేక్షకుల్ని ఏడిపిస్తుంది.**

సినిమాల్లో హీరోయిన్- హీరోను తప్ప విలన్‌ని పెళ్లి చేసుకోదు, ఎందుకు?

— కె. రమాదేవి, ప్రొద్దుటూరు.

**"చూస్తూ చూస్తూ పులినోట్లో తలదూర్చమంటారా?" అందుకు!**

మీరు భార్యా విధేయులా?

— పి. లక్ష్మి, రాజమండ్రి.

**లేదు! అందరికీ విధేయుణ్ణి.**

పాత సినిమాలే మంచివని కొందరు ఎందుకంటారండీ?

—ఎం. నాగేశ్వరరావు, పార్వతీపురం.

**ఆ మాట నిజమే! అప్పటి చిత్రాలు వాస్తవ జీవితాలకి దగ్గరగా యుండేవి. యిప్పుడు కొన్ని చిత్రాలు కేవలం డబ్బుకోసమే చిత్రీకరింపబడుతున్నయ్!**

మీరు ఎన్ని చిత్రాలలో నటించారు? అందులో మీ మొదటి చిత్రం ఏది?

—ఎం. వెంకట్రావు, చంపా.

**దాదాపు 150- మొదటి చిత్రం "మాయాలోకం."**

సీరియల్ నవలలు ప్రచురించినట్లు సీరియల్స్‌గా చిత్రాలు ఎందుకు తీయకూడదు?

—యం. సూర్యకాంతం, శ్రీకాకుళం.

**యీ ఐడియా రాహులంటే యింకా కొంత టైమ్ పడ్తుంది.**

ఇటీవల విడుదల అవుతున్న ప్రతి చిత్రంలోను తారలు జాకెట్లు వేసుకోవడం లేదు, ఎందుకు?

— బి. వి. రత్నం, వాల్తేరు.



**శివ! శివా! ఎంతమాట! పాపం శాంతించుగాక. యీ నైలెక్సు గుడ్డలు వచ్చిన తర్వాత జాకెట్లు వున్నాయో? లేవో? అని తెలిసికోవడం కూడా చాల కష్టంగా వుంది.**

## బహుమతిపొందిన ప్రశ్న

ఏడుపుతో ప్రారంభించే జీవితాన్ని నవ్వుతూ బ్రతకాలని వాంఛిస్తారు ఎందుకండీ?

—ఇబ్రహీమ్‌ఖాన్, రేపల్లె.



**జీవితం ప్రారంభం ఏడుపుతో, జీవితం అంతమయ్యేది ఏడుపుతో, దానికీ దీనికీ వున్న మధ్య జీవితంలో నవ్వక- ఏడిస్తే బ్రతుకెందుకు?**

---

మీరు వృద్ధులై సినిమారంగం విడిచిన తర్వాత మీ జీవితం గురించి ఏం ఆలోచిస్తారు?

—యస్. జయరామిరెడ్డి, తాడిపత్రి.

**జీవితం గురించి ఆలోచించేదేదో యిప్పుడే గట్టిగా, దిట్టంగా, పట్టుదలగా ఆలోచిస్తున్నాను. వృద్ధుణ్ణి అయిన తర్వాత నా గురించి యింకొకర్ని ఆలోచించమంటాను. మీరేమంటారు?—**

ప్రేమ గుడ్డిది అని తెలిసికూడా ప్రతి నిమాని ప్రేమతో మొదలు పెడతారు, ఎందుకు?

—పురిణి రేవతి, గూడూరు.

**గుడ్డితనమెలా వస్తుందో తెలుసుకోడానికి!**

ప్రస్తుతం రాజకీయ, మత, వైజ్ఞానిక సమస్యలతో నిండివున్న మన దేశంలో— సినీలోకంలో మాత్రం నటీనటులెవరూ నిరాహారదీక్ష పూనినట్లు లేదు, ఎందుకో చెప్తారా?

— టి. మాధవరావు, నరసరావుపేట.

**కఠా తపస్సు చేస్తూ! శరీర భారాన్ని తగ్గించుకొని అందంగా వుండటానికి తారలు 'డైట్' చేస్తున్నారు. యిదికూడా ఒక విధంగా నిరాహార దీక్షే!**

సినిమాల్లో హీరోను ఎప్పుడూ ఒక డాక్టరుగానో, లాయరుగానో, జమీందారుగానో చిత్రీకరిస్తారే కాని, ఒక రాజకీయ నాయకునిగా సృష్టించి దేశసేవ చేస్తున్నట్లుగా తీయరు, ఎందుకు?

—కె. సరోజలక్ష్మి, కారంపూడి.

**ఎక్కువ రాజకీయాలంటే మాకు తలనొప్పి. ఆ తలనొప్పి మీకందించి 'అమృతాంజనం' ఖర్చు పెట్టించడ మెందుకు?**

మీకు బాగా నచ్చిన పాత్ర ఏది?

— యస్. ఆదినారాయణ, రాణీనూతల.



**'లేత మనసులు' చిత్రంలోని "సుందరం" మామ.**

సినీరంగంలో ప్రవేశించి చిప్ప చేతబట్టిన మహానుభావు లెవరైనా వున్నారా, మహాశయా?

—యస్. ఉదయశంకర్, విజయవాడ.




**ఎంతోమంది వున్నారు మహాశయా!**

పోలీసువారు సమ్మె చేస్తే ఎలా వుంటుందండీ?
—డి. కె. శ్రీధర్, అనంతపూర్.




తప్పులు చెయ్యనివారికి కష్టంగా, తప్పులు చేసేవారికి సుఖంగా వుంటుంది.

మన తెలుగు తారల్లో చాలామంది "మేము ఇంగ్లీషు, హిందీ, తమిళ చిత్రాలనే చూస్తూంటాము, మా తీరిక వేళల్లో" అంటూంటారు. మరి వారు తెలుగు చిత్రాలు చూడకపోవటానికి కారణం ఏమిటి?
—కె. రామారావు, హైదరాబాద్.

ఎందుకు? తీరిక లేకుండా చిత్రాల్లో నటిస్తూ, ఒకే లోకంలో వుంటున్నారు. కనీసం "తీరిక సమయంలో నైనా యింకో లోకంను చూచి ఆనందం పొందుతున్నామని" మీతో అంటున్నారు.

మా శ్రీమతి చేతివంట తింటే నతి పోతుంది మా చేతివంట బ్రహ్మాండమని "లేత మనసులు" ద్వారా తెలుసుకున్నాను. మీ దగ్గరకు శిష్యరికానికి వద్దామనుకుంటున్నాను రమ్మంటారా!
—బి. మోహన్‌రావ్, శ్రీకాకుళం

శిష్యరికమెందుకు? కాఫీ హోటల్ పెట్టిన తర్వాత, కాకితో కబురంపుతాను. వచ్చి కమ్మగా తినండి.

మీరు ఒకవేళ స్త్రీగా పుట్టివుంటే యీ సినిమారంగంలోకి ప్రవేశించేవారా? ప్రవేశించినా హీరోయిన్‌గానా? లేక కమెడీ పిక్చర్స్ గానా?
—వై. హరిప్రసాద్, వరిగుంటపాడు.

దానికి సమాధానం నా చిత్రాలు చూచి మీరే నిర్ణయించండి... ఏ. వి. ఎం వారి "అవేకళ్ళు", విజయా వారి "ఉమాచండీ గౌరీ శంకరుల కథ".

ఎలక్షను సీజన్ వచ్చేసరికి రోడ్లు మొదలైనవి చాలా శుభ్రంగా వుంచుతుంది కదా మన కాంగ్రెసు ప్రభుత్వం, ప్రతి ఏడాదీ ఎలక్షన్స్ జరిగేటట్లు చేస్తే ప్రజలకు సౌకర్యంగా వుంటుందని ప్రభుత్వానికి సలహా యిద్దామా? మీ అభిప్రాయం?
—పి. సి. కోటయ్య, అంగేవిపేట




ఆలశ్యమెందుకు తప్పకుండా!

సార్, మా బామ్మ నన్ను ఒకసారి 'మగాడివి నీకెందుకురా సిగ్గు?' అని అడిగేది. ఇంకోసారి 'ఏరా, నీకీ మధ్య బొత్తిగా సిగ్గు లేకుండా పోయింది' అని అడుగుతోంది. అలా ఎందుకంటుందంటారు?
— బి. శ్రీనివాసరావు, అనకాపల్లి

మీ బామ్మకు కోపం వచ్చేటట్లు ఒకసారి మొగాడిలా! ఒకసారి ఆడదానిలా నటిస్తున్నారేమో? ●

పద్మనాభం



'విరాత్రి 12 గంటలు'లో సుకన్య, పద్మజ, జయకృష్ణ.

పాలగుమ్మి పద్మరాజు, సంగీతం: రాజన్ నాగేంద్ర, కెమెరా: చంద్రు, దర్శకుడు హనుమ్సాని కృష్ణమూర్తి, నిర్మాత: వి.వి. రావ్, నిర్వహణ: యస్. భావనారాయణ.

* * *

శ్రీ లక్ష్మీనారాయణ ప్రొడక్షన్స్‌వారి "చిక్కడు—దొరకడు"లో యన్. టి. రామారావు, కాంతారావు, జయలలిత, కృష్ణకుమారి, విజయలలిత, బాలకృష్ణ ముఖ్య పాత్రధారులు. రచన: వీటూరి, సంగీతం: టి. వి. రాజు, కెమెరా: హెచ్. ఎస్. వేణు, దర్శకుడు విఠలాచార్య, నిర్మాతలు: పొట్లూరి



'కంచుకోట'లో దేవిక.



'నిర్దోషి'లో పద్మనాభం, గీతాంజలి.

వెంకట నారాయణరావు, కుదరవల్లి సీతారామయ్య. ఈ చిత్రం మొదటి షూటింగ్ షెడ్యూలులో యన్. టి. రామారావు, విజయలలితపై ఒకపాట—కొన్ని పోరాట దృశ్యాలు రామారావు తదితరులతో చిత్రీకరించారు.

* * *

టైగర్ ప్రొడక్షన్స్‌వారి మూడవ చిత్రంలో కృష్ణ, కె. ఆర్. విజయ ముఖ్య పాత్రధారులు సంధ్యారాణి, వాణిశ్రీ, శశికళ, కలం, రావికొండలరావు, కనకం,



''ముక్కుకిరీటము''లో శాంతి.



"తంచుకోట' లో దేవిక.

# చిత్రలహరి

రాజశ్రీ, రామ్మోహన్, రాజ్ బాబు, చదలవాడ ముఖ్యతారాగణం. ఈ చిత్ర ప్రారంభానికి ప్రసిద్ధ హిందీ, తమిళ చిత్రాల దర్శకుడు శ్రీ ఏ. భీమ్‌సింగ్ కెమెరా స్విచ్ ఆన్ చేశారు. మొదటిషాట్ వెంకటేశ్వరస్వామిపై తీశారు.. యస్. వి. రంగారావు ద్విపాత్రాభినయం యీచిత్రంలో విశేషాంశం. పటుత్వమైన కథ, మాటలు ప్రసాద్‌రాసిన యీ మ్యూజికల్ మిస్టరీకి యస్. రాజేశ్వరరావు— ఆయన తనయుడు యస్. రామలింగేశ్వరరావు కలసి తొలిసారిగా సంగీతం సమకూర్చుతున్నారు. కెమెరా: యస్. యస్ లాల్, దర్శకుడు: కె. శ్రీనివాసరావు నిర్మాణ నిర్వహణ: 'చిత్ర' నరసింహారావు, నిర్మాత, వి. రామారావు. న్యూటోన్ స్టూడియోలో యీచిత్రం శీఘ్రగతిన నిర్మింపబడుతున్నది.

* * *

ఆనంతలక్ష్మి ప్రొడక్షన్స్ వారు రస వత్తరంగా రూపొందిస్తున్న "కాంభోజ రాజా కథ" చిత్రానికిగాను గతవారం ఒక పోటీ నృత్యాన్ని చిత్రీకరించారు. "ఏదీ యిక మానరీ......ఈ మంజుల మంజుల మధురగానముల మురిపించ మహిత మయూరి నృత్యముల... ఏదీ" అనే యీ పోటీ నృత్య సంగీతాన్ని కొసరాజు రాశారు. రాజశ్రీ వాణిశ్రీ, యల్. విజయలక్ష్మిల మధ్య జరిగింది యీ నృత్యపు పోటీ. వాహినిలోని ఏడవ ఫ్లోర్‌లో ప్రస్తుతం యీ చిత్రం షూటింగు కొనసాగు తున్నది. శోభన్ బాబు, గుమ్మడి, అంజలీదేవి, బాలయ్య రాజ్‌బాబు, చలం, బాలకృష్ణ ఇతర ముఖ్య తారాగణం, రచన ఆట్నూరి పిచ్చేశ్వరరావు, పినిసెట్టి, సంగీతం టి. వి. రాజు, కెమెరా. యస్. వెంకటరత్నం,

టి. జి. కమలాదేవి, ఉదయలక్ష్మి ఇతర ముఖ్య తారాగణం. మొదటిషాట్ కథా-నాయకుడు కృష్ణమీదతీశారు. రచన: ఆరుద్ర, సంగీతం: టి. చలపతిరావు, కళ: రాజేంద్ర కుమార్, కూర్పు: ఎన్. ఎస్. ప్రకాశం, కెమెరా: వి. యస్. ఆర్.స్వామి, సహాయ దర్శకులు: అప్పలాచార్య, డి. బి. కృష్ణ వాదరి, దర్శకుడు: వి. రామచంద్రరావు బి. ఏ.(ఆనర్స్,) నిర్మాతలు: నెల్లూరి కాంతారావు పహిల్వాన్. ఎస్. హెచ్. హుసేన్. ఈ చిత్రానికి సంబంధించిన రెండు పాటలు యింతవరకు రికార్డు చేశారు. ఒకటి 'వెళ్ళ గలిగితే వెళ్ళు', అనేది, ఆరుద్ర రచన. ఘంటసాల పాడారు. రెండవది యుగళగీతం "ఇలా ఇలా వుంటుందని" అనేది. సి. నారాయణరెడ్డి రచన, పి. సుశీల, పి. బి. శ్రీనివాస్ పాడారు. మొదటిది కృష్ణమీదా రెండవది కృష్ణ, కె. ఆర్. విజయలపైనా చిత్రీకరిస్తారు.

* * *

డి. ఆర్. ఫిలిప్స్ వారి మ్యూజికల్ మిస్టరీచిత్రంలో యస్.వి.రంగారావు కృష్ణ,



"చదరంగం" లో హరనాథ్, జమున.



"కంచుకోట"లో యన్. టి. రామారావు, సావిత్రి.

కూర్పు సత్యం, నిర్వహణ. వెంపరామయ్య దర్శకుడు. తిలక్, నిర్మాతలు డి భాస్కర రావు, కొసరాజు భానుప్రసాద్. నవయుగ ఫిలిమ్స్ వారి ద్వారా యీ చిత్రం ఆంధ్రలో విడుదల అవుతుంది

* * *

రామకృష్ణా పిక్చర్స్ వారి "తారా శశాంకము" చిత్రం ఏప్రెల్ మాసాంతానికి పూర్తికానున్నట్లు తెలుస్తున్నది దేవిక గుమ్మడి, కాంతారావు, రామకృష్ణ, శోభన్ బాబు, వాణిశ్రీ, మిక్కిలినేని, అల్లు రామ లింగయ్య, బాలకృష్ణ ముఖ్య పాత్రలు, పోషిస్తున్న యీ చిత్రానికి రచయిత రాజశ్రీ సంగీతం టి వి రాజు, కెమెరా: జె సత్యనారాయణ, కళ రాజేంద్ర కుమార్ కూర్పు హరినారాయణ, దర్శకుడు: మానాపురం అప్పారావు, నిర్మాత కె సత్య నారాయణ జ్యోతీ ఫిలిమ్స్ వారు ఆంధ్రలో యీ చిత్రానికి పంపిణీదారులు

* * *

రామకృష్ణ యన్. ఏ టి కంబైన్స్ వారి "ఉమ్మడి కుటుంబం" నిర్మాణముపూర్తి అయింది యన్ టి. రామా రావు, సావిత్రి, కృష్ణకుమారి, ఎస్ వర లక్ష్మి, వాణిశ్రీ, ఎల్ విజయలక్ష్మి, సూర్య కాంతం, ప్రభాకరరెడ్డి, రేలంగి, రాజ బాబు, సత్యనారాయణ, నాగభూషణం ముఖ్యపాత్ర ధారులు రచన జూనియర్ సముద్రాల, సంగీతం టి. వి రాజా, కెమెరా. రవికాంత్, దర్శకుడు డి యోగా నంద్, [illegible]

కౌముదీ ఫిలిమ్స్‌వారి "కొంటెపిల్ల" వర్ణ చిత్రం యీ నెల 21 న ఆంధ్ర అంతటా విజయా పిక్చర్స్ వారి ద్వారా విడుదల అవుతున్నది. బి. సరోజాదేవి కాంచన, రాజసులోచన, ఎం. జి. రామ చంద్రన్, పద్మశ్రీ నాగయ్య, చంద్రబాబు, మాధవి మున్నగువారు నటించారు. మాటలు, పాటలు ఆనిసెట్టి, సంగీతం ఎం. ఎస్. విశ్వనాథం, కెమెరా: రెహమాన్, దర్శకుడు: రామన్న, నిర్మాత: ఎం. ఎస్. రెడ్డి. సర్కస్ దృశ్యాలు, సంగీతం యీ చిత్రంలోని విశేష ఆకర్షణలు. కూర్పు: బి. గోపాల రావు.

* * *

సుజాతా ఫిలిమ్స్ వారి "హంతకుని హత్య" యీ నెల 31 న విడుదల అవు తున్నది. కె. ఆర్. విజయ, యస్. వి రంగారావు, చంద్రబాబు, సావిత్రి,మనోహర్ ముఖ్య భూమికలు పోషించిన యీ అప రాధ పరిశోధక చిత్రానికి మాటలు: మహా రథి, పాటలు: ఆనిసెట్టి వ్రాశారు. సంగీతం ఎం. ఎస్. విశ్వనాథం, పామర్తి, కెమెరా: లక్ష్మణ్ గోరే, దర్శకుడు చంద్రబాబు నిర్మాత: పి. బాబ్జి.

— మోహన్ కుమార్ ●



[illegible]

## అవి - ఇవీ...

### 'ప్రేమవ్యూహం'

శ్రీ బి. వి. రమణారావు రచించిన 'ప్రేమ వ్యూహం' హాస్యరస ప్రహసనాన్ని ఇటీవలే 'కోనసీమ కెమిస్ట్స్ అండ్ డ్రగ్గిస్ట్స్ అసోసియేషన్' వార్షికోత్సవ సందర్భంలో, శ్రీవత్సా ప్రొడక్షన్సువారు అమలాపురంలో ప్రదర్శించారు. ప్రదర్శనానికి వివిధ ప్రముఖులు వచ్చారు.

### కటక్‌లోని ఆంధ్రా అసోసియేషన్

శివరాత్రినాటి సాయంత్రం ఆంధ్ర బాలికా బృందంవారిచే "స్వయంవరం" అనే ఏకాంకిక ఇచ్చట 'నారీసంఘసదనం'లో ప్రదర్శింపబడింది. మొదట శ్రీమతి రత్నా చంద్రశేఖరంగారు గానం చేసేరు. శ్రీ రామారావుగారు, శ్రీ హరిహరన్‌గారు వైలినూ, మృదంగం వాయించేరు. రామమూర్తిగారు వైలినూ హార్మోనియమూ వాయించేరు. శ్రీమతి శకుంతలాదేవిగారు వైలిను సోలో వాయించేరు. అయిదారు వందలమంది ఈ సమావేశానికి వచ్చారు. ఓ. వి.

## ఓడిపోయిన ఆనందం

(13 వ పేజీ తరువాయి)

నాకెన్నడూ లేదు. అందుకే నా నుదుట నీ వుంచిన కుంకం చెరిపేసాను.' అని అనె ఒక్కక్షణం ఆగింది.

ఆనందం ఆమె మాటలకు ఆశ్చర్యపోయాడు.

'ఆయన తనతోనే నా జీవితాన్ని కూడా తీసుకుపోయారు. నాలో యే ఆశలూ లేవు. ఆత్మహత్య చేసుకుని ఆయన హృదయాన్ని దుఃఖ పెట్టడం యెందుకని ఇలా జీవచ్ఛవంలా వుండిపోయాను.' అంటూ యేడ్చింది.

ఆనందం మనసు గిలగిల్లాడింది.

'బావా!... ముసలి నా ప్రవర్తనను మర్చిపోయి నేనెప్పుడైనా నీకు జ్ఞాపకం వచ్చినపుడు కాస్త సానుభూతి చూపిస్తే నాకంతే చాలు' అంటూ ఆనందం పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయింది.

'పద్మ విషయంలో నే నోడిపోయాను'—అనుకున్నాడు ఆనందం గతాన్ని స్మరిస్తూ.

పద్మ చాలా యెదిగిపోయింది.

అరుణను తనకు దగ్గరగా చేర్చి వెళ్ళిపోయిన ఆమె వ్యక్తిత్వం అంచనాలకు మించినది అనుకున్న ఆనందం హృదయంలో పద్మ ప్రతిమ నిలిచిపోయింది.





Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor. S. Sambhu Prasad.

